*Grateful acknowledgment is made to the Whanton School of Finance and Commerce, University of Pennsylvania for permission to quote from Research Report No. 11 (Industrial and occupationaltrends in National Employment) and the National Industrial Conference Board of New York, for permission to quote from studies in Labor Statistics No 3 (What an Hour's work would buy, 1914-48).*

*Sections of this book were privately issued in 1950 under title Classless Capitalism in U.S A.*



*New York, Rinehart & Co. Inc. Toronto.*

*Published by M/s. Higginbothams Ltd , Madras an Printed by Messrs. Kubera Printers Ltd., Madras*

# ఉపోద్ఘాతము

ఐరోపా ఖండంలో యుద్ధం మొత్తంమీద పూర్తి అయి నప్పటినుంచీ, ఇతర దేశాలలోని బంధువులూ, స్నేహితులు వ్రాసిన ఉత్తరా లనేకం రావటం ఆరంభించాయి. అందులో కొన్ని విషాద వార్తలు తెచ్చాయి. నాకు తెలిసినవారు, అభిమానస్థులు అయిన వారెందరో ఫాసిజంతో జరిగిన యుద్ధంలో మరణించారు. ఇంకా మరికొందరు హిట్లరుయొక్క విషవాయు గృహాలలోనూ, యుద్ధ ఖైదీ కేంద్రాలలోనూ అంతరించిపోయారు. కాని, కొన్ని ఉత్తరాలు వేరు విధంగా నాకు విషాదకరమైనవి. విద్యా, విజ్ఞాన వివేకవంతులైన పాత స్నేహితులు, పరిచయులు సోవియట్ యూనియన్‌పై అభి మానం చూపించటం ఆరంభించారు. కొందరు కమ్యూనిస్టు పార్టీలో చేరిపోయారు.

పాతది, అందరికీ తెలిసినది మాత్రమే కాక, ఇప్పుడు మరీ అధికంగా ఉన్న మరియొక తత్వంకూడా నాకీ ఉత్తరాలలో ప్రతి ఫలించింది. అమెరికాపై అయిష్టత చాలాకాలం నుంచీ ఐరోపా వారికి ఒక వైజ్ఞానికాలంకారంగా పరిణమించింది. కాని, ఇప్పుడు నా ఉత్తరాలు వ్రాసినవారిలో చాలా మంది అమెరికాను భయము, అసహ్యాములతో కూడిన అనుమానంతో చూస్తున్నారు.

కమ్యూనిజంపై దృష్టి ప్రసరించేవారికి అమెరికా అన్ని పాపా లకు అధిష్ఠానమైన, మూర్తీభవించిన పెట్టుబడిదారీ విధానంగా గోచ రిస్తుంది. కాని, మొత్తంమీద సాధారణంగా ఐరోపా వారంతా అమెరికాను విమర్శించే వారే అని తోస్తుంది. మాస్కోనుంచి ప్రవా హంగా వచ్చే అమెరికా వ్యతిరేక ప్రచారం మూలంగా, ప్రజా స్వామ్య వ్యతిరేకుల భావాలనుకూడా మార్పు గలుగుతోందనడానికి మాత్రం సందేహం లేదు.

క్రిందటి సంవత్సరం ఒకరోజున నా ముఖ్య స్నేహితుని తో బుట్టువైన ఒక ఫ్రెంచి వనిత ఒక నెలదినాలు గడపటానికై

న్యూయార్క్ పట్టణంలో గిగింగి ఆమె కమ్యూనిస్టులపై తన అభిప్రాయము తెలియజేయుటయే కాక నాకు తెలిసినవాళ్లలో గొప్ప మేధావంతుడు, ఉత్తముడు అయిన ఆమె సోదరుడుకూడా ఆ మార్గాన్నే అనుసరిస్తున్నాడని ఆమె చెప్పింది. యుద్ధకాలంలో రహస్య కమ్యూనిస్టు సంస్థలకు సహాయంతో ప్రారంభించి, క్రమంగా ప్రధాన కమ్యూనిస్టు వర్గాలకు తెగింతా ధనసహాయం చేస్తూండుట గాక ఇప్పుడు ఆ పార్టీలో చేరటానికి సిద్ధంగా నున్నాడు.

ఇంతకుముందు నేను కలుసుకున్న అనేకమంది ఇతరులవలె, అమెరికా జీవిత పరిస్థితులన్నీ తాను అనుకున్న దానికంటె వ్యతిరేకంగా ఉన్నట్టు గ్రహించానని ఈమె ఒప్పుకుంది. ఐరోపాలో ఆమెకు తెలిసిన ధనిక విధానంకంటే, సోవియట్ కమ్యూనిస్టు విధానంకంటె కూడా అమెరికా పెట్టుబడిదారీ విధానం చాలా ఉత్కృష్టమైనదని అనేక దీర్ఘ సంభాషణలలో నేనామెకు బోధించ ప్రయత్నించాను. అమెరికాను బయలుదేరినప్పుడు ఆమెకుండిన భావాలకు వ్యతిరేక భావాలతో ఆమె ఫ్రాన్సుకు తిరిగి వచ్చింది. ఈ అనుభవాన్ని పురస్కరించుకుని, ఒకప్పుడు ఐరోపా వాడినైన నా కళ్లతో అమెరికాలో నేను స్వయంగా చూసి గ్రహించిందాన్ని తెలియచేయటానికై పారిస్‌లో ఉన్న ఆమె సోదరునికి కొన్ని ఉత్తరాలు వ్రాయ నిశ్చయించుకొన్నాను.

ఈ ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ మొదట్లో నేననుకున్న దాని కంటె చాలా అధికమైపోయాయి. కమ్యూనిస్టు సిద్ధాంతప్రభావంలో ఉన్నవారికే కాకుండా, సంయుక్త రాష్ట్రాలనుగూర్చి పూర్వంనుంచీ ద్వేషభావాలున్న ఇతరులందరికీ కూడా ఈ ఉత్తరాలుపయుక్తంగా ఉండగలవని నాకు తోచింది. నే ననుకున్నంతలోనే నా ఉత్తరాలన్నీ ఒక చిన్న పుస్తక రూపం వహించాయి.

నన్ను దయతో దత్తం చేసుకున్న జాతికి ఈ ఉత్తరాల సముదాయాన్ని అంకితం చేయడంతో నాయొక్క గురుతర బాధ్యతను నెరవేర్ప ప్రయత్నిస్తున్నాను. ఒకటి ఐరోపాలోనూ, ఒకటి

అమెరికాలోనూ రెండు జీవితాలు అనుభవించి, సోవియట్ ప్రచారక యంత్రం ద్వారా ప్రమాదకరమైన అగాధంగా చేయ ప్రయత్నిస్తున్న ఒక చిన్నపిల్లకాల్వకు వంతెన నిర్మించటానికి యథాశక్తి ప్రయత్నించాలనే మానవులు చేసే ప్రయత్నమే నా యీ ప్రయత్నం.

అందుచేత అమెరికానుగూర్చి ఐరోపావారికి విపులంగా తెలియజేయుటయే నా ప్రత్యక్షమైన పని. దానితోపాటు వారి దేశాన్నిగూర్చి దురభిప్రాయ పడుటకుగల కారణాలను అమెరికా వారికి చూపించడానికి కూడా ప్రయత్నించాను. ఉభయజాతుల మధ్య గల మానసికాభ్యంతరాలను తగ్గించుటకు నా విశదీకరణ సహాయపడినచో, శాంతి సాధనకు ఇది ఇతోధిక ప్రయత్నం కాగలదని నే భావిస్తాను.

నాకు సలహాలను, విమర్శలను ఇచ్చిన వారిందరిలో ముఖ్యంగా, విలువైన సలహాల నిచ్చి వ్రాతప్రతి సంపాదకత్వంలో సహాయపడిన శ్రీమతి బెట్టినా హార్టెన్ బాచ్ గారికి నేను కృతజ్ఞుడను.

యఫ్. యమ్. యస్.

# విషయ సూచిక

అమెరికాలో కాపిటలిజమ్

# వర్గరహిత సమాజం

ఫ్రెడరిక్ మార్టిన్ స్టైర్న్

# సామాన్య లక్ష్యము

ప్రియమైన హెన్రీ.

గత కొద్ది సంవత్సరాలలోను మనం ఎక్కువ తక్కువ కాలవ్యవధులలో చిన్న చిన్న ఉత్తర ప్రత్యుత్తరాలను మాత్రమే వ్రాసుకుని యుండుటచేత నే నిప్పుడు వ్రాస్తున్న ఈ ఉత్తరం పొడవు నీకు ఆశ్చర్యం కలిగించటంలో సందేహం లేదు. ఒక పెద్ద అఖాతంవలన ఎడబాటు చేయబడిన ఉత్తమ పూర్వస్నేహితులలో ఇది సర్వసామాన్యమైన విషయం. క్రిందటి వారం పారిస్‌కు ఆన్ తిరిగి వచ్చిన తరువాత నీదగ్గరనుంచి కఠినమైన సందేశం వచ్చేవరకు మన ఎడబాటు కేవలం భౌతికమైనదే అని అనుకుంటున్నాను.

కాని, క్రిందటి నీ ఉత్తరం నన్ను చాల కలత పరిచింది. మాస్కోలో ప్రధాన కేంద్రస్థానం కలిగిన సంపూర్ణ సోవియట్ దేశపు శాఖయైన ఫ్రాన్సు కమ్యూనిస్టుపార్టీలో చేరటానికి ఆలోచిస్తున్నట్లు నాతో గట్టిగా చెబుతున్నావు. కనుక మా యోగక్షేమాలను తెలియజేస్తూ వ్రాస్తుండే మామూలు జవాబు విధానంలో కాక, నీవు ఆలోచిస్తున్న చర్య ఇదివరలో నీవు కాంక్షించి, ప్రయత్నించిన వాని కంతటికీ ఎందుకు వ్యతిరేకంగా పరిణమించగలదో నీకు బోధింప ప్రయత్నిస్తున్నాను. దయచేసి ఓపిక వహించి దీనిని పూర్తిగా చదువవలెను. నీవు ఆశతో ఎన్నుకున్న కార్యక్రమంనుంచి నిన్ను విముఖుణ్ణి చేయలేకపోతే అధమం నా ప్రయత్నం నేను చేసినట్లయినా అవుతుంది.

హెన్రీ! మధ్యవయసుకాలంలో మన యిరువురము నిశితస్పృక్షత్వం కలవాళ్ళం. కాని, యవ్వనపు పొంగులలో పొంగిపోయిన వాళ్ళం కాదు. ముప్పై సంవత్సరాలకు ఇంకా క్రితం ఎడింబరోలో మనం మొట్టమొదట కలుసుకున్నప్పటికీ కూడా, మన చిరకాలస్నేహాన్ని తలచుకుంటే మనం జాగ్రత్తగాను, తీక్షణభావ పూరితంగాను ఉండినవాళ్ళం అని తోస్తుంది. నీవు పదార్థ విజ్ఞానశాస్త్రంలోనూ నేను న్యాయశాస్త్రంలోనూ పనిచేస్తుండేవాళ్ళం. నిన్ను కలుసుకున్నప్పుడెల్లా నీవు స్వదేశ దురభిమానంలేని ఫ్రెంచి దేశీయుడవని అనుకొనేవాణ్ణి. "పురాతన జాతీయతా వ్యతిరేకుడ" నని నన్ను నీవు మెచ్చుకున్నావు. కేవలం ఆత్మదేశీయభావం కంటె, ఐరోపాఖండ పౌరుల మైనందుకు మనం గర్వించి ఉన్నాం అని అనుకుంటాను.

1937 నుంచి నా పౌరసత్వాన్ని నేను విస్తృతం చేశానని చెప్పవలసివుంది. నేను ఇప్పుడు సంయుక్తరాష్ట్ర పౌరుణ్ణి. యుద్ధంజరిగిన సంవత్సరాలలో నీ కంటె నేను అదృష్టవంతుణ్ణి. నాజీలతో యుద్ధంచేస్తున్న పుత్రునివద్ద నుంచి వార్తకోసం నిరీక్షించిన మనోవేదనలో మేము లక్షలాది ఇతర ప్రజలతో భాగం పంచుకున్నమాట వాస్తవం. కాని మీవలె ఫాసిస్టుల అక్రమ దురంతాలలో నివసించుట గాని, ఫ్రెంచి రహస్య గృహాలలో మీరు, మీ మిత్రులు అనుభవించిన భయంకర ప్రమాదాలకుగాని మేము లోను కాలేము. ఘోరమైన నాజీయంత్ర యుద్ధంలో సంవత్సరాలు

గడిపిన నీవంటి ప్రజలయందు మాకు పూర్తిగా అభిమానం ఉంది. ఆ యుద్ధంలో కలిగిన మనోభావాలు, స్నేహాలు మాకు చిరస్మరణీయంగా ఉండగలవని మేము గ్రహించాం.

యుద్ధకాలంలోను, యుద్ధానంతర జీవితాలలోను మన కున్న భేదాల నటుంచగా, మనకొక సమానమైన గతి చరిత్ర ఉన్నమాట తథ్యమేకదూ? 1930 లో నిన్ను చూచుటకు బెర్లిన్‌నుంచి పారిస్ వచ్చినపుడు జరిపిన దీర్ఘ సంభాషణలు గూర్చి, కొమ్టె తత్వభావాలుగల నీకు కాంట్ స్కోపెన్‌హార్ తత్వ భావాలుగల నాకు మానసికతత్వ దృక్పథాలలో తేడాలున్నప్పటికీ ప్రజాస్వామ్య సూత్రాలను గూర్చి, సాంఘిక న్యాయాలను గూర్చి, వ్యక్తి గౌరవం గూర్చిన భక్తి పట్టుదలలోను ఏవిధంగా ఏ కాభిప్రాయాలు కలిగివుండే వాళ్ళమో ఇప్పుడు ఆలోచిస్తున్నాను.

అమెరికా "రాజ్యాధికారానికి" నీ వ్యతిరేకతను ఈ రోజు క్లుప్తంగా వ్రాస్తున్నావు—చూడటానికైనా ఇక్కడకు రావటానికి కోపంతో నిరాకరించేటంతవరకు పోయింది నీ వ్యతిరేకభావం—ఐరోపా అంతా ఒక పెద్ద కారాగారంలా ఉంటే నీవు నీ పదార్థవిజ్ఞాన శాస్త్రంలోని క్రొత్తవిషయాలను గూర్చిన పనిలోను, నే నిక్కడ ఒకొక్కప్పుడు ప్రపంచాన్ని అలముకుంటున్న భయానక పరిస్థితులను పరిశీలించటంలోను, దానితోపాటు నా కప్పుడు సంబంధించిన మహత్తర జాతీయ విధాన చరిత్రలను అవగాహన చేసుకోటంలోను నిమగ్నులమై

ఉండుటచేత ఈ దురదృష్టపు సంవత్సరాలలో మనం చాలా దూరం విడిచిపోయినట్లుగా భయపడుతున్నాను.

ఒక విధంగా గతిసంవత్సరాలు నాకెంతో సాహసోపేతంగా కనిపిస్తున్నాయి. అమెరికా ప్రజలపై గాఢమైన అభిమానం ప్రబలి పోయింది. నీవు విన్నటువంటి విమర్శన అంతా ఎంతో ఉన్న నిష్పాక్షికమైన అమెరికావారి విమర్శన అని నా అభిప్రాయం— నాకు వారి నెక్కువ అభిమానస్థులుగా చేస్తుంది. సర్వజ్ఞత్వం నటించకుండా సంయుక్తరాష్ట్రాల అధ్యక్షునితో సహా ప్రతివారినీ నిశితంగాను, నిర్భయంగాను విమర్శించుటకు ఎక్కడ అందరికీ అధికారం ఉంటుందో అటువంటి దేశంలో జీవించటం నా అభిమతం. ప్రాణనష్టానికి సిద్ధపడితే గాని సంకుచిత గ్రుడ్డినమ్మకానికైనా వ్యతిరేకించుట కెవ్వరికీ అధికారంలేని దేశాలలో నివసించే ఆత్మగత జీవులనుచూస్తే నాకు జాలి కలుగుతుంది.

ఒక చిన్న కథతో నా అభిప్రాయాన్ని చిత్రిస్తాను. 1943 లో సిసిలీని జయించిన కొద్దికాలంలోనే ఈ సంఘటన జరిగింది. అది ఎండ తీక్షణంగా ఉన్న ఒక సాయం సమయం. ఆ దేశంలో జన్మించిన కొందరు అమెరికా వారితో కలిసి నేను నీడగావున్న ఒక హోటలు అరుగుమీద కూర్చున్నాను. అందులో కొందరి కుమారులు యుద్ధంలో ఉన్నారు. వారెన్నో ఫిర్యాదులు చేయుటం ఆరంభించారు. అమెరికా సైన్యంలో ప్రజాస్వామ్యం లేదనీ; ఉద్యోగస్తులకు మాత్రమే ప్రత్యేకింపబడిన హోటలు లేక ఫలహారపు శాలల్లోనికి

సైనికులను రానివ్వలేదనీ ఇంకా ఇటువంటి అర్థంలేని చిన్న సంఘటనలు మాత్రమే అన్నీ. వారు చెప్పేవన్నీ నిజమే కాని వీటి నన్నింటినీ వారు సరియైన దృక్పథంలో పరిశీలించాలని నేను నా స్నేహితులకు చెప్పాను. ఆ సమయంలోనే అనుకుంటున్న పాటన్ సంఘటన తెలియవచ్చింది. సిసిలీ విజయంలో ప్రముఖ పాత్రవహించిన జనరల్ జార్జిపాటన్ అనే అతడు యుద్ధరంగపు వైద్యాలయాన్ని పరిశీలించాడు. ఆ సమయంలో అతని జబ్బునుగూర్చి ప్రశ్నించగా ఒక సైనికుడు ఒక విధమైన నరముల సంబంధపు రోగమైన యుద్ధ బాధకు తనను వైద్యాలయంలో చేర్పించారని చెప్పగా ఆ సైనికుణ్ణి జార్జి పాటన్ ముఖంమీద కొట్టాడు. వైద్యాలయం అంతటినీ ఆగ్రహంలో ముంచిన ఈ సంఘటన పత్రికా ప్రపంచంలో ప్రకటింప బడింది. దీని ఫలితంగా ఆ సైనికునికి వైద్యాలయానికి, ఆ సైనికుని దళానికి, జనరల్ ఐసెన్ హోవర్డుకి కూడా జనరల్ పాటన్ క్షమాపణ చెప్పుకున్నాడు. "ఇది ఒక అమెరికన్ జనరల్ విషయంలో ప్రజాస్వామ్యసూత్ర విరుద్ధానికి ఉదాహరణ. కాని దానితోపాటు అమెరికా ప్రజాస్వామ్యౌన్నత్యానికికూడా ఇది ఒక ఉదాహరణ. ఎందుకనగా ఇదే మరియొక సైన్యంలో జరిగి ఉన్నట్లయితే ఈ విషయం అసలు ప్రజల దృష్టికి రాకుండానే పోయేదనుకుంటాను. జర్మనీలోనైతే వారా సైనికుని బహుశ ప్రేల్చి వేయుటో, లేక కఠినంగా శిక్షించుటో చేసివుందురు" అని నేను నా సహచరులతో చెప్పాను.

అప్టన్‌సింక్లేర్, సింక్లేర్ లెవిస్, జాన్‌స్టీన్‌బెక్ గార్ల కథల పుస్తకాలను మీరు చదివారు. ఈ గ్రంథాలు కల్పితగాథలైనా, క్రోధపూరితమైన రచనలుకావు. అందులో కొన్ని నేను చదివాను. అమెరికా సంఘాన్నిగూర్చి చిత్రించిన విచారకరమైన విషయాలు నాకు తెలుసు. కాని కల్పితగాథా రచయిత లందరు విషయాన్ని ఉత్ప్రేక్షిస్తారనీ, అధమం దేశపరిస్థితులనుగూర్చి సంపూర్ణ స్వరూపమైనా మీ కివ్వరనీమాత్రం మీరు దయచేసి జ్ఞాపకం ఉంచుకోవాలి. ఇంతకీ అమెరికా ప్రజల ఆత్మలను ఉద్రేకింపజేయుటయే వీరి మనసులోని గొప్ప ఆశయం. తమదేశంలోని తప్పును గ్రహించాలనే ఉద్దేశ్యంగల ఉన్నత తరగతి, ఉత్తమ మధ్యతరగతి అమెరికా దేశీయులే ఈ గ్రంథాల నధికంగా కొంటారు. లెవిస్, సింక్లేకర్, స్టీన్ బెక్‌లకు గోచరించి అమెరికా దేశీయుని సంపూర్ణ దారిద్ర్యము చాలాభాగం ఇతరదేశాలలో తక్కువ తరగతి వారిలో సర్వసామాన్యమే అని మరువకండి. విప్లవదారులను, జాతిమత ద్వేషాలను బోధించేవారినీ బయటపెట్టుతూ మా తప్పులను చూపి భావిపురోభివృద్ధికి తోడ్పడే విమర్శనాశక్తులు మా కెల్లప్పుడూ ఉంటాయని భావిస్తాను. ఎప్పుడైతే అటువంటి వాఙ్మయ ప్రకటనను ఆపివేస్తామో అప్పుడిది అభివృద్ధి అంతానికి సూచన కాగలదు.

ఈ ప్రదేశాన్ని గూర్చి చాలా విమర్శన ఉన్నమాట నిజమే, కాని, దాన్నిబట్టి ఆ రచయితలచేత చిత్రించబడిన

కొన్ని ప్రత్యేక ప్రదేశాలలో ఉన్నంత ఛండాలంగా మొత్తం అంతా ఉన్నదని అర్థంకాదు. మీరు అనుకుంటున్నదాని కంటె ఎంతో చాలా తేడా ఉన్నదంటే నమ్మండి.

పూర్వ మిత్రమా! ఇక్కడ విపరీతమైన విలాసాలతో జీవిస్తూ పనివారిని, తక్కువ మధ్య తరగతులవారిని స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటూ, తమ చిత్తంవచ్చి నట్లు ప్రభుత్వాన్ని నడుపగల శక్తిగలిగి నీచే "వాల్ స్ట్రీటు" అని పిలువబడే ఒక లక్షాధికారుల ముఠాకు లోబడి ఉన్నామని నీవు నమ్ముతున్నట్లున్నావు. దానితోపాటు అమెరికా పెట్టుబడిదారులు తమరాజకీయ పలుకుబడిని ప్రపంచం అంతా వ్యాపింపజేయుటకు ప్రయత్నిస్తున్నారనీ, నీ వనుకుంటున్నట్లు పనివారు కొనలేకపోయినా విపరీతంగా ఉత్పత్తి చెయ్యాలనీ, ఈ సరుకు సంతటినీ అమ్ముకోటానికి అధికంగా మార్కెట్ల కోసం వారు వెతుకుతున్నారనీ, నీ వాలోచిస్తున్నట్లుగా కనిపిస్తున్నావు. చివరికి సామాన్యప్రజలలోగల ఈ ఉత్పత్తి కొనుగోలు శక్తుల వ్యత్యాసం తీవ్రపరిస్థితులకు దారితీయ గలదని నీ వనుకుంటున్నావు.

ఇటువంటి నీ నమ్మకాలు నాకు చాలా శోచనీయంగా ఉన్నాయి. నీయొక్క విమర్శనాజ్ఞానాని కివి తగినట్లుగా లేవు. పైగా అమెరికా జీవిత సత్యాలలోని మూలాధారమే లేకపోటంచేత అమెరికా ఆత్మకే అవి అన్యాయం చేస్తున్నాయి. సరియైన దృక్పథంతో నీవు చూసినట్లయితే నీవు ఏ జాతిని,

విధానాన్ని ప్రేమించి మెచ్చుకొని ఉందువో ఆ జాతిని, విధానమును నీవు అసహ్యంతో నిందిస్తున్నావని నా నమ్మకం.

నా హృదయ పూర్వకమైన నమ్మకంతో ఇప్పుడెదంతా చెప్పుట నాకు సులభం. కాని, నేనిచ్చటికి నివాసంగా రాక పూర్వం నా అభిప్రాయాలు వేరు విధంగా ఉండేవని ఒప్పుకుంటున్నాను. కధల పుస్తకాలతోపాటు నేను అమెరికా ఆర్ధిక సమస్యలనుగూర్చి, పారిశ్రామిక సాంకేతిక విజ్ఞానం గూర్చి అనేక గ్రంధాలను చదివాను. సంయుక్త రాష్ట్రాలలో జీవితం బహుశః ఉత్సాహకరంగానే ఉన్నట్లు కనిపించిందేమో కాని నిజానికి అనాకర్షణీయంగాను, వ్యతిరిక్తంగాను ఉండేది. దేశాంతరవాసిగా నేనిక్కడకు వచ్చినప్పుడు, ప్రజలంతా నాగరికత, అందచందాల విలువ తెలియక నిర్లక్ష్యంగాను, కుయుక్తిగాను, ధనమే ప్రధానంగాను, సంపూర్ణమైన స్వార్ధపరులుగాను ఉంటారని నేననుకున్నాను. చివరికి నేనక్కడికి వెళ్ళి స్థిరపడిన తర్వాత రాజకీయ, సాంఘిక, వ్యక్తిగత విషయాలలో అచ్చటి ప్రజల సహాకారం, ఆదరణ, ధారాళం, శాంతగుణాలు చూస్తే నే పొందిన ఆశ్చర్యం నాకిప్పుడు బాగా జ్ఞాపకం ఉంది. అన్నిటికంటె ముఖ్యంగా ఇచ్చటి సాంఘిక, రాజకీయ పరిస్థితులు నేను భయపడినట్లుగాక పూర్తిగా వ్యతిరేకంగాను, నాకు నచ్చినట్లుగాను ఉన్నట్లు గ్రహించాను.

నా తరువాత ఇక్కడకు వలసవచ్చిన ఇతర స్నేహితు లందరూకూడా నా అనుభవమునే గ్రహించారు. వా రనుకున్న దానికంటె ఇచ్చటి సాంఘిక వ్యవస్థ, మానవప్రవృత్తి

ఎంత వ్యతిరేకంగాను, ఎంత ఉత్కృష్టంగాను ఉన్నాయో ఆశ్చర్య పడ్డారు. నాజీ హంతకులు పారిపోయినప్పుడు కూడా ఈ తీరాలకు వచ్చుటకు నిరాకరించిన ప్రజలెందరో ఉన్నారు. తరువాత నాజీల హస్తాలలో మరణించిన స్నేహితులకు, బంధువులకు అమెరికాలో ప్రవేశించుటకు అనుజ్ఞలు, ఉద్యోగాలు, ఇళ్ళు మొదలైన వారికి కావలసిన వన్నీ వాగ్దానం చేశారు. కాని, అమెరికా జీవితవిధానంలో వా రూహించుకున్న అధోగతికంటె అచ్చటి జీవనకష్టాలు. శిక్షలే ఉత్తమం అని భావించారు.

అసలు నిజానికి నాయొక్క, ఎందరో ఇతరులయొక్క ఊహాలకు అంత విస్పష్ట భేదం ఎందుకున్నదో తరుచు నా కాశ్చర్యం వేస్తుంటుంది. ఐరోపాలో మాకువచ్చిన సమాచారం అంతా తప్పా? కాదు. అందులో చాలాభాగం నిర్ధారణగా తెలుసుకున్నాను. అయినప్పటికీ మాకు అదో చిత్రంలాగ అలుక్కుపోయింది. దీన్నిగురించి నేను చాలా తబ్బిబ్బు పడ్డాను. కాని, చివరికి ఒక సంజాయిషీ దొరికిందని అనుకుం టున్నాను. ఐరోపా దేశీయుడు, తన నాగరికతా జీవితానుభవాలను ఆధారం చేసుకుని, సంయుక్త రాష్ట్రాలను గూర్చి తాను విన్నదీ, చదివినదీ అంతా ప్రచారం చేస్తాడు. ఇండియా, చైనాల విషయంలో అతడల్లా చేయడు. కాని, అతని దృష్టి అమెరికా జీవితంపై మళ్ళించగానే, ఇక్కడి జీవితంకూడా తనయొక్క సాంఘిక సిద్ధాంతాలపైనే ఆధారపడి ఉండాలని ఆలోచించకుండా ఉండలేడు. ఈ వాతా

వరణంలో ఉంటూ, అమెరికా జీవితభావాలను గూర్చి తాను విన్నవన్నీ సందర్భ శూన్యంగాను, గుడ్డిగాను, ఒక మధుర సంగీతంలోని అపశృతులవలె వినుగొల్పిస్తాయి.

నే నిక్కడ చూడలేను అనుకున్న నీచపు చిత్ర స్వరూపానికి కారణం తప్పుడు భోగట్టా కాదనీ, అసలు భోగట్టాను తప్పుడు వాతావరణంలో ప్రచారం చేయుటకు చేసిన ప్రయత్నమే అని కొన్ని సంవత్సరాలు నే నిక్కడ నివసించిన తరువాత గ్రహించాను. పశ్చిమ సంఘాన్ని గూర్చిన నా ఐరోపా జాతీయభావాలే ఈ విషయంలోని వాతావరణం. ఐరోపా దేశీయుని భావంలోని పశ్చిమసంఘం, అట్లాంటిక్ సముద్రానికీ వైపున లేదని నేను నేర్చుకున్నాను. దానికి బదులు నా దృష్టిలో చాలా దేశాలకు తెలిసిన సంఘానికంటె ఉత్కృష్టమైన సంఘం ఒకటి నా కిక్కడ గోచరించింది.

అసలు విషయాలను నీవు ముఖాముఖిగా చూసినట్లయితే ఇదే అనుభవాన్ని పొందగలవని నిస్సందేహంగా నమ్ముతున్నాను. లక్ష్యశుద్ధి అభివృద్ధి, భావాలుగల నీవంటి ఐరోపా దేశీయుల అసలు లక్ష్యాలతో చాలామంది అమెరికా వారు గట్టిగా అంగీరికస్తారని గ్రహించి ఆశ్చర్య పోయాను. మొత్తం జాతి అంతటికీ శాంతి సౌఖ్యాలను సమకూర్చాలని వారుకూడా అభిలషిస్తారు. సాధన సంపత్తిలేక, పరిహాసాల పాలైన ప్రజాసామాన్యానికి కారల్ మార్క్సు బోధించిన ఉన్నత లక్ష్యాన్నికూడ వారంగీకరిస్తారు. అదే వర్గరహిత

సమాజము. వారు దాన్ని స్వాతంత్ర్యము, సమానత్వము అంటారు. కాని, వారిభావంకూడా సమానమే. అందరికీ సమానావకాశం; సమాన గౌరవం. ఈ లక్ష్యం వారియొక్క ఉన్నతి పరంపరలో ఒక భాగమే. ప్రతీ ఉత్తమ అమెరికా దేశీయుడు ఆ లక్ష్యంతోనే జీవిస్తాడు.

మొట్ట మొదట ఈ ప్రకటన మీాకు అపహాస్యంగా ఉంటుందని ఇప్పుడు నాకు తెలుసు. సంయుక్త రాష్ట్రాలు వర్గ రహిత సమాజ లక్ష్యాన్ని కొంతవరకు ఇదివరకే గుర్తించిందని నేను చెప్పినట్లయితే, నేనొక చౌకబారు ప్రచారకుడననీ, లేక అర్థాలనేమిలో సిరిసిస్తున్నాననీ మీారనవచ్చు. ఐతే, సంయుక్త రాష్ట్రాలలోని సమాజంలో వర్గభేదాలు ఎంత మాత్రం లేనని చెప్పటం నా అభిప్రాయం కాదు. మార్క్సు బోధించిన సంఘంలోకూడా ఏ విధమైన వర్గభేదాలు లేవని కూడా నేననుకోటంలేదు. లెనిన్ చెప్పినట్లుగా ('ప్రభుత్వము—విప్లవము'లో) "మార్క్సు అతి జాగ్రత్తతో, మానవులలో తప్పనిసరిగా ఉండే హెచ్చు తగ్గులను బాగా పరిశీలించటమే కాకుండా, ఉత్పత్తి సాధనాలను అందరికీ ఉమ్మడి ఆస్తిగా మార్చినంతమాత్రం చేతనే పంపకంలోని చిక్కులను, రాచరికపు న్యాయంలోని హెచ్చు తగ్గులను తొలగించ లేవన్న విషయాన్ని దృష్టిలో ఉంచుకున్నాడు". పూర్తిగా హెచ్చు తగ్గులుగా ఉన్న ప్రజల లక్షణాలచేతను, ఇతర పరిస్థితుల చేతను "కమ్యూనిజంయొక్క మొదటి రూపం" లోనే జీవిత ప్రమాణాల సమానత్వాన్ని సృష్టించ లేవనికూడా లెనిన్

ప్రకటించాడు. మార్క్సుయొక్క ఏ ఇతర శిష్యులుకూడా "వర్గ రహిత సమాజం" అంటే కేవలం సర్వ సమానత్వం అని వ్యాఖ్యానించలేదు.

"కమ్యూనిస్టు సమాజంలోని ఉన్నత రూపం"లో "అవసరాలనుబట్టి" ప్రతివారూ "ఉచితంగా తీసుకోవచ్చు" నని లెనిన్ వాగ్దానం చేసినమాట సత్యం. "ఆస్తి పద్ధతి లేకుండా చేయుటవలన ఉత్పత్తిశక్తులు బ్రహ్మాండంగా అభివృద్ధి యగుటకు అవకాశం ఉన్నదనే గట్టి నమ్మకంతో" అతి డీ విధంగా జోస్యం చెప్పాడు. ప్రజలు తమంతట తామే శక్తినిబట్టి పనిచేయునంతగా "కష్టాన్ని ఉత్పత్తిక"గా" అది చేయగలదు. కాని, "వాని అవసరాలనుబట్టి" అనటంలో స్పష్టంగా ఇమిడియున్నది అందరికీ సంతృప్తిగాని సమానత్వం కాదు. సోవియట్ రాజ్యంలో మేనేజరు లేక కమిస్సార్ కు ఆమోదించబడి "అవసరాలు" కార్మికుల అవసరాల కంటె నూరునుంచి మూడు వందల రెట్లు అధికం. కమిస్సార్ యొక్క అవసరాలను ఎంతో అధికంగా సంతృప్తి పరచినప్పటికీ, కార్మికులకు తృప్తికర జీవితానికి కనీసపు అవసరాలైనా సమకూర్చ బడలేదు. నిజానికి 1931 జూన్ మాసంలో "ఉరవనిలోవ్కా" (జీతం సమానత్వం) గూర్చి వ్యతిరేకంగా స్టాలిన్ చేసిన గంభీరోపన్యాసం అసమానత్వానికి మహత్తర ప్రచారం ప్రారంభింప చేసింది. అప్పట్నుంచీ చట్ట విరుద్ధమైన తప్పకుండారిగా, సోవియట్ అధికారంలో సమానత్వం నసించి, అసమానత్వం అభివృద్ధి పొందుతోంది.

సోవియట్లయొక్క అంకెలు, ధర్మసూత్రాలు అటుంచితే, అందరికీ ఆర్థిక, సాంఘిక, సమానత్వం ఏ విధమైన సంఘం లోనూ ఎప్పుడూ సాధింప బడలేదు. అయినా "వర్గరహిత సమాజం" నిజంగా ఒక లక్ష్యమే కాదు; దాని నిజమైన అర్థాన్ని మనం అర్థం చేసుకుంటే దానిని సాధించవచ్చు. అంటే. ఈ వర్గాలు ఒకదానినుంచి ఒకటి దూరంగా విడి పోకూడదు. వ్యక్తులకు. ప్రతివానికీ వారి వారి శక్తిసామర్థ్యా లనుబట్టి అభివృద్ధి పొందటానికి అవకాశం ఉండాలి. జాతి నంతటినీ తను అధికారంలో ఇముడ్చుకుని. చట్టాలుచేసి, న్యాయాన్ని ఇష్టంవచ్చినట్లు మార్చటానికి తగిన ప్రత్యేకపు అధికారాలు ఏ వర్గానికీ ఉండకూడదని అర్థం. అంటే ఏ ఒక వర్గము ఇతర వర్గాల కష్టఫలాన్ని, వారి జీవనాధారమును దోచుకోటానికి అంగీకరించకూడదు. అంటే, ఏ వర్గము లేక జాతికూడా ఆర్థిక రాజకీయాధికారాలను తన హస్తగతం చేసుకోకూడదు. సోషలిస్టు సిద్ధాంతాన్ని కనిపెట్టిన మహా పురుషుడు నాశనం చేయదలచు కున్నది జాతివంటి కార్మి న్యాన్ని, వారి అధికారములను, రాజకీయాన్న త్యాన్ని మాత్రమేగాని సాంఘికవర్గాల జీవితం కాదు.

అమెరికాలోని వర్గరహిత సమాజాన్నిగూర్చి మాట్లాడి నప్పుడు నా మనసులో ఉన్నది ఇదే కాని వేరొకటి కాదు. చాలా ఇతర దేశాలలోవలె మా ఉత్తమ తరగతులకు ప్రత్యేకత ఏమీలేదనీ, వారు జాతి మొత్తంపైన అధికారం చెలాయించరనీ నా అభిప్రాయం. మా రాజ్యాధికారంలో

కార్మికుల భాగం వారికి పూర్తిగా ఉంది. ఆ కారణాన వర్గ ద్వేషంగాని, వర్గపోరాటంగాని లేదు. అటువంటి పోరాటానికి తగిన కారణంకూడా లేదు.

కాని, అమెరికా అనుభవం ఇంకా అధికంగా నిరూపెం చింది. రాజకీయాలలోనూ, పరిపాలనలోనూ కఠినమైన వర్గ విభేదాలు, వర్గాధిపత్యము, పరిశ్రమలోని లాభమును, ఉత్పత్తినికూడా తగ్గించగలననీ, ఈ పురాతన దురాచార నిర్మూలనవల్ల కార్మికులకు, పెట్టుబడి దారులకు కూడా లాభ కరమనీ అది నిరూపించింది. మొత్తంమీద అమెరికా సాంఘి కార్థిక వ్యవస్థవలన లెనిన్ కోరినట్లుగా ప్రతిపౌరుడు "శక్తిని బట్టి పని చేయుటకు" అవకాశం కల్పించింది. దానివల్ల పెద్ద బ్రహ్మాండమైన ఉత్పత్తి సృష్టించడమేకాక, అధిక సంఖ్యాక ప్రజలకు ఉన్నత జీవన ప్రమాణమును సమకూర్చినది. "వారి అవసరాలనుబట్టి తీసుకోటానికి" అది నిజంగా శక్తి నిచ్చింది. నాది పూర్తిగా వినకుండానే మిమ్ము వ్యతిరేకులనుగా చేసు కుంటారనే భయం — నిజానికి అది ప్రత్యక్ష ప్రమాణంతో నిరూపించిన ఒక విషయంగురించి—నాలో ఇంచు మించుగా ఉంది. సరే ధైర్యంచేసి చెప్పేస్తున్నాను :—మనం నేర్చుకో టానికి శ్రద్ధతీసుకుంటే, వర్గరహిత సమాజ ముఖ్యోద్దేశ్యాన్ని, అందరికీ అభివృద్ధి, గౌరవ సాధనను పెట్టుబడి విధానం లేకుండా సాధించ వీలులేదు. లోపలనున్న పూర్వ క్రోధం మనకు నమ్మకం కలిగిస్తున్నట్లుగా, అవి రెండూ ఒకదాని

కొకటి వ్యతిరేకం కాదు; అవి రెండూ కలసి మెలసి, పరస్పర సహకారం కలిగి ఉంటాయి.

నే నేదో చెప్పానుగదా అని నీవు అంగీకరించ గలవని నమ్మకంలేని ఆషా మాషీ ప్రకటన లివి. నీకు కొన్ని అసలు విషయాలు తెలిపి వాటికి నీ అభిప్రాయం తెలుసు కోవాలని నా కోరిక. అందుచేత, ప్రియమిత్రమా! నా వ్రాతలతో మితి మీరుతున్నానని నీ వ్రూహించుకోవనే ఆశతో ఇప్పటికి విరమిస్తున్నాను.* ఈ చర్చనుగూర్చి కొద్ది రోజులలో నీకు మళ్ళీ వ్రాస్తాను. త్వరలో నీవు ఉత్తరం వ్రాస్తావని ఆశిస్తున్నాను.

# 1776: ఒకదానిలో రెండు విప్లవాలు

ప్రియమైన హెన్రీ!

నా మొదటి ఉత్తరాని కింతవరకు జవాబు రాలేదు. కోపంతోనూ, క్రోధంతోనూ ఆ ఉత్తరం మూలబెట్ట లేదనీ, మన పూర్వస్నేహాన్ని బట్టి నీవు నా మాట వింటావనీ ఆశిస్తున్నాను. ఇదివరకటి నా ఉత్తరంలోని కొన్ని ప్రకటనలను ఈ రోజున వివరించ బోతున్నాను. అమెరికా చరిత్రలోని ప్రాథమిక విషయాలను కొన్ని నాతో కలిసిచూస్తే గాని, క్రిందటి ఉత్తరంలో నేను చెప్పిన విషయాలను నీ వర్థం చేసుకోలేవని నాకు తెలుసు.

ఈ దేశంలో అమెరికా విప్లవంతోనే ప్రారంభించబడిన వర్గరహిత సమాజ సిద్ధాంతం తొలుతనుంచీ వస్తూనే ఉంది. స్వాతంత్ర్యము, అవకాశము అభిలషించి ఇచ్చటకు వలసవచ్చిన వారినుంచే ఇది ప్రారంభమైన దనవచ్చు. ఐరోపానుంచి అమెరికాకు క్రొత్తగావచ్చినవారు క్రొత్తజీవితాన్ని, క్రొత్త పొలాదాను తెలుసుకన్నారు. ఇందుకోసమే వా రిక్కడకు వచ్చారు—17 వ శతాబ్దారంభంనుంచీ ఇక్కడకి వస్తూనే ఉండటానికీ అదే కారణం. వారిప్రయత్నాలకు అమెరికా విప్లవం జయం కలిగించింది. ఒకరాజు, రాజ్యాంగం అధికారం క్రింద లొంగడని అమెరికారాష్ట్రప్రజలను బంధించి ఉంచిన పాత బంధనాలను అది త్రెంచివేసింది. పాత విధానమును పునరుద్భవంచేసి, శాస్వతం చేస్తాయేమో అని భయపెట్టిన

పాతచట్టాలను, సంప్రదాయాలను చాలావరకు అది తుడిచి వేసింది.

అమెరికా విప్లవంగురించి ఇతర దేశాల వారికి ఎక్కువగా అర్థంకాలేదు. 1917 లోని రష్యా విప్లవంకంటెను, 1789 లో ఫ్రాన్సు విప్లవంకంటెను దీని ప్రాముఖ్యం నా దృష్టిలో చాలా ఫలప్రదమైనది. మనం అంతా విద్యావంతులమైనా—నిజానికి చాలా విద్యావంతులం—ఐరోపాలో ఈ చర్య ప్రాముఖ్యతను మనం తెలుసుకోనందుకు నేను చాలా ఆశ్చర్యపడ్డాను. కాని, బహుశః నేనంత ఆశ్చర్య పడనవసరం లేదేమో! ఎందుచేతనంటే, వాళ్ళయినా నిజంగా గ్రహించినట్లయితే, అమెరికా విప్లవాన్ని గురించి మన చరిత్ర గ్రంథాలలో వ్రాయకుండా ఉండటానికి చాలా బలమైన రాజకీయ కారణాలు ఉండాలి.

1776 లో మొట్టమొదటి 13 రాష్ట్రాలు బ్రిటిషు పాలన నుంచి స్వాతంత్ర్యాన్ని ప్రకటించి, తరువాత ఒక మహా సంగ్రామానంతరం దాన్ని జయించారన్నది సర్వజన విదిత మే. అమెరికా విప్లవం "నిజానికి ఒక్కదానిలోనే రెండు విప్లవాలు" అనే సంగతి చాలామంది ఐరోపావారు గ్రహించియుండరు. ఒకటి మాతృదేశంపై విప్లవం; రెండవది అదే సమయంలో సాంఘిక విప్లవం. 13 సంవత్సరాల తరువాత ఫ్రెంచి విప్లవానికి, ఆదిభూతమైన భావాలకు ఈ విప్లవం జీవశక్తుల నిచ్చింది. అమెరికా సాంఘిక విప్లవం తక్కువ ఉద్ధృతంతో

జరిగినా, మొత్తంమీద క్రమంగా అది ఫ్రెంచి విప్లవంకంటె విజయవంతంగా సాగిందని నా నమ్మకం.

పూర్తి ప్రజాస్వామ్య హక్కుల వాంఛయే అమెరికా రాష్ట్రాలవారు బ్రిటన్‌నుంచి స్వాతంత్ర్యాన్ని కాంక్షించటానికి కారణం. బ్రిటిషు అధికారాన్ని ఊడబెరికి ఎక్కువ శక్తివంతం చేయటానికి అమెరికాలో వంశపారంపర్యాధికారవిధానంగాని, రాజ్యాధికారివిధానంగాని, ధనికపాలనాధికారవిధానంగాని లేవు. ఫ్రెంచిరాజుల నిరంకుశత్వంవలె బ్రిటిషు పరిపాలన కఠినమైనది కాదు. కాని, 1776 లో జాతి, వర్గవిధానం మాత్రం ఉంది. అమెరికా సాంఘిక విప్లవం దాన్ని పూర్తిగా నిర్మూలించింది.

వంశపారంపర్య పరిపాలనాధికారం గల రాజసంశము, ఏకచ్ఛత్రాధిపత్యవిధానము రాజ్యాంగచట్టం వల్ల తుదిసారి కచ్చితంగా అంతరించి పోయాయి. తరతరాలుగా భాగించటానికి వీలులేక కుటుంబంలోని పెద్దకుమారునికే సంక్రమించే జమీందారీ విధానము, కప్పంచెల్లించే చిన్నచిన్న సామంత రాజుల విధానాలన్నీకూడా వానితో నశించిపోయాయి. బ్రిటన్, జర్మనీ దేశాలలో పూర్వకాలనుంచీ, మనతరం వరకూకూడా ఈ రాజరికపు శక్తిని శాశ్వతంగా చేశాయన్న సంగతి నీవు జ్ఞప్తి ఉంచుకుంటే, పై పద్ధతుల ప్రాధాన్యతను నీవు బాగా మెచ్చుకోగలవు. అమెరికా రాష్ట్రాలలో ఈ విధానాల ప్రభావం ఎంతగా ప్రతిష్టంభనాశక్తిని ప్రజ్వలింపచేసిందో వీటికి వ్యతిరేకంగా జాఫర్‌సన్ సలిపిన పోరా

టపు తీవ్రతయే సాక్ష్యం ఇస్తుంది. ఖాళీస్థలాలను ఆక్రమించుకోటానికిగల పూర్వ ప్రభుత్వ పరిమితాధికారాలు కూడా నశించాయి. పురాతనసామంత రాజ విధాన శేషమైన పన్నులు బాల్టిమోరులవంటి రాజవంశాలకు, ప్రభువుకి సాలీనా 1, 00, 000 డాలర్లు విలువగల అద్దెలు నిర్మూలింపబడ్డాయి. ఫిలిప్సుకి సంబంధించిన మైన్‌లోని సర్ విలియం పెప్పెరల్, న్యూయార్కులోని మోరిస్ డిలాన్సీకుటుంబాలు వర్జీనియాలోనిఫైర్‌ఫాక్సు కుటుంబం మొదలైనవారికిచెందిన పెద్దపెద్ద జామీందారీలను స్వాధీనం చేసుకోటం, చిన్నచిన్న వ్యవసాయ కేంద్రాలుగా విభజించటం జరిగింది. ఫ్రెంచివిప్లవం ధనికప్రభువులను తరిమివేసినట్లుగా, అమెరికా విప్లవంతో, ప్రభుత్వాన్ని, ఆర్థికజీవితాన్ని ఆక్రమించిన వేలాదిటోరీలను తరిమి వేసింది.

వీరిలో చాలామంది, తమకే అధికారాలు, ఆస్తులు ఇచ్చిన ప్రభువులుపోతే తమ ఆస్తులకు, అధికారాలకు భంగం వస్తుందని తెలుసుకున్న ధనికులే. కులతత్వానికి కడపటి అంతస్థయిన చక్రవర్తితోపాటు కులతత్వవిధానం సమూలంగా పతనం తథ్యమనే వీరిభయం సరియైనదే. ఆర్థికనష్టం కంటె సామాజిక సమానత్వం— అనగా కులతత్వనాశనం వారికిభరింపరానిది. విప్లవానంతరం టోర్చీలనేకులుతిరిగివచ్చారు. కాని, వారు క్రొత్తసాంఘిక వ్యవస్థకు తగినట్లు సర్దుకున్నారు.

ఈ క్రొత్తజాతివారు చట్టాలతో సహా సమస్తమైన వాటిని సంస్కరించటానికి పూనుకున్నారు. కొన్ని రాష్ట్రాలలో

సర్వాధికారంగా చర్చులు అనుభవిస్తున్న పదవభాగంపన్నును కూడా తీసివేశారు. ఐరోపాశిక్షాస్మృతి రాక్షసంగాఉన్న సమయంలోనే ఇక్కడ శిక్షాస్మృతికి మానవత్వాన్ని కలిగించారు. శీఘ్రకాలంలోనే స్వాతంత్ర్యం పొందిన రాష్ట్రాలు స్వంత శాసనాలు చేసుకున్నాయి. అనేక విషయాలలో మాతృదేశంకంటె ఇవి 50 సంవత్సరాలు ముందుకు పురోగమించాయి.

జీవితస్వాతంత్ర్యాలకు మాత్రమేకాక "సౌఖ్యసాధన" లో కూడా సర్వమానవులకు "భేదరహితపు హక్కు" స్వాతంత్ర్యప్రకటనలోని ప్రసిద్ధమైన మూలసూత్రమని నా అభిప్రాయం. ఐరోపాలో ఒక వర్గంవారికిమాత్రం ప్రత్యేక హక్కుగా ఉన్న ఆస్తిస్వాతంత్ర్యం ఇది అందరికీ ఇచ్చింది. లేక ఇదొక ధర్మసూత్రంగా ఉండటానికి వీలులేదు. "ఈ హక్కులను సంపాదించటానికే ప్రభుత్వాలు స్థాపించబడ్డాయి" అని చెబుతూ, స్వాతంత్ర్యప్రకటనవలన ప్రభుత్వాధికారినే, కుల, వర్గభేదం లేకుండా ప్రతివ్యక్తికి రక్షణగా చేయబడింది.

ఒకదాని తరువాత ఒకటిగా రాష్ట్రాలన్నీ సర్వజనులకు వోటింగు హక్కును స్థాపించి, వారి వారి పౌరులకు రాజకీయ సమానత్వాన్ని ఆమోదించాయి. 1776 లో ఆ విధంగా చేయుటకు పెన్సిల్వేనియా మొట్టమొదటిది. మిగతా రాష్ట్రాలు దాన్ని అనుసరించాయి. సంపూర్ణమైన పౌరసత్వపు హక్కులు సాధారణంగా సరియైన ఆస్తిపైన, కనీసమైన పన్నుల చెల్లింపుపైన ఆధారపడినప్పటికీ, 1840 సంవత్సరం నాటికి స్త్రీలు,

దక్షిణ భాగంలోని నీగ్రో బానిసలు తప్ప చాలామంది ప్రజలు పూర్తి వోటింగు హక్కును పొందారు.

ఇదంతాకూడా ఫ్రెంచి విప్లవం చేసినదానికంటె అధికం ఏమీ లేదనీ, బహుశః చాలా తక్కువేమో అని నీవు చెప్ప వచ్చు. కాని, ఒక గొప్ప తేడావుంది. ఫ్రెంచి విప్లవంయొక్క ఫలితాలు మొదటినుంచీ మితిమీరుటవల్ల, తరుచు మార్పుల వల్ల అనుమానాస్పదంగా ఉంటూ నెపోలియన్ వలన, బోర్బన్ రాజుల పునః ప్రతిష్ఠవలన చాలావరకు తుడిచి పెట్టుకు పోయాయి. ఏమైనా అమెరికాలో మాత్రం విప్లవ భావాలు ఎక్కువ ఆమోదం పొందాయి. అలెక్సిస్ డి టొక్విల్లీ అనే ఫ్రెంచి దేశీయుడు ఇంచుమించు నూరు సంవత్సరాలకుముందు "అమెరికాలో ప్రజాస్వామ్యము" అనే గ్రంథంలో (సూచిక జి. నుంచి 1 వ సంపుటి) చెప్పి నట్లుగా "ఫ్రాన్సులో ప్రజాస్వామ్యం ఇంకా నిర్మూలన కార్యంలోనే ఉంది; అమెరికాలో అది చేసిన సిధిలాలపై అది పరిపాలిస్తోంది."

క్రొత్త ప్రభుత్వ స్థిరత్వాన్ని, దాని భావాలనుకూడా విప్లవానంతరం అధికారానికి ఆ జాతి ఎన్నుకున్న వ్యక్తులను బట్టి విచారించవచ్చు. ఫ్రాన్సులో 1800 సంవత్సరం నాటికి 1789 విప్లవ వీరులొక్కరైనా ప్రముఖస్థానంలో కనపడరు- వారిలో కొద్దిమంది బ్రతికే ఉన్నారు—అమెరికా అనేక తరాల వరకూ స్వాతంత్ర్యపోరాటం నడిపిన వీరుల రాచకీయ విజ్ఞానము, మార్గదర్శకత్వమును వినియోగించుకుంది. 1789

సర్వాధికారంగా చర్చులు అనుభవిస్తున్న పదవభాగంపన్నును కూడా తీసివేశారు. ఐరోపాశిక్షాస్మృతి రాక్షసంగాఉన్న సమయంలోనే ఇక్కడ శిక్షాస్మృతికి మానవత్వాన్ని కలిగించారు. శీఘ్రకాలంలోనే స్వాతంత్ర్యం పొందిన రాష్ట్రాలు స్వంత శాసనాలు చేసుకున్నాయి. అనేక విషయాలలో మాతృదేశంకంటె ఇవి 50 సంవత్సరాలు ముందుకు పురోగమించాయి.

జీవితస్వాతంత్ర్యాలకు మాత్రమేకాక "సౌఖ్యసాధన" లో కూడా సర్వమానవులకు "భేదరహితపు హక్కు" స్వాతంత్ర్యప్రకటనలోని ప్రసిద్ధమైన మూలసూత్రమని నా అభిప్రాయం. ఐరోపాలో ఒక వర్గంవారికిమాత్రం ప్రత్యేక హక్కుగా ఉన్న ఆస్తిస్వాతంత్ర్యం ఇది అందరికీ ఇచ్చింది. లేక ఇదొక ధర్మసూత్రంగా ఉండటానికి వీలులేదు. "ఈ హక్కులను సంపాదించటానికే ప్రభుత్వాలు స్థాపించబడ్డాయి" అని చెబుతూ, స్వాతంత్ర్యప్రకటనవలన ప్రభుత్వాధికారమే, కుల, వర్గభేదం లేకుండా ప్రతివ్యక్తికి రక్షణగా చేయబడింది.

ఒకదాని తరువాత ఒకటిగా రాష్ట్రాలన్నీ సర్వజనులకు వోటింగు హక్కును స్థాపించి, వారి వారి పౌరులకు రాజకీయ సమానత్వాన్ని ఆమోదించాయి. 1776 లో ఆ విధంగా చేయుటకు పెన్సిల్వేనియా మొట్టమొదటిది. మిగతా రాష్ట్రాలు దాన్ని అనుసరించాయి. సంపూర్ణమైన పౌరసత్వపు హక్కులు సాధారణంగా సరియైన ఆస్తిపైన, కనీసమైన పన్నుల చెల్లింపు పైన ఆధారపడినప్పటికీ, 1840 సంవత్సరం నాటికి స్త్రీలు,

దక్షిణ భాగంలోని నీగ్రోబానిసలు తప్ప చాలామంది ప్రజలు పూర్తి వోటింగు హక్కును పొందారు.

ఇదంతాకూడా ఫ్రెంచి విప్లవం చేసినదానికంటె అధికం ఏమీ లేదనీ, బహుశః చాలా తక్కువేమో అని నీవు చెప్ప వచ్చు. కాని, ఒక గొప్ప తేడావుంది. ఫ్రెంచి విప్లవంయొక్క ఫలితాలు మొదటినుంచీ మితిమీరుటవల్ల, తరుచు మార్పుల వల్ల అనుమానాస్పదంగా ఉంటూ నెపోలియన్ వలన, బోర్బన్ రాజుల పునః ప్రతిష్ఠవలన చాలావరకు తుడిచి పెట్టుకు పోయాయి. ఏమైనా అమెరికాలో మాత్రం విప్లవ భావాలు ఎక్కువ ఆమోదం పొందాయి. అలెక్సిస్ డి టాక్వెల్లీ అనే ఫ్రెంచి దేశీయుడు ఇంచుమించు నూరు సంవత్సరాలకుముందు "అమెరికాలో ప్రజాస్వామ్యము" అనే గ్రంథంలో (సూచిక జి. నుంచి 1 వ సంపుటి) చెప్పి నట్లుగా "ఫ్రాన్సులో ప్రజాస్వామ్యం ఇంకా నిర్మూలన కార్యంలోనే ఉంది; అమెరికాలో అది చేసిన సిథిలాలపై అది పరిపాలిస్తోంది."

క్రొత్త ప్రభుత్వ స్థిరత్వాన్ని, దాని భావాలనుకూడా విప్లవానంతరం అధికారానికి ఆ జాతి ఎన్నుకున్న వ్యక్తులను బట్టి విచారించవచ్చు. ఫ్రాన్సులో 1800 సంవత్సరం నాటికి 1789 విప్లవ వీరులొక్కరైనా ప్రముఖస్థానంలో కనపడరు–వారిలో కొద్దిమంది బ్రతికే ఉన్నారు–అమెరికా అనేక తరాల వరకూ స్వాతంత్ర్యపోరాటం నడిపిన వీరుల రాచకీయ విజ్ఞానము, మార్గదర్శకత్వమును వినియోగించుకుంది. 1789

సంవత్సరంలో క్రొత్త రాజ్యాంగం ప్రకారం సంయుక్త ప్రభుత్వ స్థాపన జరిగినప్పటినుంచి, 1817 వరకు అధ్యక్షులుగా జార్జి వాషింగ్టన్ తరువాత జాన్ ఆడమ్సు, ధామస్ జాఫర్‌సన్, జేమ్సు మాడిసన్‌లు నియమించబడ్డారు. వీరందరూ "వ్యతిరేకులు" అని ప్రజలను చెప్పనీయకండి. "ప్రభుత్వాన్ని స్వాధీనపరచుకోకుండా ప్రజాసామాన్యాన్ని అదుపులో పెట్టిన" ఆ ఖాన్ ఆడమ్సే "ధనికులను అదుపులో ఉండేలా చేయటానికి కట్టుదిట్టాలు" కావాలని కోరాడు.

1829 లో సామాన్య ప్రజలకు చెందిన గొప్ప సైన్యాధికారియైన ఆండ్రూ జాక్సన్ ఆ మార్గం అనుసరించాడు. ధనికులు ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకోటానికి సలిపిన ప్రయత్నాలను ప్రతిఘటిస్తూ ఆయన చేసిన మహా యుద్ధానికి అతన్ని ఆ జాతి ఇంకా బాగా జ్ఞాపకం ఉంచుకుంది.

చార్లెస్ బియర్డ్ అనే చరిత్రకారునిచే "రెండవ అమెరికా విప్లవము" అని పేర్కొనబడిన అంతర్యుద్ధం 1861 లో జరిగింది. బానిసల కష్టంపై ఆధారపడిన దక్షిణ ప్రాంతంలో పెద్ద భూకామందులు కలిసి ఒక క్రొత్త కులంగా ఏర్పడ్డారు. దక్షిణ రాష్ట్రాలకు ఎదురులేని పాలకులుగా వారు చాలా పలుకుబడి సంపాదించారు. ఉత్తర పశ్చిమాలలోగల పెట్టుబడిదారులు, కార్మికులు, కర్షకులు కలిసి ఈ భూస్వామిక ప్రభువులను తరిమివేశారు.

ప్రత్యేక హక్కు-భుక్త్యాధికారాలపై అనుశ్రుతంగా జరుగుతున్న పోరాటానికి, 20 వ శతాబ్దంలో ప్రజాప్రతినిధి, ప్రజా

రాజ్యాభిలాషిమైన ఇద్దరు రూజ్వెల్టు లొక క్రొత్త శక్తి నిచ్చారు.

సంఘ సంస్కర్తలకు, పురోగాములకు ఇతర ఐరోపా దేశాలలోకంటె అమెరికాలో ఎక్కువ బలమైనస్థానం ఉంది. ఐరోపాలో వారు ప్రభుత్వ ప్రాథమిక చట్టాలతోనే పోరాడవలసి ఉంది. దానికి బదులు ఇక్కడ వారి కోర్కెలను ఇచ్చుటి రాజ్యాంగచట్టము, దేశపు అనుశృతాచారాలతోను ఎల్లప్పుడు సమర్థించుకోటానికి అవకాశం ఉంది.

ఇప్పుడు అందరికీ సాంఘికార్థిక న్యాయాలతో కూడిన వర్గరహిత జాతిని ఈ అమెరికా విప్లవం, ఒక మాట నొక్కినట్లు తీసుకు వచ్చిందని నా ఉద్దేశ్యంకాదు. కాని, మొత్తం మీద చాలాభాగం ఉన్నత వర్గాల ప్రాబల్యంతో ఒక పరివర్తకాలం వచ్చింది. పెద్ద లాభాలు గడించిన యజమానులు, పనివారలకు ఒక్కొక్కప్పుడు చాలా తక్కువ వేతనాలిచ్చారు. ముఖ్యంగా ప్రాంతీయ స్వపరిపాలనా శాఖలలోను, కొంతవరకు రాష్ట్రరాజ్యాంగ శాఖలలోనూ తరుచుగా ధనిక వర్గాలవారు సమర్థింపరాని పలుకుపడి చలాయించారు. అందువల్ల కలిగే కష్టనష్టాలను గూర్చిన కథలన్నీ యదార్థ స్వరూపంలోనే ఉండటంచేత సర్వసామాన్యంగా జమ కట్టె శాయి. మన సాంఘికచరిత్రలో క్రొత్త చట్టాలను, ప్రాముఖ్యం గల తీర్పులను కొన్నింటిని మాత్రమే ప్రచురించి నప్పటికీ, కోర్టులు, రాజ్యాంగసభలు అనేకమైన అన్యాయాలను, కష్టాలను అరికట్టి రక్షించాయి. అందుచేత, వాటికి సంబం

ధించిన కథ చాలావరకు, ప్రజలలో సాహసం లేనందువల్ల ఎన్నటికీపైకి రాకుండానే ఉండిపోయాయి.

గత 175 సంవత్సరాలలోనూ అమెరికాలోని ఐరోపా వారి అభిప్రాయాలలో కొన్ని చాలా విమర్శనా పూర్వంగా ఉన్నప్పటికీ, మొత్తంమీద ఐరోపాలోకంటె అమెరికాలోని పనివారి స్థితిగతులు ఉత్తమంగా ఉంటాయని తెలుస్తున్నది. కుల, వర్గ ప్రత్యేకతలు ఏమీ లేవనికూడా వా రంగీకరిస్తారు. పరిపాలనకు, ప్రజాపరిపాలనకు గల భేదాలనుగూర్చిన వాదోప వాదాలనుబట్టి, విప్లవానంతరం మొదటి 50 సంవత్సరాలలో క్రమంగా ఏకవర్గపాలన కోరేవారి ప్రాబల్యం తగ్గి, లింకన్ చెప్పి నట్లుగా "ప్రజలచేతనే ప్రజల ప్రభుత్వం" అన్నది పూర్తిగా సాధ్యమైనదని ప్రజలంతా గ్రహించారు. జాతీయ ప్రతిష్టంభనా సమయాలలో కలిగిన క్రొత్త ఉద్రేకాలనుబట్టి సాంఘికార్థిక సమానత్వ భావాలకు బలం హెచ్చింది. ఈ బలాన్ని ఉపయోగించుకోటానికి ఫ్రాంక్లిన్ డి. రూజువెల్టు తన శక్తిని, దూరదృష్టిని ఉపయోగించాడు. తర్వాత హెరీయడన్, ట్రూమన్ దానిని ధైర్యంగా నడిపిస్తున్నాడు.

వర్గరహిత సమాజానికి అమెరికా విప్లవం పునాది అని నాకుతోస్తుంది. గొప్ప, బీదలమధ్యగల భేదాన్ని అది తుడిచి పెట్టలేదు. కాని, వర్గ ప్రత్యేకహక్కు నిర్మూలన కది గొప్ప ప్రారంభోత్సవం.

సరే; హెన్రీ, ఇదొక ఉత్తరానికితగినంత చరిత్రఅయిందని ఊహిస్తున్నాను. తప్పకుండా జవాబు వ్రాయవలెను.

# 'వరము'—దాని అర్థము

ప్రియమైన హెన్రీ!

మిత్రమా! నా రెండు ఉత్తరాలకు నీవు వ్రాసిన సమాధానానికి కృతజ్ఞుడను. నా సమాధానం కూడా జాగ్రత్తగా ఆలోచించి వ్రాయటానికి ప్రయత్నిస్తాను.

నేను వర్ణించ ప్రయత్నంచేసిన చారిత్రక సంఘటనలకు మనకాలంలో ఏమైనా ప్రాముఖ్యత ఉన్నదా అని ఆశ్చర్యపడినట్లు వ్రాశావు. ఇంతకీ మానవజాతి, సాంఘిక సంస్థలు మన ఉత్పత్తి విధానమును బట్టి ఏర్పాటు చేసుకున్నవని మార్క్సు చెప్పాడు. యాటంశక్తి యుగంలో నివసిస్తున్న మనకు పాత కాలపు భావాలు లాభకరమా అని నీవు అడుగుతున్నావు.

ఆవిరి యంత్రము, రైలు రోడ్డు మొదలైనవి ఉద్భవించినప్పటికీ, మార్క్సు నివసించిన ఆ కాలం ఇప్పటికి చాలా పురాతనమైనదే అని మొదట మనం గ్రహించాలి. అయినా ఆతని సూత్రాలు అర్థరహితం కాదని నేననుకుంటాను. నీవూ నాతో ఏకీభవిస్తావని నా నమ్మకం. దానికి బదులు వానిలో శాశ్వతమైన గొప్పసత్యం ఇమిడియున్నదని నా నమ్మకం. ఆర్థికబలంగల ధనవంతులైన ఒకవర్గంవారి చేతిలో పరిపాలనాధికారం ఉన్నందువల్ల కలిగే నష్టాన్ని అతడు బయలుపరచి, దానికి బదులు అందరికీ సమానహక్కులు, అవకాశాలు గలిగిన ఒక వర్గరహిత సమాజం కావాలని అతడు కోరాడు.

ఈ నష్టాన్ని తొలగించటానికే అమెరికా విప్లవకారులు పోరాటం జరిపారు. వారి గమ్యస్థానంకూడా వర్గరహిత సమాజమేకాని, అమెరికా పద్ధతులకు, మార్క్సు సూత్రాలకు భేదం ఉంది. "వర్గము", "వర్గ సమాజము" అనే పదాల అర్థం నీవు పరిశీలించి నట్లయితే, ఈ భేదానికిగల కారణం బోధపడుతుంది.

"వర్గం" అంటే మనం రెండు విధాలుగా అర్థంచేసుకో వచ్చు. వృత్తిని బట్టిగాని, లేదా వారివారి జీవిత పరిమాణ మునుబట్టి గాని కొందరు కలిసి ఇతరులనుంచి విడిపోయి నివసించే ఒక జట్టువారని అర్థం చెప్పవచ్చు. నీ కిష్టం ఉన్నా లేకపోయినా అటువంటి వర్గం తప్పని సరియైనది. కష్టమును పంచుకోటం, వృత్తులను ప్రత్యేకించటం ఆధునిక సంఘంలో ఇదిరెండింతలుగా అవసరమైనది. ఒక విజ్ఞాన శాస్త్ర వేత్తగాని, ఒక కళాకారుడు గాని, ఒక కర్మాగారపు యజమాని గాని, ఒక గవర్నమెంటు ఉద్యోగిగాని, ఒక కర్మాగారంలో గాని, గనిలోగాని పని చేసే కూలివానివలె పనిచేయడు. ఆవిధంగా జీవించినట్లైతే అతని పని అతడు చేయలేడు. ఉత్సాహాన్ని, దక్షతను పురికొల్పి, ప్రతీవారూ తమ శక్త్యాను సారం పని చేయుటకు వారి తగిన ప్రతిఫలం ఏదైనా ఇవ్వాలి. ఈ విషయాలలో కలిగే భేదాల వలన మనం అనుకునే వృత్తి వర్గాలు ఉద్భవిస్తాయి. నే నిదివరకు చెప్పినట్లుగా ఈ వృత్తి

వర్గాలలోని భేదాల ఆవశ్యకతను ప్రపంచంలోని పనివారు సోషలిస్టులు, కమ్యూనిస్టులు కూడా ఆమోదించారు.

కాని, జన్మచేతనే మనుజులు తమ జట్టుకు చెందిన వారిని భావించే ఒక ప్రత్యేకపు హక్కు యుక్తమైన జట్టును కూడా మన 'వర్గం' అనవచ్చు. 'వర్గం' అనేది పూర్వపు రాజ్యాలలోని 'జాతి'కి నామాంతరం. అది మానవుని యొక్క మార్పు శక్యంకాని స్థిరాన్నత్వాన్ని తెలియజేస్తుంది. ఈ విధమైన వర్గమును మనం 'జాతి' అని చెప్పవచ్చు. కాని, జాతియొక్క హక్కులు న్యాయశాస్త్రం నిరూపిస్తుంది; జాతివంటి వర్గం సాధారణంగా కార్యరూపంలోనే కనుపిస్తుంది.

చాలావరకు ఐరోపా దేశాలలో ఉన్నత వర్గాలవారు మొన్నటివరకు న్యాయశాస్త్రరీత్యాకూడా కొన్ని హక్కులు కలిగి ఉండేవారు. 1718 వరకు ప్రష్యాలోని రాజులు, ధనికులు (జర్మనీలో 2/3 వంతు ప్రష్యా ఆక్రమించుకుంది) రెండు ఛేంబర్లలోనూ చాలాభాగం తమ స్వాధీనంలో ఉంచుకున్నారు. 1945 వరకు బ్రిటిషు ఉన్నత తరగతి ప్రజల్లో చాలామందికి ఒకటికంటె ఎక్కువ వోట్లుండేవి. ఈ న్యాయ చట్టరీత్యా ఉన్న లాభాలతో పాటు (ఇవి బహుశః చాలా ముఖ్యమైనవి) ఐరోపా ఉన్నత వర్గాలవారు అనుశ్రుతంగాను, సంబంధబాంధవ్యాలనుబట్టి చాలా లాభాలు పొందారు. చాలా దేశాలలో ప్రత్యక్షంగానో పరోక్షంగానో, న్యాయ చట్టాలు చేసే సంఘాలను చాలావరకు ఆక్రమించి, ప్రభుత్వపు న్యాయ

విచారణ కార్య కలాపాల శాఖలలో చాలా పలుకుబడిని చలాయించారు.

పూర్వ కాలపు పరిపాలక కులాలను జ్ఞాపకం చేసేవిధంగా ఈ రకమైన 'వర్గం' వారు ధనాన్ని, అధికారాన్ని సంపాదించుటకే ప్రయత్నిస్తారు. వారిపద్ధతులను "ప్రచారము" అనీ, లాభాలను "పరులకష్టార్జితం" అని పిలుచుట సక్రమమైనవి. ఇతరజనులు— ముఖ్యంగా కాయకష్టం చేసే పనివారు— సంపాదించిన ధనంలో కొంతభాగాన్ని ఈ తరగతి వారు బలవంతంగా తీసుకుంటారు. కొన్ని ఆదాయాలను, లేదా ఇవి రావటానికి మార్గాలైన కొన్ని ఆఫీసులను, ఉద్యోగాలను ప్రత్యేకంగా కొన్నికుటుంబాలకు గాని, ఆ తరగతి లేదా రాజు ఆమోదించిన కొందరు వ్యక్తులకుగాని ప్రత్యేకింపబడి ఉంటాయి. తరతమ భేదాలు లేకుండా అందరూ కేవలం శక్తిసామర్థ్యం చూపి ఆక్రమించటానికి వీలులేకుండా వాటికి అందపోటీ చేయటానికి వీలు లేకుండా చేశారు. ఇతర సదుపాయాలే కాకుండా, చాలా దేశాలలో ఉన్నత తరగతులవారికి, చట్టరీత్యాగాని ఇతర పరిపాలనావిధం చేతనో, పన్నులు లేకుండా చేశారు.

ప్రత్యేక హక్కులు గల తరగతిగాని, వర్గంగాని ఇతర తక్కువతరగతులకు దూరంగానే ఉంటారు. ఎందుచేతనంటే క్రొత్తవారి రాకవలన వారి లాభాలు తగ్గిపోవటంగాని, లేదా 'సామాన్యప్రజా' సాన్నిహిత్యంవల్ల తమ "గౌరవం" మైల పడటంగాని వారికిష్టంలేదు. దానికొక్క— 'గర్వము' 'గౌర

వము' వ్యక్తి గొప్పతనం వలన కాకుండా కేవలం సంఘ సభ్యత్వంపైనే ఆధారపడి యుండుటచేత ఆ తరగతి ఈ సభ్యత్వాన్ని అసూయావేశాలతో సమర్థిస్తుంది. భేదభావాన్ని స్పష్టంగా నిర్ణయించుటకై చిన్నపనులను, ముఖ్యంగా కాయకష్టమును గౌరవహీనంగా ఆ తరగతి నిరసించి వర్తక పారిశ్రామిక కార్యాలనుకూడా హీనంగా భావిస్తుంది. భోగంగా జీవితం గడిపేవారికి అది గొప్ప సంఘ గౌరవాన్ని ప్రత్యేకిస్తుంది. అటువంటి సంఘము కేవలం నిరుపయోగ శాస్త్ర కలాపాలపై వ్యయం చేస్తారు. వ్యక్తి ఉపయోగానికి ఉత్పత్తికి భంగం కలిగించే జూదం, త్రాగుడు మొదలైన వ్యసన ప్రవృత్తిని అది రేకెత్తిస్తుంది. తన ప్రత్యేక స్థానంలో ఆ తరగతి ఇతరులకష్ట, గౌరవాలపై జీవించటానికే ఆశిస్తుంది.

మార్క్సు, అమెరికనులుకూడా ఎదుర్కున్నది ఈ విధమయిన వర్గసమాజమే. కులతత్వాన్ని అసహ్యమైనదిగా అంగీకరించినప్పటికీ అమెరికావారు మార్క్సు సిద్ధాంతాలను మాత్రం ఆమోదించలేదు. వర్గభేదాలు లేకుండా ప్రతీవారూ వ్యక్తిగతంగా ఎంతభాగ్యమైనా, గౌరవమైనా, అధికారమునైనా సంపాదించటానికి వీలగునట్లుగా వారు దానికి బదులు పాలకులు ఇతర కుల వర్గాలవారికి గల ప్రత్యేకతలను ఏకైకాధికారములను నిర్మూలించారు.

పెట్టుబడిదారీ విధానానికి కులతత్వాధికారం జన్మతః ఉండే లక్షణం అని మార్క్సు నిర్వచించాడు. పెట్టుబడి

దారుడు ఆర్థిక రాజకీయాధికారాలను కలిపి తనలాభాలను తాను గడిస్తాడని మార్క్స్ చెప్పాడు. మరొకవిధంగా చెప్పాలంటే పెట్టుబడిదారీవిధానం పూర్వపు పరిపాలక తెగతుల వారితో సమానమైన పద్ధతులు అని చెప్పవచ్చు. మార్క్సిస్టులు కాని సోషలిస్టులుకూడా అధికవడ్డీవ్యాపారానికి మోసం, పరులకష్టార్జిత సంపాదన మొదలైనవి పెట్టుబడిదారీ విధానపు లక్షణాలని నిరూపించారు.

మార్క్స్ ఈ చెడులక్షణాలను పెట్టుబడిదారీ విధానానికేవిధంగా ఆపాదించాడో, ఇప్పటికీ అతనిభావాలు సరియైనవని ఐరోపీయనులెందుకు నమ్ముతున్నారో నేను తరువాత తెలియచేస్తాను. నిజమైన పెట్టుబడిదారీ పద్ధతికి కుల ప్రత్యేక హక్కులతోను, మోసంతోను, పరులకష్టార్జితంతోను ఏ విధమైన సంబంధం లేదని కూడా నేను ప్రత్యక్ష నిదర్శనంతో నిరూపిస్తాను. అమెరికావానికంటె ఐరోపావానికి పెట్టుబడిదారీ పద్ధతిలోని పర్యవసానపు శక్తులనుగూర్చి సరియైన, నిష్పాక్షిక దృష్టి కలిగియుండుట కష్టతరమైనప్పటికీ ఇది సులభమైన పనికాదు.

ఐరోపాలోని తమసోదరులు లోబడినంతగా, అమెరికా పెట్టుబడుదారులు — విప్లవంతో పురాతన కులసంఘనాశనానికి కృతజ్ఞులం—ప్రత్యేకాధికారసిద్ధాంతానికి లోబడిపోలేదు. ఆ విధంగా నేనుచెప్పే నిజమైన పెట్టుబడిదారీ తత్వము మిగిలిన చోట్లకంటె అమెరికాలోనే ముందుగా అభివృద్ధిపొందింది. దానిని బాగా గ్రహించటానికికూడా అదే అనువైన ప్రదేశం.

అమెరికా పెట్టుబడి దారుడు—లేదా "ఆధునిక" పెట్టుబడి దారుడంటే ఇంకా బాగుందేమో—తన పెట్టుబడిలో చాలా భాగాన్ని ధన సంపాదనకు కావలసిన టెక్నికల్ సాధన సామగ్రికి ఉపయోగిస్తాడు. పూర్వం యజమాని ఉత్పత్తికై మానవ కష్టాన్నే ముఖ్య సాధనంగా ఉపయోగించాడు; ఇప్పుడు తన పెట్టుబడి సాధన సామగ్రినే అతడు సాధ్యమైనంత ఉపయోగించుకుంటున్నాడు. దీనిలో కాయకష్టం చేసే పనివారు అతనికి స్నేహితులుగాను, భాగస్థులుగాను ఉండటం చేత వారికి క్రొత్త గౌరవ ప్రపత్తు లేర్పడుతాయి.

అందుచేత, ఒకనికి లాభం ఇంకొకనికి నష్టం కావాలనీ, కాయ కష్టంచేసే పనివారివల్లనే భాగ్యం సంపాదించాలనీ అమెరికా పెట్టుబడిదారుడు ఆలోచించడు. పెట్టుబడిదారులు భాగ్యవంతులైనందువల్లనే తమకు దారిద్ర్యం ఏర్పడుతుందని కూడా అమెరికా పనివారి భావం కాదు. దానికి బదులు అన్ని శాఖలలోని అమెరికా ప్రజలు నేను చెప్పే "ఉత్పత్తి సహకారం" అనే సూత్రాన్నే నమ్మివుంటారు. అంటే—స్వతంత్రులైన ప్రజలు పరస్పర సహకార ప్రయత్నాల ద్వారా, అందరికీ కావలసినంత—అంతకంటె అధికంగానూ—ఉత్పత్తి చేయగలమని నమ్మి ఉంటారు.

ఇది చాలా ఎక్కువ ఆశాపూరితమైన ఆశయం. దీన్ని సాధించటానికి మానవులలో ఒకరికొకరికి ఎడబాటు కలిగించే, దాటశక్యంకాని పూర్వపు అవరోధాలను పెట్టుబడిదారులు అధిగమించాలి. ఇతరులనుంచి లాగివేసుకోటానికైనా సిద్ధ

పడాలి. లేదా, విశ్వాసయుక్తమైన హృదయపూర్వక సహకారం ఇచ్చేవారితో నీవే కలిసిమెలిసి పనిచేయడానికి సిద్ధపడాలి. ఒకేసారి రెండూ కావాలంటే సాధ్యం కాదు. కుల తత్వసంఘము, అధికోత్పత్తి రెండూ కలిసిమెలసి ఉండజాలవు.

ఉత్పత్తి సహకారము సరియైన పెట్టుబడిదారీ విధానమునకు ప్రాథమిక లక్షణము. ఒక వ్యాపారము అందులో ఉన్నవారందరికీ లాభకరంగా ఉండగలదు; ఉండి తీరాలి. లేకపోతే అది "మంచి వ్యాపారం"గా పరిగణింపబడదు. నీకు పనివారైనా, కాతాదారుపైనా, ఎవరినుంచైనా బలిమిని, తీసుకోవడంగాని, అన్యాయం చెయ్యటంగాని నీతి విషయం ఎల్లావున్నా మంచి వ్యాపారం కానేరదు. పెట్టుబడిదారీ ప్రపంచంలో భాగ్యమే భాగ్యం సంపాదించగలదని అనుభవైక వేద్యము. పెట్టుబడిదారుల భాగ్యము పనివారికి, పనివారి భాగ్యము పెట్టుబడిదారులకు భాగ్యాన్ని సంపాదించటానికి మూలాధారం. అందుచేతనే స్వదేశంలోగాని, విదేశంలోగాని ప్రాపంచిక నిస్సబ్ధతకు కారణం తెలివి తక్కువే అని అమెరికావారు భావిస్తారు.

ప్రత్యేక హక్కు పద్ధతి నశించిన తరువాత పెట్టుబడిదారులీ అభిప్రాయము నలవరుచుకోవలసి వచ్చింది. జమీందారీ పద్ధతి నశించిన సంఘంలోని ప్రజలకు ఇష్టంవచ్చిన చోట పనిచేయుటకు, ఇష్టమైనవారితో వ్యవహరించుటకు అధికారం ఉంది. అందుచేత ఉత్పత్తిదారుడు, వ్యాపారస్థుడు కూడా

ఇతరుల నమ్మిక, మంచితనాలపై పూర్తిగా ఆధారపడవలసి వుంది. ఈ నమ్మికను సంపాదించటానికై వారు చాలా ప్రయత్నం చెయ్యాలి. విలువైన ఈ ఆస్తిని పాడుచేసుకోటానికి వారికి సామర్థ్యం లేదు. క్రమమైన అభివృద్ధి మార్గంలో పెట్టుబడిదారుడు తన ఖాతాదారుల అభిమానమునేకాకుండా, తన కాధారభూతమైన హృదయపూర్వక సహకారం ఇచ్చే ఉద్యోగస్థుల అభిమానంకూడా చూరగొనుట తెలుసుకున్నాడు. పెట్టుబడిదారీ విధానం ఒక నీతి సూత్రాల పుట్ట అని గాని, తమ స్వప్రయోజనాలకొరకైనా సక్రమ రీతిగా పెట్టుబడిదారులు సంచరించేవారనిగాని నా ఉద్దేశ్యం కాదని నీవు గ్రహించు. సంయుక్త రాష్ట్రాలలోకూడా ఇతర జాతిలో వున్నంతమంది కఠినులు, స్వార్థపరులైన వ్యక్తు లున్నారు. పెట్టుబడిదారులతో సహా అన్ని తరగతుల ప్రజలలోనూ తప్పుడు పనులు జరుగుతున్నాయి. కాని, చెడుగును, భాగ్యాధికారాలలో అవి నీతిపరుల యభివృద్ధినీ అరికట్టే సాంఘిక వ్యవస్థ ప్రపంచంలో లేదు. దండయాత్రలద్వారా కాలిఫ్‌ల జయాలనుంచి, రష్యాతో సహా ఇతర దేశాలలోని విప్లవాలవరకు, క్రొత్తరకపు ఉత్తమ ప్రపంచాన్ని నిర్మించటానికి ప్రయత్నించిన ఏ గొప్ప ఉద్యమ చరిత్రనైనా పరిశీలించు. అన్ని పతాకలక్రిందనూ, అన్ని అధికారాలలోనూ, అన్ని కాలాలలోనూ, దుర్మార్గులకు ధనము, అధికారము సంపాదించటానికి మార్గాలుంటూనే ఉన్నాయి. వారియొక్క జయము పెట్టుబడిదారి విధానపు అనర్హతకు, అవినీతికి

సాక్ష్యమైతే, ఏ ఇతర సాంఘిక వ్యవస్థను మలిసపరచటానికైనా అది ఉపయోగిస్తుంది.

కాని, ఏ విధానమైన అన్యాయాన్నీ, చెడును అధికార పూర్వకంగా ప్రోత్సహిస్తుందా? లేక, ప్రతిఘటిస్తుందా? కాలక్రమేణా ఆ విధానం జాతిలోని తక్కువ తరగతి ప్రజల స్థితిగతులను అభివృద్ధిపరుస్తుందా, లేక ఇంకా అధమాధమ స్థితికి తీసుకుపోతుందా? అని మనం ఆలోచించాలి. పూర్వ కాలపు కులతత్వంలో, ఒక ప్రత్యేక కులంవారికిగల ప్రత్యేకాధికారంవలన ఉన్నత తరగతి కులంవారు తక్కువ తరగతి కులాలవారిని తమ స్వార్థప్రయోజనంకోసమై ఉపయోగించుకుని వారిని బీద స్థితిలోనే ఉంచునట్లు బలవంతంగా తయారు చేశాయి. ప్రస్తుతం "పెట్టుబడిదారీ విధాన"రూపంలో ఎంత మాత్రం ఉందని నీ వనుకుంటున్నా, ఈ విధమైన శక్తికి నిజమైన ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ విధానంలో ఎంతమాత్రం తావులేదు.

ఒక్క ప్రక్క కులవర్గ సహిత సంఘానికి, రెండవ ప్రక్క నేను చెప్పే "వర్గరహిత పెట్టుబడిదారీ విధానానికి"గల విశేష భేదాన్ని బట్టి ఇంకా మరికొంత వ్యత్యాసం ఉత్పన్నం కాగలదు. కేవలం "పరపతి" మీాద ఆధారపడివుండే సంఘంయొక్క నియమాలు కఠినంగా ఉండవలసివుంటుంది. దానికి మార్పు అసహ్యాకరంగా ఉంటుంది. మతంలోగాని, విద్యలోగాని, భావాలలోగాని ఉన్నత కులంవారికి వంశపారంపర్య పద్ధతులే ఆమోదకరంగా ఉంటాయి. సాంకేతిక, అర్థిక

శాఖలలోకూడా వారు ఉన్న పాతపరిస్థితులనే పట్టుకు ప్రాకులాడుతారు. ఆ అధికారంలో ఉన్నవారికి ఏమాత్రం మార్పునైనా మామూలు వస్తు వాహనాలకే కాకుండా, గౌరవాధికారాలకు కూడా నష్టంగా భావించారు.

ఈ విషయంలో, కులతత్వ విధానం ఐరోపాలోని వ్యావసాయిక సంఘావసరాలకు తగినట్లుంది. 19 వ శతాబ్దం వరకు అన్ని జాతులకు వ్యవసాయం ప్రధానంగా ఉంది. మన కాలంలోవలె వ్యవసాయ క్షేత్రాలు దట్టంగా ఏర్పడక పోయినా, క్రొత్త నివాసాలకు చోటు దొరకటం దుర్ఘటంగా ఉండేది. ఒక క్రొత్త రైతుకోసమై పాతవా డొకడు ఖాళీ చేయవలసి ఉండేది. వారి ఆస్థులకు, వంశ పారంపర్యానికి భంగం కలుగుతుందనే భయంతో, పరిపాలకులేకాక రైతులు కూడా మార్పును గట్టిగా ప్రతిఘటించారు. అమెరికా సంగతి వేరు. తోటల నిర్మాణానికి అది లెక్కలేనన్ని స్థలాలిచ్చింది. ఆ విధంగా కేవలం పల్లెటూరి జీవితానికి అలవాటుపడిన థామస్ జాఫర్ సన్ వంటి సామాన్యుడే అభివృద్ధి, ప్రజాస్వామ్యవాది కాగలిగాడు. కాని, ఐరోపాలోని పల్లెటూరి నాగరికత పురాతనమైన కుటుంబాలనుంచి ఏమీ మారినట్లు లేదు. కులతత్వానికి ఆధారమైన పునాది ఇదే—ఉత్పత్తి శక్తి సామర్థ్యాలను అభివృద్ధి చేయటానికి కాక, కేవలం మార్పును, తత్ఫలితమైన నష్టమును అరికట్టుటకు మాత్రమే తయారు చేయబడిన విధానం.

ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ విధానం, అట్లుకాక, అభివృద్ధి, మార్పులపై ఆధారపడినది. ఆ వాతావరణంలోనే అది పురోభివృద్ధి చెందుతుంది; ముడిగిపోటం అంటే దానికి భయం. సామాన్య జనులను స్వార్థానికై ఉపయోగించటానికి, అధః పతనం చేయటానికి దాని శక్తుల నుపయోగించదు. ఆ శక్తులను ఉత్పత్తిని అభివృద్ధిచేయటానికి, నూత్న భావములను, భాగ్యములను, సర్వ జన సౌఖ్యాభివృద్ధులకు మాత్రం ఉపయోగిస్తారు.

అమెరికా పెట్టుబడిదారీ విధానంవలన, మానవ చరిత్రలోనే ఇదివరకు కని విని ఎరుగనంత అధికంగా, ఉత్పత్తి సహకారం అభివృద్ధి చెందింది. అనేక ఐరోపా దేశాలలో ఆర్థికాభివృద్ధికి ఆటంకమైన పురాతన కులతత్వ నిర్బంధాల నుంచి రక్షించుకొని మోక్షం పొందిన విషయాన్నిబట్టే, ఇది సాధించిన మహత్తర పురోభివృద్ధిని అధికంగా మెచ్చుకోవాలి.

# అమెరికాలో వర్గవిభేద విసర్జన

ప్రియమైన హెన్రీ!

కులతత్వపూరిత సంఘంలో ప్రత్యేక స్థానం కల వర్గానికి, అమెరికావంటి దేశంలో కేవలం "ఆచరణ ప్రాయపు" పెట్టుబడిదారీ వర్గానికి గల నా భేదానికి నీ వంగీకరించవు. "ఎల్లప్పుడు, ఎల్లచోట్లా ధనికులు గొప్పవులుబడి, శక్తులను కలిగి ఉన్నారు. వాటిని పనివారిని అణచిపెట్టి ఉంచటానికి సాధనాలుగానే ఉపయోగించారు" అని నీ వంటావు.

నీ ప్రకటనలో కొంత సత్యం ఉన్నదని నేను నిరాకరించలేను. నేనిదివరకు చెప్పినట్లుగా, సంయుక్తరాష్ట్రాలలోకూడా అందరు వర్తకులు, అందరు "పెట్టుబడిదారులూ" న్యాయప్రవర్తకులుకారు. ఐరోపావారికంటె అమెరికావారు దేవతలుకారు. వారిలో కొందరు పని వారిని స్వార్థోపయోగం చేసుకోటం మొదలైన నిశితవ్యాపారములవలన ధనం ఆర్జించారు. ఈ చర్యలలో తరుచుగా పెట్టుబడిదారులలో ఒకరికొకరు పోటీపడటంకూడా కలదు. కాని, ఎప్పుడూకూడా నిజాయితీ గల వ్యక్తు లున్నారని నేను పునరుద్ఘాటిస్తున్నాను. అటువంటివారు ఏ విధానంలోనైనా ఎప్పుడూ ఉంటారని నా ఉద్దేశ్యం. పరిస్థితులువృద్ధిపొందినా, విషమించినా దీర్ఘకాలపు పంథాలోనే ఒక విధానం యొక్క మంచిచెడ్డలు తెలియగలవు. మానవ గౌరవాన్ని, స్వాతంత్ర్యాన్ని వృద్ధిచేసి, సామాన్య జనుల జీవన పరిమాణంలో ఎక్కువ అభివృద్ధి చూపుట ద్వారా, సంయుక్తరాష్ట్రాలలోని ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ విధానము

తన మార్గాన్ని, గొప్పతాన్ని విప్లవంవలన కులవర్గ ప్రాబల్యపు సంకెళ్ళు తెగిపోగానే, సంయుక్త రాష్ట్రపు సంస్థలు, అను శృతాచారాలు, మార్క్సు దృష్టిలో ఉన్న ప్రత్యేక హక్కులు వర్గము తిరిగి జన్మించకుండా గట్టిగా అరికట్టాయి. ధనికులంతా ప్రత్యేకతను సుస్థిరం చేసుకోటానికి చేసిన ప్రయత్నాలు నీవు చూపించటం సరియైనదే. కాని, ఎప్పుడైతే అటువంటి ప్రయత్నం ప్రారంభం అయిందో కాలక్రమంలో అది నశించిపోయిందన్న ముఖ్యవిషయాన్ని జ్ఞాపకం ఉంచుకోవాలి.

అయితే, సంయుక్తరాష్ట్రాలలో సాంఘికార్థిక జీవితాలలో ధనికులు ప్రాబల్యం ఎక్కువగా ఉపయోగిస్తారు. ఒక్కొక్కప్పుడు ఈ పలుకుబడి వారి ధనికశక్తినిబట్టి వస్తుంది. కాని, తరుచు అది వారి ప్రాయత్నాల ప్రాముఖ్యత పైనగాని, వారి వ్యక్తిగత నిర్ణయాలు, అనుభవాల పైన ఆధారపడి వుంటుంది. ఎం. బరుచ్, విలియం. యస్. నుడ్సేన్ (జనరల్ మోటార్సు అధ్యక్షుడు) గార్లవంటి వారిని ప్రభుత్వం పిలిపించి, యుద్ధావసరాలకు కావలసిన సామగ్రి యుత్పత్తిలో సహాయం కోరారు. వారు ఇంకా అనేకులు ప్రత్యక్షంగా గాని, పరోక్షంగాగాని వారిస్వంతానికి కేమీ లాభంలేకుండా సేవచేశారు. ప్రస్తుతం నెల్సన్ రాక్ ఫెల్లర్, డబ్ల్యు. ఏవెరెల్ హారిమాన్ ఇద్దరు గొప్ప ధనిక కుటుంబాలకు చెందినవారు; పెద్ద ప్రభుత్వోద్యోగాలలో పనిచేస్తున్నారు. కాని, దానివల్ల వారి స్వంత వ్యాపారాభివృద్ధికి కవకాశం కలిగించలేదు.

అమెరికా సంయుక్తరాష్ట్రాలలో కేవలం ధనం మూలంగా న్యాయానికి మించిన రాజకీయ ప్రాబల్యం ఏ వ్యక్తికీ ఉండదు. తమ కుమారులకు, స్నేహితులకుగాని, లేక ఆ తత్వవాదులకు గాని ఉద్యోగా లివ్వాలని ప్రభుత్వాన్ని ఒత్తిడి చేయగల ప్రత్యేకాధికారాలు గల వర్గ మేమీ లేదు. అయితే, ధనికులు వారి అభ్యర్థులను మేయరుగాను, గవర్నరుగాను, లేక అధ్యక్షుడుగా నైనా చేయగలిగిన విషయాలు మాత్రం ఉన్నాయి. కాని, ధనమును, ప్రత్యేకతను నిశితంగా విమర్శించిన వారిని ఆ ఉద్యోగాలకు ఎన్నుకున్న విషయాలు కూడా సమంగానే ఉన్నాయి. ధనిక వర్గాలనుంచి వచ్చిన వ్యక్తులే పనివారి క్షేమానికి, గౌరవానికి, స్వాతంత్ర్యానికి ధర్మరక్షకులైన సంగతికూడా తరుచుగా ఉంది. ఉదాహరణకు, థియడోర్, ఫ్రాంక్లిన్ రూజువెల్టు లిద్దరూ కూడా అటువంటి వారే.

పనివారు యూనియన్‌గా ఏర్పడి, తమ కోర్కెలకొరకు సమ్మెలు జరిపే అధికారం కూడా సంపాదించని సమయం ఉండేది. సమ్మెదారులతో తుపాకులతో యుద్ధంచేసి సమ్మెను విఘ్నం చేయటానికి మనుష్యులను జీతాలపై తీసుకొని, కొన్ని సంస్థలవారు ప్రత్యేక సైన్యాలుగా ఉంచారు. ఒక్కొక్కప్పుడు 1894 లోని పుల్‌మాన్ సమ్మె సందర్భంలోవలె, రాష్ట్ర ప్రభుత్వము, సంయుక్తరాష్ట్రాల అధ్యక్షుడు కూడా పోలీసు, సైనిక దళాలను సమ్మెదారులపై ప్రయోగించారు. ఈ సంఘటనల నన్నింటినీ ప్రతిఘటించారు. ఈ ప్రతిఘటన

అధికంగా పనివారినుంచే సంభవించింది. పురజనులలో చాలా మంది అసమ్మతి తెలియజేశారు. పుల్‌మాన్ సమ్మె సందర్భంలో ఇల్లినాయిస్ గవర్నరు పనివారి తరఫున కలుగ చేసుకున్నందుచేత, త్వరలోనే చట్టములు, కోర్టుల వైఖరి కూడా మార్పు చెందింది. ఆలివర్ వెన్‌డెల్ హోమ్సు, లూయీ డి. బ్రాండిస్‌ల వంటి ప్రఖ్యాత సుప్రీం కోర్టు జడ్జీలు ట్రేడ్ యూనియనుల నామోదించుటకు మార్గ దర్శకు లయ్యారు. ఇప్పుడు యజమానులలో దురహంకారపు విధాన ములు మచ్చుకైనా లేవు.

ఎర్గ పరిపాలనా కాంక్షకై మరియొక్క ప్రయత్నం చేసి, అధికారమును ధర్మసంస్థలు ఒడంబడికల పరం చేసినందువలన పోటీ లేకుండా చేయబడింది. దీని విషయంలో కూడా కడుపు నిండిన పౌరులు ఏమీ జోక్యం కలిగించుకోలేదు. కాని, ఈ ధనిక శక్తుల ప్రభావం శృతిమించిపోయేసరికి థియడోర్ రూజు వెల్టు మనోనిశ్చయంతో నిశితమైన యుద్ధం సాగించాడు. అతని యుద్ధం కేవలం న్యాయచట్ట సంబంధమైన హడావిడి కాదు. అమెరికాలోని గొప్ప ధర్మసంస్థ లెంత తీవ్రంగా విచ్ఛిన్నమైపోయాయో యిరోపాలో ప్రచారం కాలేదు.

ప్రజల సాధారణ జీవనంలోకూడా సంఘం తన ప్రభావం ప్రతిఫలింప చెయ్యాలని నా ఆశయం. మానవుల సంపదలతో గాని, హోదాలతోగాని సంబంధం లేకుండా, మానవ గౌరవ, విలువలు గుర్తింపబడుతున్నాయనే భావం అందరికీ కలిగించాలి.

సంయుక్త రాష్ట్రాలలోకూడా కొన్ని కులతత్వ భావాలు మిగిలియున్నాయని నిశ్చయించవచ్చు. ఉదాహరణకి—ఒక పురజనుడు చాలా డబ్బు కర్చుపెట్టి, గుఱ్ఱాలు పశువులతో కూడా గొప్ప భూవసతిని సంపాదించి, పశుల దొడ్లనుంచి భరింపరాని దుర్గంధం బయలుదేరుతున్నా ప్రతి సంవత్సరం ఆ విలాసానికై ఎంతో ధనం కర్చుచేయటం పూర్వకాలపు జమీందారీ పద్ధతిగా నేను పరిగణిస్తాను. పురాతన జమీందారీ పద్ధతులను అనుకరించి గొప్పవార మనిపించుకోవాలని తంటాలుపడే డంబాలరాయుళ్లను అమెరికా లెక్కచేయదు. ఇటువంటివారు, వారి భార్యలు తమ తమ గొప్పతనం ప్రదర్శించుకోటానికి పడే తాపత్రయంకూడా ఎక్కువగా గుర్తించరు. ఇతర ధనిక సోదరులకు, పనివారికి కూడా ఇవి అధికంగా తెలిసినవే. "లార్డు—ఆఫ్—ది—మానరు" చట్టాన్ని పరిచితం చేసినట్లయితే తాను "తక్కువ తరగతి" కి చెందిన వాడినని భావించే అమెరికా పనివాడొక్కడైనా కనుపించడు. అతనికి హాస్యమును గురించి సజీవ పరిజ్ఞానం ఉంది. ముందు కాబోయే ఏ ధనికుడైనా అతని అపహాస్యాన్నుంచి తప్పించుకో జాలడు.

మొత్తంమీద అమెరికాలో సర్వసమానత్వ వాతావరణం నీకు గోచరిస్తుంది. నీవు చాలాకాలం ఇక్కడ ఉండే చూపరుడుగా రావాలని నేను ఎంతో అభిలషిస్తున్నాను. ఇక్కడ వ్యాప్తమైవున్న ఒక విపరీతపు తత్వాన్ని నీవు ఆమోదించగలవని నాకు ధైర్యం ఉంది. వర్గవిభేదాలు అతి

కనీసానికి తగ్గిపోయాయి. ఒకవేళ ఐరోపా పరిస్థితులతో సరి పోల్చిచూస్తే అసలు భేదాలే లేనట్లు తోస్తుందేమో! అని జీవితరంగాలలోని ప్రజలు ఒకరి కొకరు చూపే నిశ్చయమైన, నిష్కల్మషమైన నడతను నీవు సంతోషిస్తావు; ధనికులు, బీదలు కూడా ఒకరి కొకరు పరస్పరం కలుసుకుని ఆనందంగా అభి నందించుకుంటూ, చేతులు కలుపుకొని సంచరించే విధానం చూసి నీవు ముగ్ధుడవై పోతావు.

అమెరికాకు మనం మొట్టమొదటిసారిగా వచ్చినప్పుడు మన స్నేహితుని కారులో మనలను న్యూయార్కునుంచి వాషింగ్టన్ డి. సి. కి తీసుకుని వచ్చిన సేవకుడు మన పరిచయం అతనికి సంతోషం కలిగించిందని తెలుపుతూ సాయంత్రం నాతో కరస్పర్శ చేసిన దృశ్యం నా కెంత ఆనందాశ్చర్యం కలిగించిందో నా కింకా జ్ఞాపకం ఉంది. మరునాటి సాయంత్రం మనలను మౌంటు వెర్నాన్, వర్జీనియా – జార్జి వాషింగ్టన్ గృహము, ప్రస్తుతం ఒక జాతీయచిహ్నము – ప్రదేశాలకు తీసుకువెళ్ళిన కారుడ్రైవరు కూడా నాతో కరస్పర్శ చేశాడు.

వీథులలో కలుసుకున్న మనుష్యులు ఒకరినొకరు టోపీలు తీసి అభివాదించుకోరు. ఐరోపానుంచి ప్రేక్షకులుగా వచ్చిన వారి ఆచారం అనుసరిస్తేగాని యజమాని అయినా అతనికి వంగి నమస్కారంచేస్తేగాని అమెరికా వారి కది హాస్యాస్పద మైన భేదభావంగా తోస్తుంది. నావలెనే ."అమెరికాకు నూతన పురుషుడైన" నా స్నేహితు డొకడు, ఒక ముసలి ఫాక్టరీ పనివాడు తన కంపెనీ అధ్యక్షుని వీపుపై తట్టి, అతని

అసలు పేరుతో పిలిచి అతనికి చుట్ట ఇవ్వటంచూసి నిర్ఘాంత పడ్డాను. యజమాని పనివారల మధ్య ఈ ప్రవర్తన "సామాన్యమే" అని అంగీకరించటానికి అతనికి కొన్ని నెలలు పట్టింది.

అమెరికావారు మొరటుగాను, నిర్మొహమాటంగాను ఉంటారని ఐరోపాలో వారనుకుంటుంటారు. ఐరోపావారికి "చెడ్డఅలవాట్లు" గా కనుపించేవాటిలో చాలాభాగం వివిధ వర్గాలలోని భేదాలను ఏర్పరచే అలవాట్లను నిర్మూలించాలనే భావంతో అమెరికాలోని పురోగాములు చూపించేవి. పురాతన దురాచారాలపై తమకు గల అయిష్టతను నిర్భయంగా నిర్లక్ష్యంగా ప్రదర్శించటంలో అమెరికావారు ఆనందిస్తారు. వారు కాళ్లను డస్కుబల్లపై ఉంచుతారు. కోట్లు, టైలు ఎండలోనే తీసివేస్తారు; తమ తోటలలో త్రవ్వుతారు; లేక ఇళ్ళకు రంగులువేయుటకు సిద్ధపడతారు. వారిప్రవర్తన అగౌరవ ప్రదంగా ఉన్నదని ఐరోపావా రనుకుంటుంటే, వారు నవ్వుకుని ఆనందిస్తారు.

ఈ నిర్లక్ష్యాన్ని భరించుట సరియైన ఐరోపావారికి కష్టతరం. ఆ విధంగానే ఇక్కడ సంబోధనకూడా చాలా చనువుగాను, స్వేచ్ఛగాను ఉంటుంది. ఈ దేశంలో చాలాకాలం నివసించని ఒక స్త్రీ వస్తువిక్రయంచేసే యువతులు తనను ప్రియమైన" "మధురమైన" అని సంబోధించారని నాతో ఫిర్యాదు చేసింది. ఉద్యోగులు తమ యజమానులు ఉన్నతోద్యోగుల గదులలోనికి స్వేచ్ఛగాపోయి కూర్చొని సిగరెట్లు కాల్చుట తనకు చాలా ఆశ్చర్యం కలిగించిందని ఒక స్నేహి

తుడు చెప్పాడు. "అందులో కొందరు యజమానుని అతని అసలు పేరుతోనే పిల్చారు" అని అతడు నిర్ఘాంత పోయాడు. ఐరోపాలో మా స్నేహితుడు యజమాని గదిలోనికి పిల్చినప్పుడల్లా అతడు లాంఛనంగా కూర్చోమని చెప్పేవరకు అతడు సవినయంగా నిల్చునే ఉండేవాడు.

చిన్న పెద్ద తరగతుల వారిని సంబోధించుటకు వివిధ రకాలు బిరుదులు ఇక్కడ తెలియనే తెలియవు. వైద్యుడు మొదలుకొని అమెరికా అధ్యక్షునివరకు ఇక్కడ "మిస్టర్" అనే ఉపయోగిస్తారు. ఎవరైనా ఇంకొకరిని (సర్) 'అయ్యా' లేక 'ఔనండి' అంటే అనవచ్చు. "ఔను" అని గట్టిగా చెప్పటంకంటే ఇందులో అధికం ఏమీలేదు. 1932 లో ఒక అమెరికా స్నేహితుడు ఇంగ్లండులో కారులో సంచరిస్తూ, మరమ్మతు చేయించుకోటానికి ఒక మరమ్మతు కార్ఖానావద్ద ఆగవలసి వచ్చింది. అక్కడి మెకానిక్ పనివాడు వేసిన ఒక ప్రశ్నకు సమాధానంగా అతడు 'ఔనండి' అన్నాడు. ఇరువురు కొంతసేపు కష్టంమీదట నిశ్శబ్దంగా ఉన్న తరువాత కార్ఖానా యజమాని వచ్చి "నీ వేదో తప్పుచేసినట్లు అనుమానిస్తున్నాను. 'అండి' అని నీవు చెప్పి వుండకూడదు. ఇతడు నీకంటె తక్కువవాడు" అని చెప్పాడు. నా అమెరికా స్నేహితుడు మాట్లాడలేక పోయాడు. మరొకనాడు అతడొక విశ్రాంతిస్థలమువద్ద నిలిచి అక్కడి గొల్లవారితో మాట్లాడుటకు హోటలులో కూర్చున్నాడు. "పెద్దమనిషి" సామాన్యులు కూర్చున్న స్థలంలో కూర్చోటం తగదని గ్రహించి

హోటలు యజమాని అతన్ని లోపలి "ప్రత్యేక" సలా నికి ఆహ్వానించాడు. అమెరికా పౌరుని జీవితదృక్పథంలో ఒకభాగమైన ఈ సమానత్వ దృక్పథాలను దగ్గిరగాఉండి పరి శీలించినట్లయితే నమ్మటానికి వీలవుతుంది. ఒకటి, రెండు, మూడు తరగతులు లేని రైళ్ళలోనూ, భూగర్భ రైళ్ళలోనూ (దూరప్రయాణంచేసే పుల్‌మాన్ కార్లు ఒక్కదానిలోతప్ప) ప్రజలు ప్రయాణంచేయుట; ఉన్నతోద్యోగులు, గుమాస్తాలు, స్త్రీలు, సామాన్యకూలినాలి పనివాళ్లు — అంతహూ విభేదాలు లేకుండా ఏకపంక్తిలో ఒకేచోట భోజనాలు చేయుట మొదలైన దృశ్యాలు నీవు చూడాలని నా అభిలాష.

బీదవారి దుస్తులుగాని, ఉచ్చారణగాని, భాషగాని వేరువేరుగా లేవు. అమెరికాలో హైన్యజాతి ప్రజలే లేరు. ఐరోపా విద్యావంతుల క్లిష్టమైన విజ్ఞాన ప్రయోగములను, లాటిన్, ఫ్రెంచి పరిభాషను ఉపయోగించి ఇక్కడి ప్రజలు తమ విజ్ఞాన సంపదను వెల్లడించుకోరు. వర్గవిభేదాలను పెంపొందించటానికి విద్యను ఉపయోగించరు. నమ్మండి నమ్మకపోండి—క్రొత్త ఇంగ్లండు పట్టణంలోని ఒక గ్రంథాల యపు పనికత్తె ఆ పట్టణపు స్త్రీల సమాజానికి అధ్యక్షురాలు. కేవలం ఆమెయొక్క గుణగణాలనుబట్టి అనేకులు కాలేజీ పట్టభద్రుల వోట్లతో ఆమె యీ గౌరవస్థానాని కెన్నుకో బడింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో భాగ్యవంతుల ఇంటిలోనైనా, లేక ఉత్కృష్టమైన హోటలులోనైనా ప్రతి

భోజనం దగ్గిర ఒకగ్లాసు నీళ్లను ఇవ్వటం పర్గభేదాన్ని నిర్మూలించే ఒక పూర్వాచారంగా ఉండేది. అనేక ఐరోపా దేశాలలో మామూలు నీళ్లు బీదల పానీయంగా పరిగణిస్తారు. నీ అతిథులకు నీళ్లివ్వటం గౌరవాచారాలకు వ్యతిరేకం. పల్లె ప్రాంత గృహాలకు చుట్టూ ప్రహరీలుగాని, తీగలుగాని లేక పోవుట ఐరోపానుంచి వచ్చిన చూపరులకు సంభ్రమంగా ఉండేది. ఇది అనవసర కర్చు లేకుండా చేసుకోటానికే అని అనుకుంటారు. కాని, అసలు అటువంటి కర్చు అమెరికా ప్రజల కనవసరం. "బ్రహ్మాండమైన ఏకాంతవాసం"లో జీవించుట వారి కిష్టంలేదు.

మా పిల్లల స్వేచ్ఛ, యువకుల స్వాతంత్ర్యములుకూడా వర్గరహిత సమాజపు లక్షణాలే. జాతినంతను ఒక వర్గము, లేక కూటమి పాలనకు లోబరచాలనే అధికార పరిపాలనలో మానసిక స్థిరత్వం కూర్చే బాల్యంలోనే బాలురకు వినయ విధేయతలను నేర్పుట ప్రారంభించాలి. అందుకొరకే, రష్యా దేశపు రెండవ ఫ్రెడరికురాజు తన సైనికోద్యోగులను ఉపాధ్యాయులుగా నియమించుట, సోవియట్ దేశంలో యువకులను చాలాభాగం సైనిక పాఠశాలలోను, పనుల జట్టుల లోను, సైనిక సంస్థలలోను విద్యాభ్యాసం చేయించుట.

అమెరికాలో పిల్లలను స్వేచ్ఛా సమానత్వాలకొరకు విద్యాభ్యాసం చేయిస్తారు. మే మీదేశంలో ఇంకా పూర్తిగా స్థిరపడకముందే అప్పుడు ఎనిమిదేళ్ల వయసుగల మా అమ్మాయి ఇంటి గదులలోనే మొగ్గలువేయుట ఆరంభిం

చింది. నేను ఆమెకు బుద్ధిచెప్పటానికి ప్రయత్నిస్తే "ఔను, నాన్నా! ఇది స్వతంత్ర దేశం" అని సమాధానం ఇచ్చింది. ఆమె చెప్పినది నిజమే. ఉపాధ్యాయుల వద్దనుంచి బెత్తాలు పోయాయి. చాలామంది వేదికలపై తమ సర్వోత్కృష్ట స్థానాలకు స్వస్తి చెప్పారు.

చాలా ముఖ్యమైన దేమంటే, ధనికవర్గాలలో కూడా దేహశ్రమగాని, హీనమైన కూలిపనిగాని ఏ పనిపాటలకైనా సరే సంఘంలో అగౌరవం అనేది నీకు కనుపించదు. సమయానుకూలంగా అవసరమైన ఏ పని చేయటానికైనా సరే ఎవరూ సిగ్గుపడరు. ఉదాహరణకు, కాలేజీ విద్యార్థులు తమ సాంఘిక హోదాతో సంబంధం లేకుండా, సెలవు రోజులలో ఫ్యాక్టరీలలోనూ, విక్రయదారులుగాను, బంట్రోతులుగ కూడా పనిచేస్తారు. అమెరికాలో ఎప్పుడూ ఇల్లాగే ఉంది. కాని, చాలా ఐరోపా దేశాలలో, అధమం మొదటి ప్రపంచ యుద్ధానికి పూర్వం డబ్బుకోసం పనిచేసిన విద్యార్థిని, ముఖ్యంగా బంట్రోతుగా పనిచేసిన వానిని, తోడివారంతా నీచంగా చూసి వుండేవారు.

బాగా జరుగుబాటు గలవాని భార్య, ఇంకా డబ్బు సంపాదించుకోవాలంటే ఏదైనా పెద్ద దుకాణంలో విక్రయదారురాలుగా పనిచేసుకోవచ్చు. చాలామంది గొప్ప కుటుంబ స్త్రీలు తమ ఇండ్లను శుభ్రంచేసుకుని, వంట పాత్రలు తోము పనులు చేసుకుంటారు. భర్త ధనవ్యాపారియైనా, లేక పారిశ్రామికుడైనా ఇంటిలో ఉన్న సమయంలో ఆమెకు

సహాయంచేస్తాడు. క్రమంగా చాలామంది పెట్టుబడిదారులు, పనివారు ఒకే విధంగా తమ తమ విభేదాలను మరచిపో తున్నారు. ఐరోపాలోని ఉన్నత వర్గీయులైన చూపరుల కయిష్టమైనా, పనివారికుండవలసిన లక్షణాలను గూర్చి, కొంత వరకు వారి దుస్తులు, ఆచారాలతోసహా అమెరికా పెట్టుబడి దారులు ఆలోచించుకుని స్థిరంచేసుకున్నారు. పనివారుకూడా, వారి ఊహాలలో, అలవాట్లలోనేకాకుండా, ప్రాపంచికపు ఆస్థు లలోకూడా కొంతవరకు పెట్టుబడిదారు లయారు.

ఈ విధమైన వర్గవిభేదరాహిత్యంవలన స్వభావ సిద్ధ మైన స్నేహము, సహకారము ఏర్పడుతాయి. ప్రజలంతా హోస్యాలతో, బాతాఖానీలతో ఎదుటివాడు ఎవరో, ఉన్నత వర్గీయుడా, తక్కువ వర్గీయుడా అనే ఆశ్చర్యంతో ఒకరి కొకరు సహాయం చేసుకుంటారు.

అమెరికా సంఘంలోని వర్గతత్వ నిర్మూలనా భావము సైనిక శాఖలోకూడా గోచరిస్తుంది. ఇతర చోట్లవలెనే, ఆ యుద్ధ సైన్యాలలో, అవసరమైన నిరంకుశాధికారపు పద్ధ తులపై ఏర్పాటు చేయబడుటచేత, ప్రజాస్వామ్యాధికారాలు చాలా తక్కువగా ఉంటాయి. కాని, నే నిదివరకే ఉదాహ రించిన పాటన్ సంఘటనను జ్ఞాపకం తెచ్చుకో. సరిపోలికలు చూస్తే వర్గరహిత తత్వానికిగల అనేక సాక్ష్యాలలో ఇది ఒకటి.

మిలిటరీ ఆఫీసు ఉద్యోగాలకు పోటీ చేయుటకు, అతని శక్తి సామర్థ్యాలనుబట్టి అధిక వేతనాలు సంపాదించటానికి

ఎవ్వరినీ ఆటంక పరచటానికి వీలులేదు. ఉదాహరణకు, ఒక మేజరుద్యోగి యుద్ధంలో చూపిన ప్రతిభకు అతనికి బహూకరణ చేసినట్లు ఒక రోజున పేపర్లో చదివాను. "ఆ మేజరు బ్రూక్లిన్‌లో శ్రేఘాహాయుడు," అని ఆ వార్తలో ఉంది. ఈ విషయంలో రెండు విషయాలు నాకు ఆశ్చర్యం కలిగించాయి. అతని పౌర జీవితోద్యోగం అతని మిలిటరీ ఉద్యోగాభివృద్ధికి ఆటంకం కలిగించకుండటమొకటిది; రెండవది అతని ఉద్యోగం ప్రత్యక్షంగా పత్రికల్లో ప్రచురింపబడింది. ఈ దేశంలో జన్మించిన అమెరికా వారెవ్వరూ దీనికే మాత్రమూ ఆశ్చర్యపడరు.

అరవై సంవత్సరాల క్రిందట గొప్ప ఇంగ్లీషు చరిత్రకారుడు, న్యాయశాస్త్రవేత్త అయిన జేమ్సుబ్రైస్ బ్రిటన్‌లో వలె ఇక్కడి వర్గభేదాలు లేకపోవటమే అమెరికా, బ్రిటన్ దేశాలలోని జీవితాలకు గల వ్యత్యాసం అని సూచించారు. పురాతనాచారములు చాలావరకు నశించినప్పటికీ బ్రిటన్‌లోను, ఐరోపాలోనూ ఇంకా భేదాలు ఉన్నాయి. దైనందిన జీవితంలో మిగిలివున్న వేలకొలది అనుశ్రుతపు కులభేద చిహ్నాలు చాలామంది ఐరోపావారు గ్రహించలేకుండా ఉన్నారు. సహజంగా వారు అమెరికా వచ్చి ఇక్కడి ఆచార వ్యవహారాలు, జీవితం చూసి ఆశ్చర్య పడినప్పుడు వారి మాతృదేశాచారములను విమర్శించుకోటానికి వారంగీకరించరు. దానికి బదులు అమెరికా వర్గరహిత ప్రవర్తన చూసి దీనికి అమెరికావారికి "నాగరికత లేకపోవటం" కారణం అనుకుంటారు. వారి దేశంలో వలెనే లేనివాటి నన్నింటినీ వారు

నిందించి అపహాసిస్తారు. ప్రధానంగా వర్గభేద చిహ్నాలు కని పిస్తున్నప్పటికీ, అమెరికాలోని సంఘం వర్గరహిత గమ్యస్థానా నికే పురోగమిస్తోందని వారికి తెలియదు.

అమెరికాలో వర్గరాహిత్యం చాలా లోతుగా ప్రాకి పోయింది. "కులము" "హోదా" లనే స్మరణ లేకుండానే భాగ్యవంతులైన తలిదండ్రులు తమ బిడ్డలు చిన్నవయస్సులో వారికి దూరంగా ఉండటం అంగీకరిస్తారు. వారి కుమార్తెలకు కట్నాలిచ్చే ఆచారం వారికి లేదు. గొప్పవారి కీ, బీదవారికీ వివాహాలు ఇంగ్లండులోకంటే ఇక్కడ తరచు జరుగు తుంటాయి. ఇతర దేశాలలో పేరు వహించినట్లు అమెరికా వారికి డబ్బులో శ్రద్ధ దాన్ని సంపాదించే వరకేగాని దాన్ని దాచుకోటంలో లేదు. పెట్టుబడి ధనాన్ని ముందు తరాలవారి ఉపయోగార్థం జాగ్రత్తగా ఉంచాలి, అనే ఫ్రెంచివారి పిసిని గొట్టు పద్ధతి ఇక్కడ ఏ మాత్రమూ తెలీదు. ఎందుకనగా అమెరికావారికి "కులం పోతుంది" అనే బెంగలేదు. పోయే టటువంటి కులం వారికి లేదు. ఉన్నతకులం అనేది ఒక టుంటే— అది శాశ్వతంగా కట్టుబాట్లతో బంధింపబడిన కులంవంటిది కాదు. అది నీరువంటిది ; శాశ్వతమైనది.

ఆ విధంగా చాలామంది క్రిందికి దిగుతున్నారు. కాని ఇంకా అనేకులు దారిద్ర్యం, అసౌఖ్యాలను పారద్రోలి సౌఖ్యప్రదమైన మధ్యతరగతి స్థితికి వస్తున్నారు. కొంతమంది నిజమైన భాగ్యమును, పరపతిని సంపాదించగలుగుతున్నారు. కొందరు అదృష్టశాలురైన స్పెక్యులేషన్ వ్యాపారులు

కావచ్చు. కాని చాలామంది కష్టపడి పనిచేయుటచేత మనకు క్రొత్తవి, చౌకరకము, మంచివి అయిన నూతనవస్తు సృష్టి మొదలైన పనులద్వారా విజయాన్ని సాధించారు. ఇతర దేశాలలో తన విజయానికి ప్రతిష్టబడసిన హెన్రీ ఫోర్డు మాత్రమే కాక పరిశ్రమలో, వ్యాపారంలో, ప్రభుత్వంలో అభివృద్ధిపొందిన వారంతా 'అధమస్థితి' నుంచి వచ్చినవారే. స్టాండర్డు ఆయిల్ కంపెనీ స్థాపకుడైన జాన్ డి. రాక్ ఫెల్లర్ యునైటెడ్ స్టేట్సు స్టీల్ కార్పొరేషను స్థాపకుడైన ఆండ్రూ కార్నిగే; బెత్లెహెమ్‌స్టీల్ కంపెనీకి చెందిన ఛార్లెస్‌స్క్వాబ్; సేయర్సు రోబక్ కంపెనీకి చెందిన జూలియస్ రోసెన్‌వాల్డు; యునైటెడ్ ఫ్రూట్ కంపెనీకి చెందిన సామ్యుల్ జే ముర్రె; బ్యాంక్ ఆఫ్ అమెరికాను చెందిన ఏ. పి. జియన్నిని; జనరల్ మోటార్సు కంపెనీ అధ్యక్షుడైన విలియం నూడ్సెన్ అనే డేనిష్ పనివాడు; రీడ్, డిల్లన్‌లోని గొప్ప బ్యాంకింగు సంస్థ భాగస్తుడై, తరువాత అమెరికా యుద్ధశాఖలో మొదటి కార్యదర్శియైన జేమ్సు ఫారెస్టాల్; జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీ అధ్యక్షుడై తరువాత సైన్య సమీకరణ శాఖాధిపతిగా పని చేసిన ఛార్లెస్ ఇ. విల్సన్; మొదలైన వారినంతా ఉదాహరణగా తీసుకోవచ్చు. ఫ్రాంక్లిన్ రూజవెల్టుకు సలహాదారుగా పనిచేసిన కీ. శే. హారీ హాప్ కిన్సు జీవితంకూడా ఉదాహరణగా తీసుకోవచ్చు.

ఈ పురుషులు, ముందు ప్రఖ్యాతికిరాబోయేవారు కేవలం తెలివితేటలతోను, పరిశోధనా శక్తితోను, పట్టుదలతోనూ,

విజయపరంపరలను సాధించారు. వారందరూ స్వయంకృత దీక్షులు. ఐరోపావాడు వారిని "హఠాత్విజయు" లంటాడు. చాలామంది విఖ్యాత వ్యాపారులు ఒక వార్తాహరుడుగానో పండ్లమ్మేవానిగానో, లేక సాధారణ పనివాడుగానో జీవితం ఆరంభించినవారు. కాని అమెరికాలో గొప్పవారికి వారసుడుగా ఉండటంకంటె స్వయంకృతాధిక్యత నొందుటయే ఎక్కువ గౌరవప్రదం. కనుకనే ఒక మనిషియందు అతని పూర్వుల ప్రతిభను బట్టికంటె అతని స్వయంశక్తి ప్రతిభా విశేషాలను బట్టి మాత్రమే యెక్కువ గౌరవం చూపిస్తాము.

# పెట్టుబడిదారీ విధాన జననం

ప్రియమైన హెన్రీ :

ఈ దినమే నీవు నాతో వచ్చి 1950 అమెరికానుంచి 1850 ఐరోపావైపు వెనక్కు చూసినట్లయితే, ప్రజా స్వామ్యంలో అభివృద్ధి చెందిన ఆధునిక పారిశ్రామిక పెట్టు బడిదారీ విధానమును అర్థం చేసుకోటం అసాధ్యమని నీ వంగీక రిస్తావనుకుంటాను.

కేవలం ఆచరణకొరకు ఏర్పడిన కూటమియైన ఉత్పత్తి సాధనముల యజమానులను పెట్టుబడిదారీ "వర్గం" అని మార్క్సు తీక్షణంగా విశదీకరిస్తూ ఆరంభించాడు. చాలా మంది పెట్టుబడిదారులు చూపే నిర్దాక్షిణ్య స్వార్థ ప్రయోజ నాలు, కఠినమైన ప్రత్యేకతను, చాలా ప్రభుత్వాలు జరిపే పక్షపాతమైన విధానములనుబట్టి, ప్రత్యేకాధికారాలుగల కులానికిగల గుణాలను, విధానములను అత్యవసరమైన ఆర్థిక కార్యనిర్వాహకులైన వారందరికీ ఒక ఉమ్మడిగా అతడు ఆపాదిస్తున్నాడు. పెట్టుబడిదారులచే ప్రయోగింపబడిన అటు వంటి విధానములు నీతి నియమ రహితులైన కొందరు వ్యక్తులు దురాశను ప్రతిఫలింప జేస్తుందనీ, లేక పెట్టుబడిదారీ విధానములు పూర్వకాలంనుండి వచ్చిన చిహ్నాలుగావున్నవనీ అతడు గ్రహించలేదు. మరొక విధంగా చెప్పాలంటే పెట్టు బడిదారీ విధానంతో సంబంధం లేకుండా, ఇతర కారణాలచే ఉత్పత్తి అయ్యే అనేక లక్షణాలను అతడు పెట్టుబడిదారీ సంఘానికి ఆరోపించాడు.

మార్క్సుకి, ముఖ్యంగా అతని యవ్వనంలో అశాంతి పరిణామవాతావరణం గోచరించింది. ప్రతి యుద్ధంలోను, విప్లవంలోను, సాంఘిక వైజ్ఞానిక మార్పులు కలిగే కష్ట సమయాలలోను నీతి నియమరహితులైన లాభపరులు ఆ కష్ట సమయాల్లోనే తమ లాభాలకోసం ప్రాకులాడుతారు. ప్రభుత్వము, ప్రజలు మేల్కొనే లోపుగానే వారు, పనివారి నుంచి, ఇతర సామాన్య జనులనుంచి కూడా చేతనైనంత లాభాలు గుంజుకుంటారు. "క్రొత్త విధానం" లోని అసహ్యకరమైన, కఠినమైన పద్ధతులన్నింటినీ నిందించటంకంటె, అప్పుడే మొలక లెత్తుతున్న పెట్టుబడిదారీ విధానపు ప్రాథమిక లక్షణాలను గుర్తించుటకు శ్రమపడిన మార్క్సువంటి వాని కింత కంటె సహజ మేది?

మార్క్సుకు తగినట్లుగా ఇంకా ఆ కాలంలో ఐరోపా సాంఘిక జీవనంలో కులతత్వం అధికంగా ఉన్నదని మనం మరచిపోకూడదు. అతని జన్మస్థలమైన జర్మనీలోనే కాకుండా, అతడు "కాపిటల్" ను రచించిన ఇంగ్లండులో కూడా ఇది నిజం. కొంతవరకు ప్రజాస్వామ్య పద్ధతులలో కట్టుబడియున్న కొందరు సమకాలిక పరిశీలకులు గ్రహించిన దానికంటెకూడా ఇంగ్లండులో కులతత్వం అధికంగా ప్రబలివుంది. అయినా మార్క్సు సమకాలికులు కొందరు నిజ పరిస్థితులను ఇంకా యథాతథంగా గ్రహించగలిగారు; ఫ్రాన్సు ప్రభువంశీయుడైన అలెక్సిస్ డి టాకివిల్లి అనే అతడు వారిలో ఒకడు. అంతటా వ్యాపిస్తున్న ప్రజాస్వామ్య స్వభావమును, పారి

శ్రామికాభివృద్ధి నిజ పరిస్థితులను కనిపెట్టుటకు అతడు అన్ని దేశాలకంటె ఎక్కువ ప్రజాస్వామ్య దేశమైన అమెరికాకు వెళ్లాడు. ఈ అనుభవంతో బ్రిటన్‌లోని బీదల దీనపరిస్థితికి కారణం పెట్టుబడిదారీ విధానం కాదనీ, దానికి కేవలం ప్రభువుల ప్రాబల్యమే కారణమనీ అతడు నిరూపించాడు.

నిజానికి అనేక దేశాలలో ఇప్పటికీ ప్రజల రాజకీయ ప్రాబల్యం చెలాయించే వర్గం అంతా ప్రభువులే. చాలా మంచి పెట్టుబడిదారులు వారిని కలవటానికి ప్రయత్నించటమో లేక వారితో స్నేహ సంబంధం ఏర్పరచుకోటమో చేస్తు న్నారు. ఇతరులు రాజకీయంగా ప్రభువులను ప్రతిఘటించినా, వారి వారసులుగా భావించేవారు. వారు వారి అడుగు జాడ లలో పోయేవారు. ప్రథమ దశలోని ఈ పెట్టుబడిదారులందరి పరిస్థితికూడా "డాబుసరి" అనే మాటతో తెలుపవచ్చు. బ్రిటన్‌లోని సంఘీయుల జాబితాలో ప్రభువుల పేర్లతో కూడా కొన్ని సాధారణులపేర్లు కూడా ఉంటాయి. వీటికి ప్రక్కన "డాబుసరి" అని వ్రాసేవారు. అంటే ప్రభువులకు వలె భాగ్యం లేకుండా వారివలె డాబు చేసేవాడని అర్థం.

శతాబ్దాలుగా పరిపాలన సాగించిన శక్తులనుంచి పెట్టు బడిదారులు సాంఘికంగా గాని, రాజకీయంగా గాని ముక్తి పొంది బయటపడలేదు. అన్నిటికంటె, యజమాని, ఉద్యోగు లకు గల సంబంధాన్ని గూర్చి, ధనికులకు బీదలకుగల సంబంధం గూర్చి, ప్రభుత్వ బాధ్యత, పాత్రను గూర్చి, వారికున్న భావాలు చాలా కాలం పాత పంథాలలోనే ఉన్నాయి.

అందుచేత పెట్టుబడిదారీ విధాన ఛాయలతో నిండి, పాతపురాతన కులతత్వ విధానంతో నిండిన సంఘాన్ని మాత్రమే మార్క్సు వర్ణించి, ఎదిరించాడు. రష్యా, ఆస్ట్రియా వంటి దేశాలలో ఈ ఛాయలు కొద్ది మాత్రంగా ఉన్నాయి, బ్రిటన్, నెదర్లెండ్సువంటి దేశాలలో కొంచెం అధికంగా ఉన్నాయి. కాని ప్రతిచోటా ఈ ఛాయలన్నింటికీ పునాది పూర్వకాలపు కులతత్వమే. పెట్టుబడిదారి విధానపు చట్టములు, ఆచారములు, ఆంతరంగిక భావమును ఇంకా నిర్ణయించుకొనవలసి ఉంది. 19 వ శతాబ్దంలోని ప్రజల జీవితమును, అవసరమైతే, ఆనందం గూర్చి వారి అభిప్రాయములను, గౌరవము, సరియైన ప్రవర్తన, వేషభాషల విధానములు, అలంకారములు. గృహములను గూర్చి వెనుక చూసి జ్ఞాపకం తెచ్చుకో. ఇవన్నీ చాలావరకు పూర్తిగా పెట్టుబడిదారీ ప్రజాస్వామ్యాల పూర్వపద్ధతుల ననుసరించి తెచ్చుకున్నవి. సాంకేతిక విజ్ఞాన వ్యాపారముల మానవ సంబంధం ఏమీ లేదు.

మానవుని ఊహాల ప్రధానోద్దేశ్యం కేవలం తాత్కాలిక కారణంగాని, నిజమైన జీవిత విలాసములు కావు, కాని అతని గౌరవాభివృద్ధి, సభుత్వాలుకూడా ఈ సాంఘిక కోద్దేశ్యాలనే అనుసరించాయి. వారి దృష్టిలో ఉన్నత తరగతులవారిని తక్కువ తరగతివారి ఒత్తిడినుంచి రక్షించటమే వారి ధర్మం. పురాతనపు కులతత్వ సంఘానికి బదులుగా పెట్టుబడి దారీ

విధానానికి సాంఘిక స్వరూపం అవసరమని కొద్దిమంది గ్రహించారు.

ఈ క్లిష్ట పరిణామమును గ్రహించ లేకపోవటంచేత మధ్య తరగతి వ్యాపారులయొక్క, సోషలిస్టుల యూహాలను అణచి వేశాయి. మన కాలంలోకూడా, 1932 నుంచి 1950 వరకు హార్వార్డ్ యూనివర్సిటీలో ఆధ్యాపకుడై, చాలా విషయా లలో అమెరికా పరిస్థితులను గూర్చి తీక్ష్ణంగా గ్రహించిన విఖ్యాతుడైన ఆస్ట్రియా ఆర్థికవేత్తయైన క్. శే. జోసెఫ్ షూమ్పిటర్, (పెట్టుబడిదారీ విధానం, సోషలిజం, ప్రజా స్వామ్యం అనే గ్రంథంలో) "పూర్వకాలపు జమీందారీ వ్యవస్థయొక్క ప్రస్తుత స్వరూపమే పెట్టుబడిదారీ విధా"మని ఆశ్చర్యపడ్డాడు. అమెరికా వానికిది అర్థ రహితం కావచ్చు. ఐరోపావారైన వేలకొలది పెట్టుబడిదారులు, పనివాళ్లు, ఎక్కువ ఆలోచించక పోయినా, కొంత వేదాంతతత్వంతో వారు పొందే భావాల నిది వ్యక్తం చేస్తుంది.

అయితే పురాతన సాంఘిక వ్యవస్థ స్వరూపములే భావి సాంఘిక వ్యవస్థ చిహ్నాలని మార్క్సు అపార్థం చేసుకోటంలో ఆశ్చర్యంలేదు. పెట్టుబడిదారులు కేవలం ఆచరణ యోగ్య మైన ఒక కూటమి మాత్రమే అని అతడు గ్రంహించ లేక పోయాడు. అతను కేవలం ప్రత్యేక హక్కులను పాలించే 'వర్గం' మైన జలగలు: ఇచ్చిన దానికంటే, ఉత్పత్తికన్నా అతని దృష్టిలో వారు అత్యధికంగా తీసుకునే వారు ; వారి ఉపయో గార్హతల వలన కాకవారు ఉపయోగించే మాయశక్తి చేతనే

వారి హోదానుభవించేవారు. అందుచేత విప్లవం ద్వారా వారిని పడగొట్టాలని అతను నిశ్చయించాడు. కార్యరూపంలో కులవర్గపరిపాలనా స్వభావమే "ప్రభుత్వం" అని అతడు భావించి, ఆ నిర్ధారణతో కులవర్గరూపాలు నసిస్తే ప్రభుత్వం "మాయమైపోతుంద"నే ప్రఖ్యాత నిశ్చయానికి వచ్చాడు.

మనం అంతా మరిచిపోటం సహజమైనట్లే, ఒక ఒక జాతి నూతన సిద్ధాంతాన్ని, నూతన సాంఘిక సూత్రాలను అవలంబించటానికి తరాలు, శతాబ్దాలుకూడా పట్టగలవనే సంగతి మార్క్సు మరిచిపోయాడు. 1850 సంవత్సరపు మేఘాలలో ధనికులుగాని, పనివారుగాని, కులతత్వ వాతావరణంలో మునిగిపోయినందువల్ల, అప్పుడే తోసికొని వస్తున్న పారిశ్రామిక పెట్టుబడిదారీ విధానపు మహత్తర శక్తులను చూడలేకపోయారు. మార్క్సు కాలపు జనుల మనస్సులపై పూర్వ కాలపు జమీందారీ పద్ధతియొక్క శక్తికి ఉదాహరణగా, ప్రథమంలో జర్మనీ సోషలిజానికి అనుకూలుడైన వారిలో ఒకడైన ఫర్డినాండ్ లాసల్లీయొక్క ఖర్మనే చిహ్నంగా తీసుకోవచ్చు. ఒక జమీందారిణియొక్క ప్రేమ కలాపంలో చిక్కుకొన్నందువలన అతడు తన చేతనే ప్రోత్సహింపబడిన ద్వంద్వ పోరాటంలో ప్రాణాలర్పించాడు. తన ఆత్మ వినాశనమునకు సాధనంగా పాతకాలపు సాంఘికాచారాలతో చాలా సేవ పద్ధతిని తానే నిర్ణయించుకున్నాడు. రష్యాదేశపు ప్రీవీ కౌన్సిలరు, లడ్విగ్ వాన్ వెస్టుఫాలెన్ అనే ప్రభువు కుమార్తెను పెండ్లాడి మార్క్సు తానే

పురాతన కుల సంఘంవైపు దృష్టిని మళ్లించటం కన్న గత్యంతరం లేకపోయింది. నీతి సూత్రాల ప్రకారమైనా, దాని నతను పెట్టుబడిదారీవిధానంకంటె ఉన్నతస్థానంలో ఉంచాడు. "పూర్వకాలపు, గౌరవప్రదమైన అనిరూపాభిప్రాయాలతో స్థిరమైన, కట్టుదిట్టమైన బంధుత్వాలన్నీ తెగిపోయాయి". (పెట్టుబడిదారీవిధానంలో)... "గట్టిగా ఉన్నదంతా గాలిలో కలిసిపోతుంది. పూజ్యప్రదమైనదంతా అపూజ్యమై పోయింది. (కమ్యూనిస్టు కార్యప్రణాళికలో) ఈ సూత్రాన్ని సమర్థించుకో టానికి అప్పుడప్పుడు మారుతున్న చారిత్రిక దృక్పథాన్ని కూడా మార్చివేశాడు. ఉదాహరణగా-స్కాట్లండులో చాలా మంది ప్రభువులు తమ రైతులను తీసివేసి భూములను వేట భూము లుగా చేయ ప్రయత్నించగా, దీనిని అతడు క్రూరమనీ, అన్యాయమనీ, ఈ ప్రభువులకు ఆపలద్వారా అనేక లాభాలు గడించాలనే ప్రధానోద్దేశ్యమనే భావంగల బ్రిటిష్ రచయిత మాటల నుదహరిస్తూ పెట్టుబడిదారుల దురాశకు ఉదా హరణగా సరియైన జమీందారీ పద్ధతి అని వివరించాడు.

మన శతాబ్దంలో కూడా చాలా మంది జనులు పెట్టు బడిదారీ విధానము కులతత్వ పద్ధతియొక్క స్వరూపమే యని నిందించి తప్పుచేశారు. ఈ సందర్భంలో ఇదివరకు కమ్యూనిస్టు లైన వారు (పార్టీ సభ్యులు లేక అభిమానులు) ఆరుగురు. "అపజయం పొందిన దేవుడు" అనే గ్రంథంలో ప్రకటింపబడిన స్వాంత వాఙ్మూలములను నీవు పరీక్షించాలని నా అభిప్రాయం. తిని అయిదవ ఏట "ఒక పెద్ద మనిషి తన కుక్కను ఒక బీద

స్త్రీ పైకి ఉసికొల్పగా అది ఆమెను కరచి క్రింద పడకొట్టి, దుస్తులను చింపి బాగా గాయపరచుట” నేను చూశాను అని ఇడ్నీ జామెసిలోనే అనే అతడు తెలియచేశాడు. ఇది, ఇంకా ఇటువంటి కులతత్వదురహంకార క్రూరకృత్యాలవలన చాలా అసహ్యం కలిగింది. కాని, వారికి పెట్టుబడిదారీ విధానంతో ఏమీా సంబంధం లేదు. తన చుట్టుపక్కల తాండవిస్తున్న దారిద్ర్య బాధల నేమాత్రం లెక్కచేయకుండా కేవలం తమ కళావిలాసాలను మాత్రం ఆనందిస్తూ జీవించే ధనికుని జీవితమైన తన జీవితములో కూడా ముఖ్యంగా కాలనీలలో అతడు చవిచూసిన ఘోరమైన అనుభవాలను బట్టి ఆంద్రీ గైడీ అసహ్యించుకున్నాడు. నిజంగా అక్కడున్న వర్గభేదాలు, వర్గ ప్రత్యేకతల ద్వేషాలను బట్టియే అతనికి అసహ్యం కలిగింది. అతడు కమ్యూనిజాన్ని స్వీకరించాడు. అయితే ఇవే దుస్థితులు అచ్చటి సోవియట్ మతాధికార పరిపాలనలో కూడా గోచరించాయి.

స్టీఫెన్ స్పెండర్ వర్గ ప్రత్యేకతకు, ఆదిలోనే అతడు అసహ్యించుకున్నది. స్పెయిన్ దేశంలోని అంతర్యుద్ధానికి అతడెంత ఆశ్చర్యపడినది వర్ణించాడు. ఈ యుద్ధం పెట్టుబడిదారీ విధానంవల్ల రాలేదు. అది కేవలం నిరంకుశత్వ జమీాందారీ శక్తుల వల్లనే వచ్చింది.

రిచర్డు రైట్ అనే అతడు, నీగ్రోలపై చూపిన పక్షపాతం కారణంగా, కమ్యూనిస్టులలో చేరాడు. కాని, దానికి పెట్టుబడి

దారీ విధానానికీ ఏమో సంబంధంలేదని తరువాత నిరూపించ ప్రయత్నిస్తాను.

మన కాలంలోకూడా లెనిన్, స్టాలిన్లు మార్క్సు సూత్రములను అనుసరించి ఎక్కువ ప్రాబల్యంలోనికి తెచ్చుట కూడా తలవని తలంపుగా కాదు. నూరు సంవత్సరాలు క్రిందట పశ్చిమ యిరోపాలలో ఉండిన పరిస్థితులలోనే నడుపబడిన జారు ప్రభుత్వ పరిపాలనలోని రష్యాలో వీరు నివసించారు. మీరు ప్రభుత్వ నిరంకుశ పాలన కేవలం కులతత్వ విధానం మీదనే ఆధారపడింది, ప్రభుత్వ వర్గాలవారికి గొప్ప ప్రత్యేక హక్కులనీ ఇచ్చారు. కాని, వర్తక సంఘాలకు, ఉత్పత్తిదారులకు, బ్యాంకర్లకు తక్కువ అధికారాలిచ్చారు. అందుచేత రష్యావారి దృష్టిలో వ్యాపారం, పరిశ్రమల యజమానులంతా ఈ ప్రత్యేక కుల. వర్గాలవారే గాని ఇతరులకు కాదు. అదేవిధంగా ఈ ఉన్నత వర్గాల తాబేదారులే గాని ఇతరులు ప్రభుత్వంలో ఉండటంకూడా అసంభవమే అతని దృష్టిలో.

రష్యా ప్రజల మనస్సులలో ఈ అభిప్రాయాలు చాలా లోతుగా పాతుకుపోయాయి. తత్కారణంగా రష్యా ప్రఖ్యాత ఆర్థిక శాస్త్రవేత్తయైన యుగెనివార్గా, పెట్టుబడి దారీ దేశంలో ప్రభుత్వం కేవలం ఉన్నతవర్గాల సేవనే చేయకుండా, ఆర్థిక వ్యవస్థపై స్వతంత్ర, నిర్ణయాధికారాలు గలిగి వుండవచ్చునని వ్రాసినందుకై అతన్ని మందలించారు.

చైనాలో కమ్యూనిస్టు ప్రచార విజయానికిగూడా ఈ అల్లకల్లోలమే అని విశదం కాగలదు. కమ్యూనిస్టుల అండ చేరిన చైనా వారందరికిగూడా, మండరిన్లు మొదలుకొని పూర్వపు కులాల వారంతా సాగించిన స్వలాభ దౌర్జన్యాలనుంచి అవినీతి శక్తులనుంచి తప్పించుకోవాలనే ముఖ్యోద్దేశ్యం అని గ్రహించాలి. కొన్ని పారిశ్రామిక వర్తక కేంద్రాలలో తప్ప చైనాలో మిగిలిన ప్రాంతాలలోని పరిస్థితులు, గత 20 సంవత్సరాలనుంచీ శతాబ్దారంభంలోని రష్యాకంటె తక్కువగానైనా "పెట్టుబడిదారీ విధానమే" అని చెప్పవచ్చు. అయినా, వేలాది చైనా వారు, వారు అసహ్యించుకునే పరిపాలన, పెట్టుబడిదారీ విధానమే అనీ, అది అమెరికాలోని పెట్టుబడిదారీ విదానంవంటిదే అని నమ్మినట్లు ప్రత్యక్షమౌతుంది.

మార్క్సు చూడనిది, ఆ కాలంలో చూచుటకు వీలు లేనిది అయిన మరియొక విషయం ఉంది. నేనిదివరకే చెప్పినట్లు పెట్టుబడిదారులు ఒక ప్రత్యేక కులంగా ఏర్పడ నవసరం లేదు; కులతత్వ సంఘంవలె ఇతరులను పీడించి జీవించనవసరం లేదు. అమెరికా సంస్థలు అటువంటి పద్ధతులనుంచి వారిని వారిస్తాయి. అందుచేత వారి శక్తి సామర్థ్యాలని మరొక మార్గంగా ఉపయోగించి, తద్వారా లాభాలు సంపాదించుకోవాలి.

అయితే పనివారి శ్రమను తమ స్వలాభాలకు ఉపయోగించుకోకుండా, అమెరికా అభివృద్ధిలో ఇంత ధనాన్ని,

భాగ్యాలను సంపాదించిన దేమి ? 19 వ శతాబ్దంలోని నూతన పరిశోధనలతో ఆరంభమైన పారిశ్రామిక సాంకేతిక విజ్ఞానాభివృద్ధియే దీనికి ప్రధాన కారణం. ఇదివర కెన్నడు కని విని ఎరుగనంతగా ప్రకృతినే మానవుడు తన స్వలాభానికి ఉపయోగించుకో గలుగుతున్నందువలన, అతడు తన సోదర మానవులను తన స్వలాభానికై పీడించ నక్కర్లేదు.

రెండువందల సంవత్సరాల క్రిందట ఆర్థికశక్తియంతా ముఖ్యంగా మూడు సంపదలపై ఆధారపడి ఉన్నది :

1. భూమి : (వ్యవసాయానికి, గనులకు)
2. పశువులు : (ఆహారం, పనికి)
3. మానవులు : (కూలినాలి పనులకు)

గాలితోగాని, నీటితోగాని నడుపబడే "మిల్లు"కి ఇతర సాధనాలద్వారా శక్తిలో 100కి 5 పాళ్ళుకంటె తక్కువ అవుతుందని లెక్క తేలింది.

పురాతన పద్ధతుల దేశాలలో ఇంకా ఈ పరిస్థితులే ఉన్నాయి. ఇండియాలో నిర్మాణ శక్తిలో 100కి 70 పాళ్ళు ఇప్పటికీ మానవులు, పశువులనుంచే వస్తున్నదని అంచనా వేశారు. పశ్చిమ నాగరికతలో ఈ శక్తి బొగ్గు, నూనె, ఎలక్ట్రిసిటీలద్వారా వస్తూంది. దేహసంబంధమైన మానవ శక్తి క్రమంగా ప్రాముఖ్యాన్ని కోలుపోతోంది. 1937 లో గనులలోను, ఉత్పత్తిలోను పనిచేస్తున్న ఒకొక్కడికి అన్ని ఆధారములనుంచి (ఆవిరి, గాసొలైన్, నీరు, ఎలక్ట్రిసిటీ మొ॥) ఉపయోగిస్తున్న ఎలక్ట్రిసిటీ లెక్కలు వేశారు. కిలోవాట్ గంట

లక్ష సమాన మానంలో 35,000 యూనిట్లు అమెరికాలోను, 10,000 నుంచి 12,000 ఐరోపాఖండంలోను, టర్కీలో 2000కి తక్కువ అని అంచనా వేశారు.

ఆధునిక కర్మాగారాలలో యంత్రాలన్నీ ఎలక్ట్రానిక్ కంట్రోళ్ళతో నడుపబడే ఆటోమెటిక్ యంత్రాలు, యంత్రాలు చూచుటకు, స్విచ్చిలు నొక్కటానికిమాత్రం కావలసిన కొద్దిమంది మనుష్యులు ఉండే పద్ధతివలన, అరిస్టాటిలు "రాజకీయాలు" అనే గ్రంథంలో వ్రాసిన మాటలు జ్ఞాపకం వస్తాయికదూ ? "ఇతరుల మనస్సులను శిరసావహిస్తూ గాని, గ్రహిస్తూగాని, ప్రతీ పనిముట్టు తనపనితాను చేస్తుంటే... వాటిని నడిపించటానికి మనిషి అవసరం లేకుండా మగ్గంలోని కండె మొదలైన భాగాలన్నీ సమంగా పనిచేస్తే..., యజమానుల పనివాళ్ళూ, బానిసలూ అవసరమే లేదు." అరిస్టాటిలు కేవలం ఊహామాత్రంగా చెప్పినది మనకాలంలోనే నిజరూపం వహించింది. యూరపులోకంటె ఆటోమెటిక్ యంత్రా లధికంగా ప్రవేశపెట్టడంచేత, ఆరిస్టాటిలు ఊహించు కొన్న సాంఘిక వ్యవస్థ ఇక్కడ నిజంగా వెలిసింది. అమెరికా పెట్టుబడిదారులకు, ఇంక బానిసలవంటి కూలివారు వారి కక్కర లేదు; వారి అవసరమూ వారికి లేదు.

దానికి బదులు ఈ దేశంలో, యంత్రసహాయంద్వారా మానవశక్తిని అధికంగా అభివృద్ధి చేయగలిగింది. ఈ అభివృద్ధికి కారణం చాలావరకు పెట్టుబడిదారుల పెట్టుబడి, ప్రయత్నాలేలని చెప్పవచ్చు. అమెరికానిర్మాణ పరిశ్రమలలో

ఒక్కొక్క పనివానిని నియమించటానికి, ఇప్పటి రోజులలో 6000 నుంచి 8000 డాలర్లు పెట్టుబడి కావలసి ఉంది. కొన్ని పరిశ్రమలలో ఇంకా ఎక్కువ అవసరం.

పెట్టుబడిదారులకు పూర్వం ధనమును ఈ రూపంగా ఉపయోగించలేదు. ధనికులు తమ ధనమును బంగారం, వెండి, భూములు మొదలైన ఆస్తులను కూడబెట్టుకొనుటకే ఉపయోగించారు. పైగా ఉన్నత కులాలవారు, ఇతర సంఘాలతో సహా, మందంగా జరిగే సాంకేతికాభివృద్ధిని తప్ప మిగిలిన వన్నింటినీ వారు తీవ్రంగా ప్రతిఘటించారు. అతి సూక్ష్మ వివరాలనుంచి ప్రతి పారిశ్రామికోత్పత్తి భాగాన్ని క్రమబద్ధం చేయాలనే సంకల్పంతో, నిరంకుశాధికారంతో వ్యాపారం సాగించే ధనికులంతాకూడా ఈ విధమైన అభివృద్ధి నిరోధక పద్ధతులనే ప్రోత్సహించారు.

పెట్టుబడి అధికంగా పెట్టే అమెరికావంటి దేశాలను, తక్కువ పెట్టుబడి పెట్టే దేశాలతో పోల్చి చూద్దాం. 'పెట్టుబడి' అనే నామాంతరంగల యంత్ర సామగ్రిని విశేషంగాను, మానవ కష్టాన్ని తక్కువగాను, ఉపయోగించే అమెరికా దేశపు యజమాని, ఇతర దేశాలలోని, యంత్ర సామగ్రి తక్కువగాను, మానవ శక్తిని అధికంగాను ఉపయోగించే యజమానికంటె అధికమైన కూలిని సులభంగా ఇవ్వగలుగుతున్నాడు. ఒకే దేశంలోని వివిధ పరిశ్రమలను మనం పోల్చి చూస్తే ఈ వ్యత్యాసమును మనం గ్రహించవచ్చు. ఉత్పత్తి ఖర్చులో 100 కి 20 పాళ్ళు మాత్రమే జీతాలిచ్చే నిర్మాత,

ఉత్పత్తి కర్చులో 100 కి 75 పాళ్ళు జీతాలిచ్చే యజమాని కంటె అతని పనివారిపట్ల ఎక్కువ ధారాళం చూపించగలడు. కూలి పనులు నూటికి 10 పాళ్ళు ఎక్కువచేస్తే, మొదటి నిర్మాతకు మొత్తం ఖర్చులో నూటికి 2 పాళ్ళు ఎక్కువౌతుంది. కాని రెండవ నిర్మాతకు నూటికి 7½ ఎక్కువౌతుంది.

పైగా పెట్టుబడి ఎంత పెద్దదైతే పనివారి నిర్మాణ శక్తి అంత అధికంగా ఉంటుంది. అమెరికాలో ఒక మనిషి ఒక గంటలో నిర్మించగల శక్తి 1929 లో కంటే 1939 నాటికి, నూటికి 22 పాళ్ళు అధికమైంది. 1945 నాటికి 1939 లో కంటె నూటికి 19 పాళ్ళు అధికం. 1950 నాటికి 1945 లో కంటె నూటికి 13 పాళ్ళు ఎక్కువ.

డబ్బు పెట్టుబడి అధికంగా పెరిగే ధోరణి నూరు సంవత్సరాల క్రిందటనే ప్రారంభమైంది. కాని, ఇప్పటివలె అది అంత ప్రత్యక్షంగా కనుబడలేదు. మార్క్సు తన సిద్ధాంతమును దాని మీదనే నిర్మించటానికి ప్రయత్నించినా, అతడు ఇంకా దాన్ని సరిగా వ్యాఖ్యానించే స్థితిలో లేడు. అతని కాలంలో ఉన్న అర్థిక పరిస్థితిని, విపులంగా ఉన్న పిల్లల కూలి పనులను (పెట్టుబడిదారీ పద్ధతికి పూర్వంనుంచీ ఉన్న ఆచారము) కడుపుకాలే కూలిపనులు, ఎక్కువమందికి పనులిచ్చుట, మార్క్సు పరిశీలించి "పెట్టుబడి" అనే అతని గ్రంథంలో "యంత్రాలు కూలివాని నుంచి ఎక్కువగా ఉత్పత్తి చేయించే పోటీ దారుడుగా పని చేయుటయే కాక, ఎప్పుడూ ఆతని

ప్రాముఖ్యతను తగ్గిస్తూనే ఉంటుంది. అది అతనికి ప్రతికూలమైన శక్తికూడా” అని వ్రాశాడు. దానికి వ్యతిరేకంగా, తక్కువ శక్తితో ఎక్కువ ఉత్పత్తి చేయించుటచేత యంత్రం అతని స్నేహితుడని అప్పుడు మార్క్సు గ్రహించలేకపోయాడు. దానివలన యజమాని కూలిపనులు హెచ్చు చేయుటకు, ఖరీదులు తగ్గించుటకు, తద్వారా కూలివారు ఎక్కువ సంపాదించి దానితో ఎక్కువ వస్తువులను కొనటానికి సహాయపడుతుంది.

మార్క్సు నూరు సంవత్సరాలకు ముందే వచ్చాడు. ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ విధానపు ప్రసవవేదన అతని దృష్టిలో మరణబాధలుగా కనిపించాయి. మన విజ్ఞాన శాస్త్రవేత్తల, ఇంజనీర్ల, పరిశోధకుల పనులవలన మన పరిశ్రమలు తక్కువ ధరలలో అత్యధికోత్పత్తికి సాధనం కాగలదనీ, తద్వారా తన కాలంలో విలాస వస్తువులను తక్కువ ధరలకే పనివారికి లభించగలననీ మార్క్సు గ్రహించలేకపోయాడు.

ఈ అత్యధికోత్పత్తి పద్ధతులు. వారి వస్తువులకోసమై స్వదేశపు మార్కెట్లను వృద్ధిచేయునట్లు నిర్మాతలను బలవంతం చేయగలవనీ; అటువంటి మార్కెట్ల అవసరాన్ని తక్కువ ధరలు, ఎక్కువ కూలిపనులే కలిగించ గలవనీకూడా మార్క్సు ముందుగా గ్రహించలేకపోయాడు. ఆధునిక పరిశ్రమలకు, వారి పెద్ద పెద్ద యంత్రాలను ఉపయోగించుటకై, ఎక్కువ బుద్ధిమంతులు ఉన్నత విద్యావంతులు యుక్తిపరులైన జను లనేక లవసరమనీ, ఈ అవసరం మూలంగా పని

వారియొక్క శక్తిసి, సాంఘిక పరిమాణమును వృద్ధిచేయక తప్పదనీ మార్క్సు దూరదృష్టితో చూడలేకపోయాడు.

ఒకప్పుడు పనివారికి భారముగా ఎంచబడిన పెట్టుబడిదారీ విధానమే, నిజానికి పనివారి భారాన్ని చాలా భాగం తగ్గించింది. అమెరికా కర్మాగారములలోని క్రేన్లు, పుల్లీలు, కన్వేయర్లు, మనుష్యులు మోయవలసిన బరువును మోస్తున్నట్లుగా, అమెరికాలోని ప్రజాస్వామ్యపు పెట్టుబడి విధానమే పనివాడు తన అధమస్థితినుంచి, దైహికంగానే కాకుండా, సాంఘిక మానసికంగా కూడా అభివృద్ధి చెందుటకు సహాయపడుతోంది. అది అతని ఆర్థికదుస్థితిని బాపి, తోటి పౌరులతో సమానమైన స్వేచ్ఛా సౌఖ్యములను ప్రసాదించింది. హెన్రీ! అత డిప్పు డెవ్వరికీ దాసానుదాసుడు కాకుండా, ఎవ్వరి హేయభావానికీ గురి కాకుండా, ప్రతీ పౌరునితోనూ సమాన హోదాతో సంచరించవచ్చు. ఏదో ఒక రోజున ఇక్కడికి వచ్చి అతనితో కరస్పర్శ చెయ్యాలనే కోర్కె నీకు కలుగగలదని నేను నమ్ముతున్నాను.

# వర్గరహిత విధానంలో యూనియన్లు

ప్రియమైన హెన్రీ!

నీవు వ్రాసిన క్రిందటి ఉత్తరం అందినది. నీవు నాపై ఆగ్రహించినందుకు నేను చాలా విచారిస్తున్నాను. నీవు ఈ ఉత్తరం చదువుటకు నిరాకరించునంతగా చికాకు పడలేదని భావిస్తున్నాను. అమెరికా పెట్టుబడిదారులు పనివారికి హెచ్చు కూలి నిచ్చునంతటి "ఉదారులని, తెలివైనవారని" స్ఫురింప జేయాలని నిజంగా నా భావం ఎంతమాత్రం కాదు. ఎన్నడో తప్ప, అమెరికా యజమానులంతా దయార్ద్ర హృదయులై కరిగిపోలేదు. అందులో పనివారి కొనుగోలు శక్తి వృద్ధియైనందువల్ల ముందు భావాలు వృద్ధి కాగలవనే దూరదృష్టి గలవారు చాలా తక్కువమంది ఉన్నారు. ఆర్థిక స్తోమతగల ప్రభువులపై ఆశలుపెట్టుకుని, ఊహాసౌధాలునిర్మించు కున్న క్రిందటి శతాబ్దపు వారంతా, మానవ ప్రకృతిని గూర్చి అపార్థం చేసుకున్నారు. ఖరీదులు, కూలిపనులపై వ్యాపార పోటీకి గల ప్రాబల్యమును వారు తమ సంతోషంలో మరిచి పోయారు.

అమెరికాలోకూడా కూలిపనులలోను, నిర్మాణ పరిస్థితులలోను చాలాభాగం లాభాలు, లేబరు యూనియన్ల బల ప్రయత్నం వలన, ఒకొక్కప్పుడు దీర్ఘకాలపు విలువైన సమ్మెల ద్వారాను సంపాదించినవని చెప్పటానికి ఒక్క క్షణంకూడా నేను సందేహించను. అది మరొక విధంగా ఉండలేదు. సాధారణంగా తోటిపెద్ద పోటీదారులు హెచ్చిస్తేగాని, మరొక

యజమాని కూలిపను లధికంగా హెచ్చించడు. మొత్తం పరిశ్రమకంతకీ కూలిపనులు హెచ్చింపుకొరకు సమష్టిగా యూనియన్లు జరిపే పోరాటమునే చాలామంది పెద్ద యజమానులు ఆహ్వానించుట కిది ఒక కారణం. తమ సొంతపని వారికి కూలి హెచ్చించటానికి వీలైన మార్గం ఇదొక్కటే. కాని దీనికి ప్రారంభం మాత్రం సాధారణంగా పనివారి చేతనే జరగాలి.

అయినప్పటికీ, పెట్టుబడిదారులు నిర్మాణ విధానములలో తెచ్చిపెట్టిన మార్పులు లేకపోతే, అమెరికా పనివారి జీవిత పరిస్థితులలో ప్రత్యక్షమైన అభివృద్ధికి అవకాశమే లేదు. వారి పెట్టుబడి ధనమునేకాక, వారి పరిశోధనా శక్తిని, దూరదృష్టిని కూడా ఉపయోగించి, వారు వారి పనివారుకూడా ఎన్నడూ ఎరుగని లాభాలు గడించగల పరిస్థితులను వారు సృష్టించారు. ఎల్లప్పుడూ అధికంగా ఉత్పత్తిచేసి, ఖరీదులు తగ్గిస్తూ, న్యాయ్యా మును వృద్ధిచేస్తూ, క్రొత్తవస్తువులు నిర్మిస్తూ, సాంకేతిక జ్ఞానం లోనూ, యాజమాన్యంలోనూ ఎప్పుడూ నూతన పద్ధతులు సాధనలు చేస్తూ వారి ప్రయత్నాలలో ఎక్కువ నిర్మాణ మును, మొత్తం ఆర్థిక స్థితిని త్వరిత గతిలో అభివృద్ధిచేసి ఆధిక్యతను సంపాదించారు. ఈ లాభాలను బట్టి పనివారి కోర్కెలను నెరవేర్చుటకు, అన్ని విషయాలపనిలోనూ వారికి అవకాశాల వృద్ధికి వీలు కలిగింది.

పారిశ్రామికాభివృద్ధినిగూర్చి అర్థం చేసుకున్న దాని కంటె అధికంగా, వృద్ధి పొందుతున్న పెట్టుబడి విధానములో

యూనియన్ల పాత్రను మార్క్స్ అర్థంచేసుకుని యుండలేదు. నిజానికి నూరు సంవత్సరాల క్రిందట ఈ అభివృద్ధులను ఎవ్వరూ జోస్యం చెప్పియుండలేక పోదురు. నిజం చెప్పా లంటే మార్క్స్ శక్తిమంతమైన లేబరు యూనియన్లు కావా లన్నాడు. కాని, వాని కున్న అవకాశమును, అనేక కారణాల వల్ల అతనికి సందేహాస్పదంగానే ఉన్నాయి. ప్రభుత్వం అంటే కుల, వర్గశక్తులే అనే సంఘవాతావరణంలో అతడు పెరిగి ఉండడంచేతను, పనివారి సమ్మెలును, ఐక్యతను పోలీసు తుపాకులు, లాఠీలతో ఎదుర్కొనుటచేతను, అమెరికాలో అంగీకరించినట్లుగా, పెట్టుబడిదారుల ఔదార్యముతో కూడి, వర్గప్రాబల్యంలోని పరిపక్వమైన ప్రజాస్వామ్యమును మార్క్స్ ముందుగా గ్రహించలేక పోయాడు.

అమెరికాలో పనివారు తక్కువగా ఉండుటయే ఏకో పాలో కంటే, అమెరికాలోని యూనియన్లవారి కోర్కెల కధికమైన విజయం కలుగుటకు ఒక కారణం. పారిశ్రామిక మైన తూర్పు భాగమునుంచి పడమటి భాగమునకు ప్రజలు కదలిపోవటం ఆరంభించారు. పనివారిలోపం కొద్దికాలం మాత్రమే ఉంది. ఒక్కొక్కప్పుడు వలసవచ్చిన పనివారు స్థిర నివాసులైన వారికంటె తక్కువ కూలికే పనిచేయ సిద్ధపడుట చేత, వారి సంపాదనలో అభివృద్ధి లేకపోయింది. అప్పుడు తిరిగి యూనియన్లు వారి కోర్కెలను సాధించేవరకు కొంత కష్టం ఏర్పడింది.

విధానం అంతా ఐరోపాలో కంటె విభిన్నంగా నడిచింది. ఇక్కడి ప్రజలలోని ప్రజాస్వామ్యతత్వంచేతను, ప్రభుత్వపు అభిమాన దృష్టిచేతను ఈ దేశంలోని పనివారికి విజయం చేకూర్చింది. అమెరికా ప్రభుత్వ వర్గప్రభుత్వం కానందుచేతనే, పనివారికి వర్గపోరాట పద్ధతులవలంబించ వలసిన అవసరం కలుగలేదు. వ్యతిరేకంగా చూస్తే, పనివారు మార్క్సు బోధించిన రాజకీయ వర్గపోరాట సూత్రాన్ని అనుసరించక పోవుటచేతనే, పెద్ద యెత్తున జరిగిన సమ్మె ప్రమాదాలలో జాతి సంరక్షణార్థమై ప్రభుత్వం ఎప్పుడోగాని కలుగ చేసుకో వలసిన అవసరం లేకపోయింది.

ఈ పరిస్థితిలో న్యాయాన్ని అమెరికా పనివారు సరిగ్గా అర్థం చేసుకున్నారు. అమెరికా రాజకీయాలలోని ద్విపక్ష విధానమును ఆలోచించి నట్లయితే వారి విదానములోని తెలివిని నీవు బాగా అర్థం చేసుకోగలవు.

ఒక గట్టి రిపబ్లికను పార్టీ సభ్యుని, అటువంటి డిమోక్రాటిక్ పార్టీ సభ్యుని వారి వారి రాజకీయ పార్టీల సిద్ధాంతాలకుగల భేదాన్ని తెలుపమని అడిగితే, ఇద్దరూకూడా నిర్ఘాంతపోతారు. రెండు పార్టీలవారుకూడా ఏ ఒక కులమును. వర్గమును కాకుండా మొత్తం జాతికే విజ్ఞాపింప ప్రయత్నిస్తాను. అధికారం లోనికి రావటానికిగాని, ఆ అధికారములో నిలబడుకొని యుండుటకుగాని ఇరుపక్షాలవారు ఓటర్లందరి దయను రాబట్టు కోవాలి. నిర్మాతలు, బ్యాంకర్లు, వర్తకులు, వైద్యులు, రైతులు, మొదలైన వారిందరికంటె, వారికి పనివారి ఓట్లు

ఎక్కువ అవసరం. ఒక పార్టీ పెద్ద తప్పులు చేసినా, లేక తమకు తగినంత సేవచేయనట్లు తోచినా, లేక గుడ్డినమ్మకం, పొగరు ప్రబలినా, ప్రజలు వారి నియమితకాలం తరువాత ఆ పార్టీని అధికారమునుంచి త్రోసివేసి, ఎదుటి పక్షంవారికి వారి శక్తిని ఋజువు చేసుకునే అవకాశం ఇవ్వటంలో ఓట్ల పద్ధతి ప్రజలకు ఉపయోగ పడుతుంది. ఈ అవకాశంలో అన్ని కల సంఘాలవారికీ భాగం ఉన్నది.

స్టాలిన్ ఏర్పరచిన ప్రకారం మార్క్స్ సిద్ధాంతానికి వ్యతిరేకంగా అమెరికా పార్టీ విధానం ఏర్పడింది. (1936 సోవియట్ల ఎనిమిదవ కాంగ్రెసుకి ముందు) "ఒక పార్టీ అనగా ఒక వర్గంలో చాలా పురోగమించిన ఒక భాగం అనీ, రాజీ పడుటకు శక్యం కాని. వ్యతిరేక భావాలు గల వర్గాలు గల ఒక సంఘంలోనే అనేక పార్టీలు కలిసివుండవచ్చుననీ, స్టాలిన్ చెప్పాడు. (రెండు పార్టీలు ఒకే కార్యక్రమాన్ని ప్రకటించినా, నిజమైన పోటీలో తమచే ఎన్నుకోబడగల రెండు పార్టీలున్నట్లయితే సోవియట్ రష్యా పనివారు ఎంత సుఖపడుదురో కొంచెం ఆలోచించు.

రెండు పార్టీలలో ఏ ఒక్కటీగాని పనివారి ఓట్లనుగాని, కోర్కెలనుగాని నిర్లక్ష్యం చేయ సాహసించలేదు. రిపబ్లికన్ పార్టీ సభ్యుల సహాయంతోనే తాను అధికారంలోనికి రాగలిగినా, పెన్సిల్వేనియా గవర్నరు, అధ్యక్షపదవికి రావలసినవాడైన, జేమ్సు హెచ్ డఫ్. 1950 లో, పార్టీలోనే "స్వార్థపరులైన ఒక కూటం ఏర్పడినందున"

అతడు దానిపై విప్లవం సాగించి జయించాడు. "ప్రజలందరికీ ప్రాతినిధ్యం వహించినదని ఓటర్లందరినీ ఒప్పిస్తేగాని రిపబ్లికన్ పార్టీ విజయము నాసించలేదు" అని అతడు చెప్పాడు. ముఖ్యంగా ధనికవర్గంవారికే ఉద్దేశించబడిన "ఫార్ ట్యూన్" అనే ముఖ్యమైన పత్రికకూడా ఇదే పద్ధతి ననలంబిస్తుంది.

పనివారి పరిస్థితిని అవగాహన చేసుకుని లాభంపొందారు. స్వంతంగా తమవర్గం తరఫున పార్టీని నియమించకుండా, ఇతర పెద్ద రాజకీయ పార్టీలతో సన్నిహిత సంబంధం పెట్టుకోకుండాను ఉన్నట్లయితే తమ లేబరు పార్టీకి కలిగే లాభాలను 20 వ శతాబ్దపు గొప్ప లేబరుపార్టీ నాయకుడైన శామ్యూల్ గోంపర్సు తెలుసుకున్నారు. అప్పుడు అమెరికా లేబరు ఫెడరేషను అధ్యక్షుడైన గోంపర్సు "లేబరు అభిమానులను గౌరవించుటకు, విరోధులను శిక్షించుటకు" ఒక విధానము నేర్పాటు చేశాడు. ఆ విధానమునే ఇప్పటికీ సుశిక్షితులైన పనివారు అవలంబిస్తున్నారు.

ఈ పద్ధతి కేవలం అవసర నిమిత్తమై వచ్చినది కాదు. ఐరోపాలోని సహోద్యోగులను చీలదీయుటకై చేసిన స్వార్థపు తేని పూత మాటలకు లెక్క చేయకుండా అమెరికా లేబరు నాయకులు లేబరుయొక్క అవసరములకు, వారి నిర్మాణ శక్తికి దగ్గిర సంబంధం కలదని గ్రహించారు. ఈ నిర్మాణశక్తి ధనికుల ప్రోత్సాహం, సాహసంమీద ఆధారపడివుంది. అమెరికా లేబరుఫెడరేషను అధ్యక్షుడైన విలియంగ్రీన్, 1950 మే నెలలో ఇలా వర్ణించాడు. "పనివారిని న్యాయంగా ఆదరించిన

యజమానులతోనే నిర్మాణాత్మక సహకారమునకు లేబరు అంగీకరిస్తుంది.'' "యూనియన్లు, యజమానులమధ్య పరస్పర సహకారమును'' అతడు ప్రోత్సహించాడు. "అది లాభాలను పంచుతుంది. వర్గ క్షేమమే కమ్యూనిస్టు విధానము. కాని దానికి మనుష్యప్రాణములను బలిగొని బాధలను హీనస్థితిని తెచ్చి పెడుతుంది.

అంతర్జాతీయ స్త్రీదుస్తుల పనివారి యూనియన్ సంఘాధ్యక్షుడు, అమెరికా ప్రఖ్యాత లేబరు నాయకులలో ఒకడైన డేవిడ్ డుబిన్‌స్కీ ఇటువంటి ప్రకటనలు చాలా చేశాడు. ఈ విస్తార పరిశ్రమలో అనుసరణీయమైన లేబరు పరిస్థితులను స్థాపించుటకు యత్నిస్తూ — అమెరికాలో దుస్తులనిర్మాణ ఒక మహత్తర నిర్మాణ పరిశ్రమగా వృద్ధి చెందింది—దానితోపాటు మొత్తంమీద నిర్మాణమును, వ్యాపార పరిస్థితులను కూడా అభివృద్ధి చెయ్యటానికై ప్రారంభించి సహకరించాడు.

కొద్దిపాటి ప్రాముఖ్యతగల లేబరుపార్టీకూడా అమెరికాలో తలయెత్తలేదు. "లేబరు వర్గం'' అనేది ఇక్కడ మచ్చుకైనా లేదు. లేబరు ఇక్కడ చాలా బలహీనత, లోకువ వలన కాదు. కాని ఇతర జాతిలో విడిపోయి దూరంగా ఉండటచేత వారికే ముప్పుగలుగుతుందనీ, అపనమ్మకము, అనుమానము, తమ సాంఘికార్థిక లాభాలకు నష్టం కలిగిస్తుందనీ ఆ పనివారు గ్రహించుటచేతనే. రాజకీయాలలోనూ, నిర్మాణములోనూ, ఇతరజాతిలో సహకార భాగస్వాములుగా ఉండటంలోనే తమకు బలం ఉంటుందని లేబరుకు తెలుసు.

ప్రత్యేక వర్గపు పార్టీగా బలపడుటకు నిరాకరించుటయే కాక అమెరికా లేబరు నిజంగా ఏ పార్టీతోనూ సంబంధం లేనిది. ఉదాహరణకు, సి. ఐ. ఒ. స్థాపకుడును, ప్రస్తుతం సంయుక్తగని పనివారల యూనియన్ అధ్యక్షుడునైన జాన్, యల్. లెలిస్ ఎప్పుడూ రిపబ్లికన్‌గానే ఉంటున్నాడు—అతడు ఫ్రాంక్లిన్, డి. రూజ్వెల్టును బలపరిచిన స్వల్పకాలము తప్ప—కాని ఇతర లేబరు నాయకులంతా సామాన్యంగా డిమాక్రాటులనే బలపరుస్తారు. ప్రభుత్వంకూడా యజమానులు, ఉద్యోగులు సందర్భంలో తటస్థభావమును వహిస్తూ, ధనికుల హక్కులను రక్షించినంత కఠినంగానే లేబరు హక్కులను కూడా రక్షించింది—క్రిందటి పుష్కరంలో బహుశః మరీ బలంగా రక్షించింది—కార్యనిర్వాహణ చట్టనిర్మాణం, న్యాయ శాఖలు మొదలైన అన్ని శాఖలలోకూడా ఇది జరుగుతోంది.

రిపబ్లికన్ అయిన థియడోర్ రూజ్వెల్టు న్యూయార్కు రాష్ట్ర శాసన సభాసభ్యునుగా ఉన్నప్పుడు, చుట్టల పనివారి స్థితిని బాగుపరిచే చట్టమును చేయించుటలో, సామ్యూల్ గోంపర్సుతో కలిసి పనిచేశారు. తరువాత రూజ్వెల్టు అమెరికా అధ్యక్షుడైనప్పుడుకూడా లేబరుకు సంబంధించి విషయాలన్నింటిలోనూ గోంపర్సును సంప్రదించేవాడు.

డెమాక్రటు అయిన ఫ్రాంక్లిన్ డి. రూజ్వెల్టు పనివారి విషయంలో అతి శ్రద్ధ చూపించాడు. అతని నిశ్చితబలం లేక పోతే అమెరికా లేబరు యూనియన్లు, పనివారుకూడా, ఇప్పటి బలాన్ని, ఇప్పటి కూలిప్రమాణాలను పొందలేక పోయేవారు.

ఆతడు చేయించిన చట్టముద్వారా, అనేకమైన పరిపాలనా పద్ధతులద్వారా అతడు లేబరును అపారంగా పోషించాడు.

ఇద్దరు రూజ్వెల్టులేకాకుండా, పనివారి స్థితిగతుల అభివృద్ధికి ఎక్కువ శ్రమపడిన డెమాక్రాటు, వూడ్రో విల్సన్ ఉన్నాడు. డెమోక్రాటు అయినా, రిపబ్లికన్ అయినా, మా అధ్యక్షులందరూ ఎప్పుడోగాని, తాము జాతియంతకీ, ప్రతి వర్గమునకు, సేవచేయాలనే సంగతి మరువలేదు.

ధనికులనేకులు చాలామంది అధ్యక్షులను విమర్శించుట, తూలనాడుటయే, ధనికవర్గ ప్రయోజనాలనుంచి మా అధ్యక్షుల స్వేచ్ఛకు ప్రత్యక్షసాక్ష్యంగా ఉపకరిస్తుంది. ఫ్రాంక్లిన్ డి. రూజువెల్టునుగూర్చి, హారీ యస్. ట్రూమన్ నీతి ప్రవర్తనలపై కురిపించిన అపవాదులను గూర్చి ఒక అరగంట నీవు విన్నట్లయితే, అమెరికా ధనిక పెట్టుబడిదారులు తమ ప్రత్యేక ప్రయోజనాలకై సాధనంగా ప్రభుత్వంపై ఏ మాత్రమూ ఆధారపడలేదని నీకు నమ్మకం కలుగుతుంది. లేబరు వ్యతిరేకంగా ధనికులను ధనికులకు వ్యతిరేకంగా లేబరును ఎప్పుడూ బలపరుస్తుండే పక్షపాతపు ప్రభుత్వం తన బాధ్యతను అతిక్రమించుటయేకాక, అమెరికా పరంపరాగతాచారమునకే అపచారం చేసినట్లవుతుంది. దాన్ని అధికారములోనికి తెచ్చిన మెజారిటీ పార్టీకి అది తరువాత ఎన్నికలలో ఓటమి కలిగిస్తుంది. అమెరికా ప్రభుత్వము ఏ ఒక్కవర్గానికే సాధనంగా సేవ చేయుటకు ఎంత మాత్రమూ సాహసించలేదు.

# కొనుగోలు శక్తి

ప్రియమైన హెన్రీ!

నా క్రిందటి ఉత్తరంలో కొన్ని క్రొత్తవిషయాలను నీవు చూసినందుకు నాకు సంతోషం కలిగించింది. నిజానికి అమెరికా వచ్చేవరకు నాకుకూడా అమెరికా పార్టీ విధానం గాని, లేబరుస్థానంగాని అర్థంకాలేదు. అయినప్పటికీ బాహ్యంగా కనుపించేవాటి వ్యతిరేక భావాలను అవగాహన చేసుకో టానికి చాల సంవత్సరాలు పట్టింది. పనివారికి జీతాలు అధి కంగా హెచ్చుచేస్తే అమెరికా పెట్టుబడిదారులు ఇంతగొప్ప భాగ్యాల నెలా సంపాదించారని నీ వడిగిన దానికి — నీ ప్రశ్న లోని వ్యంగ్యంకూడా బోధపడుతూనే ఉంది — నేను నిన్ను అభిమానిస్తున్నాను. నీ ముందుకాళ్ళకు బందాలు వేస్తున్నా నేమో అని నీ వాశ్చర్య పడవచ్చు. రెండు ప్రకటనలుకూడా యదార్థమేనని నీకు హామీ ఇస్తున్నాను. చిక్కు సమస్యలో రహస్యం ఇదిగో: ధనికులు తమపనివారి ఆదాయం పెంచినందు వల్లనే వారు వ్యాపారములో లాభాలను వృద్ధిచేసుకోగలిగారు.

వేలాది పనివారు, రైతులు, క్రింది, మధ్యమ తరగతి ప్రజలలో కొనుగోలుశక్తి హెచ్చుటయే ఈ క్లిష్ట పరిస్థితిలోని ఏకైక ముఖ్యవిషయం. ఈ విధి విధానం అన్ని ధనిక దేశాలలోనూ జరగవలసినదే. అయినా ఇతర-చోట్లకంటె అమెరికాలో ఇది ఎక్కువ అయింది.

జాతీయాభివృద్ధికి మూలాధారమైనది హెచ్చుకూలియే అనే కొనుగోలుశక్తి సిద్ధాంతం నిరుపయోగమైనదని తరచు

విమర్శించారు. నిస్సంశయంగా దానికి కొన్ని హద్దులున్నాయి. కాని, ప్రాథమికంగా అది సరియైనదే.

కేవలం కూలి ప్రమాణమును హెచ్చించుట నిష్ప్రయోజనం అని స్పష్టం. ఘోరమైన ఆర్థిక సాంఘిక అవాంతరాలకుతోడు, అటువంటు విధానము ధరలను హెచ్చు చేస్తుంది. చివరికి పనివారికి లాభాలకంటే ఊహాగానములే లభిస్తాయి. దానియొక్క పూర్తి ఫలితం కావాలంటే కూలితోపాటు నిర్మాణం కూడా వృద్ధి కావాలి. లేక, నిర్మాణమును హెచ్చిస్తూ ధరలు తగ్గించటంద్వారా కొనుగోలుశక్తిని పెంచవచ్చు. అప్పుడు అదే ధరకు ఎక్కువ కొనవచ్చు. మొత్తంమీద ఆవశ్యకతను సృష్టించే అమెరికా డాలరు కొనుగోలుశక్తి అభివృద్ధికి తగినట్లుగా నిర్మాణాభివృద్ధికి సరిపోతుంది.

ఒక విధంగా అప్పుడప్పుడు ఐరోపా జాతులలో సంభవించే కష్టములే మాకు ఉన్నప్పటికి, మా కొనుగోలుశక్తి రేటు ప్రకారమే ఎల్లప్పుడు నిర్మాణాభివృద్ధి మేము చేయలేదు. ఒక్కొక్కప్పుడు నిర్మాణం త్వరగా వృద్ధిపొంది మాకు క్లిష్టపరిస్థితి, ఏర్పడేది. మరొకప్పుడు కొనుగోలుశక్తి నిర్మాణంకంటె అధికమై ధరలు హెచ్చిపోయేవి. 1929 లో అత్యధికాదాయం మూలంగా కొనుగోలుశక్తి విపరీతంగా గాలిబుడగవలె పెరిగి, పగిలి పతనమైపోయింది. కేవలం అధిక నిర్మాణంగాని, అధిక కొనుగోలు శక్తిగాని ఒకటి మాత్రమే మనకు సహాయకారికాదు. రెండుకూడా సమతూకాలుగా పెరుగుటయే లాభదాయకం.

బేరంలో ఏ ఒక పార్టీ తక్కిన వారికంటె ఎక్కువ శక్తిని వినియోగించ గలిగినా త్రాసు ఎప్పుడూ తబ్బిబ్బై పోతుంది. మన ఆర్థిక వ్యవస్థలోని ఏ ఒక భాగానికైనా అటువంటి భంగపాటు వచ్చినా, ఇతర భాగంలోనున్న శక్తివల్ల భంగపాటును అధిగమించవచ్చు. కాని, తరుచు ఎక్కువ మొత్తం, హెచ్చు వడ్డీలపై అప్పులు, డిబెంచర్లు సరిపెట్టుకొని దీర్ఘకాలపు కూలిరేట్లు, రైల్వే రవాణా చార్జీలు, యుటిలిటీ రేట్ల ఏర్పాట్లలో ఆఫీసర్ల ద్వారా జరిగే ఆలస్యాలు మొదలైన కఠిన విధానములవలన అటువంటి ఏర్పాట్లకు భంగం కలుగుతోంది. అటువంటి తప్పుడు ఏర్పాట్లు ఒకసారి హెచ్చిపోయినట్లయితే, అవి అపాయకరమైన ఒత్తిడిని కలుగ చేస్తాయి. అనవసరమైన భయంవలన మామూలుగా రాబోయే పరిణామ పరిస్థితి మరీ హెచ్చుతుంది.

మొత్తంమీద దృశ్యం పరిశీలిస్తే, అన్నివిధములైన వస్తు సామగ్రి నిర్మాణం జనాభా రేటుకంటె అధికమైన వేగంతో పెరుగుటయే కాక, ఇతర దేశాలలో నిర్మాణం కంటె కూడా చాలా ఎక్కువ వేగంతో పెరిగింది. మా కొనుగోలుశక్తి అంతకంటె ఎక్కువ వేగంతో పెరిగింది.

25 నిర్మాణ పరిశ్రమల సగటులెక్క తీసుకున్నట్లయితే, 1914 సంIIలో వారానికి 12.72 డాలర్లు సంపాదించిన పారిశ్రామిక పనివాడు, 1948 సంIIలో వారానికి 58.36 డాలర్లు సంపాదించాడు. కాని. 1948 లో అతడు వారానికి 39.7 గంటలే పనిచేస్తే, 1914 లో అతడు వారానికి 5.5 గంటలు

పనిచేశాడు. కొనుగోలు శక్తిలో డాలర్లు తగ్గిపోయినప్పటికీ, ఈ రోజులో పనివాడు అతని ఒకగంట సగటు సంపాదనతో (1948: 1.47 డా) 1914 లోని ఒక గంట సంపాదనతో కంటె చాలా ఎక్కువగా కొనగలడు. బహుశా ఇది ప్రపంచంలోని ఏ ఇతరదేశ పనివాడి సంపాదనకంటె కూడా ఎక్కువేమో.*

* 1914 సం॥తో పోల్చిచూస్తే 1948 లో వివిధ వస్తువులకు ఇవ్వటానికై ఎన్నిగంటల పని అవసరమై ఉంటుందో అనే లెక్కలో కొనుగోలు శక్తిలోని పెరుగుదలను పరిశీలించుటకు చాలా ఆనందకరంగా ఉంటుంది.

ఒక వారానికి పనిచేసే గంటలు.

| | 1914 సిసలుగా | 1948 సిసలుగా | 1914 (1948 ప్రమాణం) |
|---|---|---|---|
| ఆహారం ... | 29.4 | 12 4 | 28.2 |
| దుస్తులు ... | 9.3 | 4.7 | 11.6 |
| గృహాలంకరణ ... | 1.8 | 1.6 | 3.1 |
| ఆత్మరక్షణ ... | 0.8 | 0.6 | 1.8 |
| వైద్యసహాయం, మందులు ... | 3.6 | 1.0 | 2.4 |
| రవాణా ఏర్పాట్లు ... | 1.6 | 2.2 | 8.4 |
| బొగ్గు, కాంతి ... | 3.6 | 1.9 | 9.7 |
| వినోదం ... | 4.5 | 1.4 | 3.8 |
| గృహకృత్యాలు ... | 1.9 | 1.1 | 3.8 |
| అద్దె ... | 8.2 | 4.2 | 19.9 |
| ఆదాయపు పన్ను ... | — | 1.2 | — |
| చిల్లర, మల్లరలన్నీ ... | — | 1.3 | 3.7 |
| మొత్తం ఖర్చు ... | 64.7 | 33.6 | 96 4 |
| మొత్తం సంపాదన ... | 51.5 | 39.7 | 51.5 |

(ఒకగంట పని ఏమి కొనగలదు? 1914–48 లేబరు లెక్కల పరిశోధనలనుంచి—నెం. 3, జాతీయ పారిశ్రామిక సమావేశ సంఘం

ఒక గంట పనితో సంపాదించే సగటు రాబడిని బట్టి చూస్తే, చాలాభాగం సరుకు ఖరీదు 1948 లో కంటె 1914 లో చాలా అధికంగా ఉంటాయి. నిజంగా చూస్తే, 1914 లోని ఏ పనివాని కుటుంబమైనా, 1948 లోని సగటు ప్రమాణముల ప్రకారం నివసించాలంటే బహుకష్టమైపోయి వుండేది.

ఇప్పటి పనివారికి ఉత్తమమైన ఆహారము, మంచి రకమైన, ఆరోగ్యకరమైన గృహాలు—తరుచు తోట సహితమైన ప్రత్యేకపు ఇల్లు—ఉత్తమమైన గృహాలంకరణలు ఉన్నాయి. చాలామందికి ఎలక్ట్రిక్ రిఫ్రిజిరేటర్లు, బట్టలుతుకు యంత్రాలు, రేడియోలు, టెలిఫోన్లు, మరికొందరికి టెలివిజన్లుకూడా ఉన్నాయి. వారి గృహాలలో వారికి ఎక్కువ వేడిమి, ఎక్కువ కాంతి ఉన్నాయి. వారి భార్యలకు, కుమార్తెలకు అలంకరణ గృహాలున్నాయి. మొత్తంమీద మా పనివారిలో చాలా మంది—బహుశః అధిక సంఖ్యాకులు—ఐరోపా మధ్య తరగతి కుటుంబాలకంటె ఎక్కువ సుఖప్రదంగా నివసిస్తారు. అన్నింటికి ఖర్చు చేయగా, చాలామంది కొంత నిలవచేసుకోగలరు. బ్యాంకుల్లోనూ, సేవింగు బ్యాంకుల్లోనూ దాచుకున్నవి, స్వగృహాంపై పెట్టుబడిపెట్టినవి, సరుకులు, బాండ్లు, భూములు

---

ఇన్ కార్పొరేటెడ్, న్యూయార్కు యన్. వై,—సేకరించబడినది.) మొదటివరుస 1914 లో కార్మిక కుటుంబపు సగటు బడ్జెట్ తెలియచేస్తుంది. రెండవ వరుసలోనిది 1948 లోని బడ్జెటు తెలుపుతుంది. మూడవ వరుస లోని అంకెలు పై వానినిబట్టి ఊహించినవి. 1948 లో ఆనందించిన ప్రకారమే ఒక సాధారణ కార్మిక కుటుంబం 1914 లో కూడా నివసించాలనుకుంటే ఎంత ఖర్చుచేసి వుండి వుండాలో ఆ అంకెలు తెలియచేస్తాయి.

మొదలై అనేక రకాలుగా వారు తగినంత నిలవ చేసు కున్నారు.

పనికి వెళ్లుటకేకాక, వినోద, విహారాలకు వెళ్లి ఆనందిం చుటకుకూడా తప్పకుండా ప్రతి కుటుంబానికి కారుండాలి. వడ్రంగి, ప్లంబరు, చిత్రకారుడు, డెలివరీ, మరమ్మత్తు పనులు చేసేవారుకూడా స్వంతకార్లలోనే వస్తారు. ఇల్లు కట్టుచోట, రోడ్లు వేసేచోట ఎక్కడ మనుష్యులను చూసినా ఆ పనివారి కార్లుంటాయి. కార్ల ప్రయాణం మెల్లగాను, నిలబెట్టుటకు తగినంత స్థలం ఉండటానికి అవకాశం లేని పెద్ద పెద్ద సిటీలలో తప్ప, ప్రతీ కర్మాగారంలోనూ కూడా కార్లు నిలబెట్టుటకు పెద్ద పెద్ద స్థలాలుండాలి.

మా పనివాళ్ళు పుష్కరాలనుంచి, ప్రాపంచికంగా ఎంతగా అభివృద్ధిపొందారో చూపించటం మాత్రమేకాదు. ఇవన్నీ నీకు చెప్పటంలో నా ఉద్దేశ్యం ఈ అభివృద్ధి అంతా కేవలం ధనికుల ఖర్చునుంచే సాధించినది కాదనీ, అది ఆ విధంగా ఎందుకు జరగలేదో నీవు గ్రహించాలనీ నా అభిలాష.

దీన్నిబట్టి ఏకపక్ష విధానంవలన ఎక్కువ లాభం ఉండదు. వ్యాపారమును, ఖరీదులను హెచ్చించకుండా ఏ కర్మాగారమైనా ఉన్న ఆదాయంతోనే పనివారికి జీతాలు హెచ్చు చేయుటకు ప్రయత్నిస్తే త్వరలోనే ఎక్కువ నష్టం పొందవలసి ఉంటుంది. చిట్టచివరికి అది మూసివేయాలి. పని వారు సంపాదించిన సదుపాయాలన్నీ వృధా అయిపోతాయి.

నిజంగా చాలమంది నిర్మాతలు పనివారికి జీతాలు హెచ్చించి నప్పుడల్లా నాశనమైపోతామేమో అని భయపడ్డారు. కాని, మామూలుగా అనుకున్న దానికంటె హెచ్చు ఖర్చు అగుట చేత లాభాలు త్వరితంగా వచ్చాయి. పనివారు హెచ్చుగా సంపాదించినకొలదీ వ్యాపారలాభంకూడా హెచ్చుతోంది.

ఆధునిక పారిశ్రామిక నిర్మాణమునకు పూర్తిగా ఏర్పాట్లు చేసుకున్న ధనిక పెట్టుబడిదారీ సంఘంలో మార్కెట్లను అభివృద్ధి చేయవలసిన అవసరం ఉంది. కాని, ఇతర దేశా లనేకం వారి పెద్ద మార్కెట్ల కొరకై ఇతర దేశాలపై ఆధారపడవలసి ఉంటే, అమెరికా పెట్టుబడిదారులు తమ స్వదేశ మార్కెట్లపైనే దృష్టి కేంద్రీకరించారు. అమెరికా పెట్టుబడి ధనిక వాదములోని ఎక్కువ ఆకర్షణీయమైన అంశాన్ని తెలుపుతున్నాను. కనుక, నీవు జాగ్రత్తగా గ్రహిస్తా వని ఆశిస్తున్నాను. అంతర్గతావసర కారణాలచేత, వర్గరహిత సమాజమే పరమావధిగా ప్రయత్నించేటంత సరియైన పరిమాణంలోనే, మా పద్ధతి ధనికవాదంకూడా వృద్ధి పొందుతోంది.

అమెరికా పెట్టుబడి ధనికవాదంలో చూచుటకు ఒక దానితో ఒకటి సంబంధంలేని రెండు ఉద్యమాలతో నిండి వుంది. ధనం — అనే యంత్రాల ప్రాముఖ్యత క్రమంగా వృద్ధి పొందుటచేత మనుష్యశక్తి అవసరం తగ్గుతుండటం ఒకటి. ఆధునిక పారిశ్రామిక వస్తువులకై మార్కెట్లు త్వరగా వృద్ధిపొందుట రెండవది. ఈ రెండు ఉద్యమాలు చివరి పర్యవ

సానంలో జరుగుసట్లు ఒకదానితో ఒకటి తప్పకుండా సరి తూగాలి. ఒక పనివాడు ఇదివరలో అయిదు గంటలలో తయారు చేయగలిగినదానిని ఇప్పుడు ఒక వేళ ఒకగంటలోనే చేయగలడనుకో. ఇదివరకు అతడు అయిదు గంటలలో ఉపయోగించినదానిని ఇప్పుడతడు ఒకగంటలోనే ఉపయోగించాలి. అతని ఆదాయంలో పన్నుగాపోయే భాగం తప్ప, ధనికవాదం నిజంగా పనివానిని తక్కువకాలం పనిచేయునట్లు గాని, లేక ఎక్కువ సరకుల ఉపయోగించునట్లుగాని తప్పని సరి చేస్తుంది. నిజానికి అతడు రెండూ చేస్తాడు. నిర్మాణంలో పెట్టుబడిధనం పాత్ర అధికమైనకొలదీ కొనుగోలుదారుగా పనివాని పాత్రకూడా వృద్ధి అవుతుంది. ఈ ప్రాథమిక సూత్రాన్ని మార్క్సు గ్రహించాడు. కాని ధనికులు ఆ మార్గాన్ని అనుసరిస్తారని మాత్రం అతడు నమ్మటానికి నిరాకరించాడు.

అమెరికా వ్యాపారస్తులు ప్రతివస్తువును, జనసామాన్యానికందరికీ ఉపయోగించే వస్తువుగా పెద్ద మొత్తంలో చేసేవారు. కాని, ఇతర దేశాలనేకంలో ఏదోఒక వర్గప్రయోజన వస్తువుగానే తయారు చేశారు. కమ్యూనిస్టు కరపత్రాలలోవర్ణించి అతిస్వార్థపరుడైన పారిశ్రామికునికైనా పనివారి దృష్టిలో రెండు రూపాలుగా ఉంటాడు. మొదటిది జీతం పుచ్చుకునే ఉద్యోగిరూపం, రెండవది పెద్దదైన కొనుగోలు దారు రూపం. మార్క్సు దృక్పథాన్నిబట్టి 'శ్రమ' అనే వస్తువును అమ్ముకునే కూలి పనివాడే క్రమక్రమంగా పెట్టుబడి

దారుడు అమ్మకునే ప్రతివస్తువును కొనేవాడవుతున్నాడు. అతడే "ఎల్లప్పుడూ సరియైన" ఖాతాదారుడు. అతడు ఎంత ఎక్కువగా కొంటుంటే అతడు పెట్టుబడి దారులకు అంత ప్రేమపాత్రుడౌతాడు.

కాని, చాలామంది ధనిక పెట్టుబడిదారులు కొన్ని కర పత్రాలలో వ్రాసిన వర్ణనలకు తగినట్లుగా ఉండరు. జీవితావసరాలకు కావలసిన మంచి వస్తువులు దూరదేశాలకు విస్తరించాలని వారి సహజవాంఛ. ఇది వారి పక్షంలో దురుద్దేశ్య పూరితం కాదు. అమెరికా పౌరులైనందువల్ల పనివారిసౌఖ్య క్షేమాలకు వారు అసూయ చెందరు. తాముజీవించుట ఇతరులను జీవించ నిచ్చుటయే వారి కోరిక.

ఈ విధమైన ఉత్తమ విధానంవలన, ఇతరులందరికంటె అధిక వేతనాలిచ్చినట్టి, లేదా ఖరీదులు తగ్గించుటకు సహాయ పడినట్టి, లేదా రెండు చేసినట్టివారే మహా భాగ్యాలు సంపాదించ గలిగారు. హెన్రీఫోర్డు పేరు ఈ సందర్భంలో మొట్ట మొదటిగా మనకు జ్ఞాపకము వస్తుంది. కాని, ఇంకా చాలా మంది యున్నారు. "మంచి వ్యాపారము" అందరికి లాభకరముగా యుండాలనే అభిప్రాయము సర్వసామాన్యమై పోయింది. మార్క్సు దృక్పథంనుంచి చూడడానికి అలవాటు పడిన ప్రజలందరికి ఆశ్చర్యంకలిగే ఈ విషయం— పెట్టుబడి దారుడు, పనివాడు—ఇరుపక్షాలవారు సమాన విజయులే అనే యదార్థం అమెరికా ఆర్థిక వ్యవస్థలోని ముఖ్యాంశం. అది వర్గ పోరాటం కాదు. వర్గ సహకారం—లేదా వర్గ రహిత పరస్పర

సహకారమే లాభకరం–మహాలాభకరం – అనటం ఇంకా మంచిది.

ఏమైనప్పటికీ ఈ విధానం కేవలం హెచ్చు వేతనాల నుంచే ఉద్భవించదు. వారియొక్క ఆశలను ప్రోత్సహించి నప్పుడుగాని చాలామంది పనివాళ్లు ఆర్థికంగా అభివృద్ధి చెంద లేరు. చాలినంత సంపాదించామనే అభిప్రాయం వస్తే వారు ఉద్యోగాలను విడిచిపెట్టవచ్చు లేదా, వారి వేతనం చాలా భాగం త్రాగుడు కుపయోగించవచ్చు. అందుచేత పనివాళ్లు సాంఘిక సమానత్వానికి ప్రయత్నించటం అమెరికా పెట్టుబడి దారులకు సంతోషకరమైనది. ఈవిధంగా కొలుగోలు శక్తిని అనేక విధములైన వస్తువులయొక్క, పనులయొక్క ఆవశ్య కత లోనికి మార్చబడుతోంది. ఆ విధంగా, అమెరికా పని వారి సాంఘిక ప్రమాణాభివృద్ధికై పాటుపడేసంఘుసంస్కర్తతో అమెరికా పెట్టుబడిదారుడు పూర్తిగా ఏకీభవిస్తున్నాడు.

సాంఘికాభివృద్ధి, ఆర్థికాభివృద్ధి కావాలనే వాంఛను హెచ్చించే విధానా లనేకం ఉన్నాయి. ఉదాహరణకి, కొను గోలు దారునకు అరువు లిచ్చే సంస్థను ఆలోచించు. దీనివలన ప్రతి మానవుడు తనకు కావలసిన దుస్తులను, రేడియో, కజ్జ సామగ్రి, ఒక కారుకూడా కొనుక్కొని కొద్ది సొమ్ము ముందుగా ఇచ్చి, మిగిలినదాన్ని కొన్ని నెలలోగాని, సంవత్స రాలలోగాని తీర్చుకోవచ్చు. అమెరికాలో విచిత్రంగా అభి వృద్ధి చెందిన ప్రచారంకూడా ఉన్నత జీవనాభిలాషను రేకెత్తించగలదు. కజ్జసామగ్రి, మోటారు కార్లు, రేడియోలు,

అలంకరణ వస్తువులు మొదలైన వనేకం అందరికీ వాంఛ నీయంగా అది చేస్తుంది. బ్యాంకుల ద్వారా, జీవిత భీమా ద్వారా ధనం నిలవచేసుకొనునట్లు, పిల్లల విద్యాభ్యాసమునకు సొమ్ము ప్రత్యేకించుకొనునట్లు అది ప్రోత్సహిస్తుంది. ధన, వస్తు, వాహన, సంపాదన, విద్యాద్యోగ్యతా పట్టముల సంపాదన జీవితానందమును, సాంఘిక గౌరవమును వృద్ధి చేయుటతో పాటు గౌరవప్రదంగా ఎంచబడుతోంది.

ఆ విధంగా ఎక్కువ ధనసంపాదనకేగాక దానిని సాంఘి కాభివృద్ధికై ఖర్చు చేయుటకు బలవత్తరమైన కారణాలు బయలుదేరుతున్నాయి. సాంఘికాభివృద్ధికి ప్రతివారు ప్రోత్స హింపబడుటయేగాక, చాలామంది ఐరోపియనులకు ఆశ్చర్యం కలిగించునంత సులభంగా విజయవంతు లయ్యారు. క్రొత్త ఖండంలో (New Continent)—కేవలం అది క్రొత్తది కనుక—అధమ స్థితినుంచి గొప్ప భాగ్యాన్ని, అధికారమును, గౌరవమును సంపాదించినవా రెందరో ఉన్నారు. "క్రొత్త ఇంగ్లండు" (New England) పాతదైనప్పుడు పశ్చిమ భాగం చాలా అభివృద్ధి చెందింది. అక్కడ మళ్ళీ ప్రజలందరికీ సమానమైన అవకాశాలున్నాయి.

మొత్తంమీద చూస్తే మా సాంఘిక వ్యవస్థ ఐరోపా జాతులకంటె ఎక్కువ దారాళమైనది. ఎప్పుడైతే అది కఠినంగా స్థిరపడినట్లు తోచిందో అప్పుడు ఇతర దేశాలనుంచి వలసవచ్చినవారినుంచికాని, లేక దేశంలోనే వలస వెళ్ళుట చేతగాని అది ఒక విప్లవరూపం వహించేది. ఒక్కొ

క్కూప్పుడు కోటీశ్వరులను భిక్షాధికార్లుగాను, భిక్షాధికార్లోళ్ళు కోటీశ్వర్లుగాను చేయగల ఆర్థిక ఒడుదుడుకులవల్లకూడా ఈ అలజడి కలిగేది. ఆ విధంగా ఎల్లప్పుడు పైకి స్థిరపడినట్లు కనుపించే అనామకులు, సంబంధంలేని ప్రజ లనేకులు గౌరవ ప్రపత్తులు సంపాదించటంలో విజయం పొందేవారు. మళ్ళీ మళ్ళీ పాతవారెవరైనా ఒక ప్రత్యేకమైన ఏక సంఘ స్థాపనకు చేసే ప్రయత్నాలకు అవకాశం లేకుండా పోయింది.

అయినప్పటికీ, అమెరికా పరంపరాచార విధానం లేకుండా ఈ బాహ్య పరిస్థితులు మాత్రమే ఈ మార్గాన్ని ఏర్పరిచి వుండలేకపోను. తోటిపౌరులను సమానులుగా ఆమోదించుటకు, శక్తిసాధనలనుబట్టి మానవు లందరికీ న్యాయం చేయుటకు, నీ సంగతి మాత్రమేగాని నీవు ఎక్కడినుంచి వచ్చావనే ప్రశ్న వేయకుండుటకు అమెరికా ప్రజల సంసిద్ధత అని నా తాత్పర్యం. అమెరికా జీవిత చరిత్రలోగాని, జీవిత గాథల్లోగాని, మరణ వార్తలోగాని వారు కూలివారుగానో, పండ్లు అమ్ముకునేవారుగానో, పేపర్లమ్ముకునేవారుగానో ఉండి భాగ్యాధికారులుగా సంపాదించిన విషయాల నెప్పుడూ దాపరికం చెయ్యలేదు. పైగా వీటిని ఆతని శక్తిసామర్థ్యాల కుదాహరణగా సగర్వంగా ప్రకటించేవారు. ఎవరైనా ధనిక వంశీయుడు కాదనీ, ఉన్నత సంఘీయుడు కాదన్న మాత్రం చేతనే బహిష్కరించ వీలుకాని ఒక నూతన సంఘమే దీనంతటికీ పర్యవసానం.

ప్రతివారినీ అభివృద్ధికై ఆహ్వానించుటచేత అమెరికా సంఘం ఎక్కువ ఆశావాదాన్ని అభివృద్ధి చేసింది. నాయొక్క స్వంత పరిస్థితులే కాకుండా, ఈ ఆశావాదపు వాతావరణమే సంసారంతో కూడా అమెరికాకు పోవునట్లు నన్ను ప్రోత్సహించింది. నేను 1935 లో ఈ దేశం వచ్చినప్పుడు, ఇక్కడి ప్రజలందరి ఆశాభావానికి కారణం, ఐరోపాలో ఉన్న యుద్ధ భయం ఈ దేశంలో లేకపోవటమే. తరువాత జరిగిన సంవత్సరాలలో వారి జీవితంలోను, పనులలోను, వర్గసహిత సంఘంలోని అసూయలుకాని, అన్యాయపు ప్రత్యేకతలుగాని అడ్డు రాకుండుటచేతనే అమెరికా ప్రజలు ఆశాభావంతో ఉండగలిగారని నేను గ్రహించాను.

ఇక్కడ ఏదీ అసంభవంగా లోచదు. ప్రతి మానవుడు తన జీవితంలోనే సాధించలేని దానిని, తన పిల్లలు సాధించగలరని ఆశించగలడు. అటువంటి భావమునే నీకు రుచి చూపించాలని నా అభిలాష. ఇంకా విజయవంతులు కాని వారికి,—పెద్ద విజయము నెప్పుడూ సాధించ లేనివారితో సహా—విజయవంతులు కాగల అవకాశము, అంతకుముందే గమ్యస్థానం చేరుకున్నవారు ఇచ్చే సహాయము, ఆమోదములే ప్రజలకు ఆనందం కలిగిస్తాయి. "సౌఖ్యసాధనము" అంటే ధన సంపాదనకంటె, గాడ్జెట్లు ( Gadgets ) కొనడంకంటె ఘనతరమైనది. అది తన జీవిత సర్వస్వమని, ఆధ్యాత్మిక జీవితం, ఆది భౌతిక జీవితంకూడా అదేనని అమెరికా పౌరుడు నీకు విపులీకరిస్తాడు.

# సాంకేతిక విద్యావకాశములు

ప్రియమైన హెన్రీ!

వర్గరహిత సంఘంలోకంటె అమెరికాలో వ్యక్తికి ఏ విధంగా ఎక్కువ అవకాశాలున్నాయో నీకు విశదీకరించుతానని వాగ్దానం చేశాను. ఈ అవకాశాలు—జీవితంలోనూ, విద్యాభివృద్ధికికూడా—కేవలం ఉత్తమ తరగతి వారి దయా ధర్మ భిక్ష కాదనికూడా నీకు చూపించాలని నా కోరిక. విప్లవ పోరాటంవలన వచ్చినవికూడా కాదు. మా ఆర్థిక విధానం యొక్క అనుశ్రుతావసరాలనుంచే అవి ఉద్భవించాయి. మా పెట్టుబడిదారులు కూలిన మిగిల్చే యంత్రాల నుపయోగం లోకి తెచ్చినపుడు అవి తప్పింపుకోటానికి వీల్లేనివైనాయి.

నీకు తెలిసినట్లుగా అమెరికాలోని పరిశ్రమలలోనూ, గనులలోనూ పనిచేసే ప్రతీ పనివానికి అవసరమైన పవరు (ఎలక్ట్రిసిటి మొదలైనవి) ఐరోపా దేశాలలోకంటె మూడు రెట్లు ఎక్కువ. యంత్రాలు మానవ కష్టానికి బదులు ఎంత వరకు ఉపయోగించారో ఇది సూచించగలదు. స్వాభావికంగా లేబరుకి యంత్రాల వృద్ధివలన ప్రయోజనాలు అద్భుతం. విరోధ ప్రయోజనాలు గల రెండు వ్యతిరేక విధానాలుండటంచేత వారి స్వభావమును తరుచుగా అపార్థం చేసుకో బడుతున్నాయి.

లేబరు తగ్గించే యంత్రాలవలన మొదటి ప్రత్యక్ష పర్యవసానం స్పష్టంగా పనివారికి అనుకూలమైనదికాదు. ప్రతీ యంత్రము కొంతమంది మనుష్యులను తీసివేస్తుంది.

అధమం కొంతకాలమైనా వీరు నిరుద్యోగులై ఉండాలి. దీనికి తోడు తనంతట తానే నిర్దుష్టంగా పనిచేయుట, ఎక్కువ వేగము, చెప్పాలుకుట్టే పురాతన పద్ధతికి బదులు ఆధునిక యంత్రసహాయంతో డజన్ల రకాలుగా చేసినట్లు మంచిపని వారి పనిని సరియైన సూక్ష్మవిధానములుగా విభజించుట మొదలైన పనులద్వారా పనిలోని గొప్పతనం యంత్రమే సంపాదిస్తుంది.

యంత్రాభివృద్ధిలోని ఈ ఫలితాలే కారల్ మార్క్సును కలవర పెట్టినవి. ఈ విధానం చాలాకాలం సాగుతుందనీ, నేర్పుగలవారి పనులన్నీ పోయి వారి స్థానే నేర్పులేని స్త్రీలు, పిల్లలు రాగలరనీ అతడు అనుకున్నాడు. మొట్ట మొదట కుట్టుయంత్రాలు కనిపెట్టిన కాలం అదే. తల్లికి మంచి స్నేహితుడై, అతి నిరపాయకరమైన పరిశోధనగూర్చి కొంచెం ఆలోచించు. యుద్ధదుస్తులు తయారుచేయించే ఒక ఫ్రెంచి నిర్మాత దానిని ఉపయోగించాడు. వెంటనే ఆగ్రహావేశులైన కుట్టుపనివారు దానిని ముక్కలు చేశారు. ఒక అమెరికనువాడు మరొక రకం కుట్టుయంత్రం కనిపెట్టాడు. కాని, కుట్టుపని చేసే స్త్రీలనేకులకు పనులు లేకుండా చేయుట అతని కిష్టం లేకపోవుటచేత, అప్పుడు దాని నతడుపయోగించలేదు.

కాని, యంత్రాభివృద్ధికూడా అంత ఎక్కువగా హెచ్చు కాలేదు. కుట్టు యంత్రం, ఇంకా పెద్ద వెన్నో వచ్చాయి. కాని, అవన్నీ నిలచిపోయాయి. వాటియొక్క రూపాలు పాత

నిర్మాతలలో కూడా (అసలు నిర్మాత అంటే చేతిలో నిర్మించువాడు) వ్యాపించి వాటిని యంత్ర పరిశ్రమలుగా మార్చేశాయి. అనేక కష్టాలతో కూడుకున్న ఈ పరిణామ కాలమును బట్టియే కారల్ మార్క్సు శాశ్వత "పారిశ్రామిక ప్రత్యేకపు సైన్యాన్ని" వృద్ధిచేస్తుందని జోస్యం చెప్పాడు. ఈ సైన్యం విపరీతంగా పెరిగి, వేతనాలను నిరోధింప లేని ఒత్తిడిలో ఉంచి, పనివారికి దీనావస్థను వృద్ధి చేస్తుందని అతడు ఆలోచించాడు. క్రొత్త ఉద్యోగులకు ఆధారం అతని దృష్టిలో ఒక్కటే కనుపించింది. ధనికుల ఇండ్లలో నౌఖరుల సంఖ్య పెరుగుతుందని చాల ఆశ్చర్యకరంగా అతడు అనుకున్నాడు. ఆధునిక ధనికవాదం వృద్ధిపొందిన ప్రదేశం అంతటా ఈ జోస్యం ఎంతగా విఫలమైనదో నీకు బహుశః తెలిసి వుంటుంది. ప్రత్యక్షంగా గృహ కృత్యములలో సహాయమే మొట్ట మొదటి కరువుగా పరిణమించింది. అన్నింటికంటె ధన సమృద్ధియైన అమెరికా దేశంలోనే ఇది చాలా విపరీతమై పోయింది.

మొత్తంమీద మార్క్సు చెప్పినదానికంటె వ్యతిరేక పరిస్థితు లేర్పడ్డాయి. మార్క్సు కాలం నుంచి విపరీతంగా పెరిగిన కూలిని తప్పించే యంత్ర సామగ్రితో, ఉద్యోగాలు చేయగలవారిలో అధిక సంఖ్యాకు లీ సరికి నిరుద్యోగులై, తెలివైన పనులలో కొద్దిమంది మాత్రం ఉండాలి. ఏమైనా 1930లోని గొప్ప కష్టపరిస్థితులలోనే అమెరికాలోని నిరుద్యోగ సమస్య ఉద్యోగార్హులైనవారిలో 100కి 25 మంది మాత్రమే.

యుద్ధానంతర సంవత్సరాలలో అది 100కి 2 నుంచి 5 మంది వరకు మాత్రమే.

దీని దృష్ట్యా చూస్తే, మార్క్సు చెప్పిన విధానము నంతనూ త్రోసి వేసి, పారిశ్రామిక పెట్టుబడి మొదటి రోజులలో అతడు చూడజాలని కిటుకు ఏదో దీనిలో ఉండాలి. ఇదివరకు ఉపయోగంలో ఉన్న సరుకులే కాకుండా.—దుస్తులు, గృహాలంకారములు, దీపాలు, వేడిమి మొదలైనవి — క్రొత్త పదార్థాలన్నింటినీ కూడా నిర్మించటానికి కావలసిన లేబరు ఆవశ్యకతయే ఈ కిటుకు. ప్రతీ సంవత్సరమూ ఇంచుమించు అంతులేని యీ జాబితాకు నూతన సరుకులు చేర్చబడు తుంటాయి. క్రొత్త మందులు, మందులు చేయుట, ప్లాస్టిక్కులు. రేలన్, నేలన్ మొదలైనవి అందులో కొన్ని మాత్రమే. ఎలక్ట్రిసిటి, గ్యాసొలైన్‌పై ఆధారపడిన వస్తువులు, నూతన యంత్రాలనుగూర్చి ఆలోచించాలి. క్రొత్త పదార్థాలు చేయుటకు కావలసిన పెద్ద పనిముట్లు తయారు చేయుటకు చాలా పని చేయవలసిన అవసరం ఉంది.

ఆ విధంగా ఉద్యోగాలలో పాటుపోటులు, మార్పులు ఉంటాయి. కాని, పూర్తిగా తగ్గిపోవటం అనేది ఉండదు. దానికి మారుగా జనాభా అభివృద్ధితో సమానంగా అది అనుసరిస్తుంది.

నేను ఇప్పు డింకొక సంగతి చెప్తాను. ఇది చాల ముఖ్యమైనదని నా ఉద్దేశ్యం. నేర్పరి పనులన్నీ తగ్గిపోయి సామాన్యులతో నిండిపోతుందనే మార్క్సు జోస్యంకూడా తప్పి

పోయింది. నిజమే—చాలా నేర్పరి పనులు తప్పించబడ్డాయి కాని, ఈ ఉద్యోగాలకు బదులు, మరొక రకమైన పను లుద్భవించాయి. ఇవి క్రొత్త స్వభావంగల పనులైనా పూర్వపు వాటితో సమానము—ఇంకా అధిక నేర్పరితనం కావలసిన పనులు.

ఈ క్రొత్త పనులు తరుచుగా నూతన శాలలకు సంబంధించినవి. వాటిలో చాలవరకు కర్మాగారపు పనులు కావు; కాని, ఆఫీసు, వృత్తులకు సంబంధించిన పనులు. ఎక్కువ క్లిష్టమైన యంత్రాలను స్థాపించుట, నడిపించుట, మరమత్తు చేయుట మొదలైన పనులలో నియమించబడిన వారికి, నేర్పరి పనులలో నియమింపబడినవారికి తోడు, క్రొత్త యంత్ర నిర్మాణమున కవసరమైన ఇంజనీర్లు, ప్లానింగు నిర్మాణ కార్యకలాప యాజమాన్యపు పనులు చేసేవా రనేకులు అవసరము. ఉదాహరణకి, ప్రఖ్యాత డూపాంటు రసాయనిక వ్యాపార సంస్థవంటి అనేక వ్యాపారములలోని పరిశోధన, అభివృద్ధి శాఖలలోనే ఈ రోజులలో, రసాయన శాస్త్రజ్ఞులు, భౌతిక శాస్త్రజ్ఞులు మొదలైనవా రనేకులు నియమించబడ్డారు. 50 సంవత్సరముల క్రిందట వీటిలోని పనివారి సంఖ్యకంటె ఇప్పుడు అధిక సంఖ్యాకులున్నారు. 1950 సం॥లో ఊహించటానికి కూడా వీలులేని అనేకమైన ఉద్యోగాలు—లెక్కల శాస్త్రజ్ఞులు, తత్వ శాస్త్రజ్ఞులు, ప్రజా సంబంధపు పనివారు—అంతా ఉన్నతార్హతలు గలవారు—అనేకుల సంగతి ఆలోచించు. ఆధునిక వ్యాపారములోని ఆధిక్యతనుబట్టి, యంత్రపు

పనులనుబట్టి, ప్రభుత్వ శాఖలైన పన్నులు, లేబరు రక్షణ, లెక్కలు మొదలైన పనులనుబట్టి అఫీసు పనులు అత్యధికంగా అభివృద్ధిపొందాయి.

కాలక్రమేణా నేర్పరి పనులు, ఆఫీసు ఉద్యోగాలు, ఇతర వృత్తి పనులు అధికమై, చిన్న పనులు, సాధారణ కూలిపనులు, మొదలైనవి తగ్గిపోవడం ఆరంభించాయి. ఉదాహరణకు, పెన్సిల్వేనియా యూనివర్సిటీ వార్టన్ పాఠశాలలో సాగింపబడిన ఉద్యోగ శాఖల పరిశీలనలో, ఉద్యోగాలలో ఉన్న వారిలో నూటికి చాలామంది ఉన్నతార్హతలు* కలవారని

| * | | 1910 | | 1948 |
|---|---|---|---|---|
| మొత్తం - ఉద్యోగాలన్నీ | | 100.0 | | 100.0 |
| వృత్తి పనివారు - కొంత వరకే వృత్తితో సంబంధించిన పనివారు. | | 4.5 | | 7.0 |
| సర్వాధికారులు, యజమానులు, ఉద్యోగులు | (24.5) | | (19.0) | |
| తోట పనివారు, తోట యజమానులు | | 17.3 | | 8.0 |
| సర్వాధికారులు, యజమానులు, ఆఫీసు పనివారు, తోట | | 7.2 | | 11.0 |
| గుమాస్తా, అమ్మకం, తత్సంబంధపు పనివారు | (10.6) | | (18.8) | |
| గుమాస్తా, తత్సంబంధమైన పనివారు | | 5.6 | | 12.6 |
| అమ్మకపు పురుషులు, అమ్మకపు స్త్రీలు | | 5.0 | | 6.2 |
| వృత్తి పనివారు, ఫోర్మెన్, తత్సంబంధ పనివారు | | 11.4 | | 13.9 |

తేలింది. 1910 నుంచి 1948 వరకు వృత్తికి, కొంతవరకు వృత్తికి సంబంధించిన పనివారు మొత్తంలో 100కి 4, 5 నుండి 7 వరకు, ప్రొప్రయిటర్లు, మానేజర్లు, ఉద్యోగులు (తోటకు సంబంధించినవారిని మినహాయించి) 100కి 7.2 నుంచి 11 వరకు హెచ్చింది. గుమాస్తా, తత్సంబంధమైన పనివారు 100కి 5.6 నుంచి 12.6 వరకు, అమ్మకపువారు 100 కి 5.0 నుంచి 6.2 వరకు హెచ్చింది.

నేర్పు అవసరంలేని పనివారి శాఖలలో 100 కి 24.9 నుంచి 10 వరకు విపరీతంగా తగ్గింది. ఈ తగ్గుదలలో చాలా భాగం తోట పనులలో జరిగినా, వ్యవసాయేతర పనివారిలో 100 కి 11.3 నుంచి 5.6 వరకు తగ్గిపోయింది. ఇదికాకుండా వృత్తిపనులు, ఫోర్మెన్, తత్సంబంధమైన పనులవారి శాఖ 100 కి 11.4 నుంచి 13.9 కి హెచ్చింది. "ఆపరేటివులు"— యంత్రాల నుపయోగించువారు, రక్షించేవారు 100 కి 14.4 నుంచి 21 వరకు పెరిగింది.

'ఆపరేటివులు' శాఖలో చాలామంది నేర్పు అవసరం లేని పనివారుకూడా ఉండటంచేత, మొత్తం దృశ్యం అంతా, మొదటి చూపులో ఉన్నంత రసవత్తరంగా ఉండదు. అయి

| | | |
|---|---|---|
| ఆపరేటివులు, తత్సంబంధపు పని వారు ... ... ... | 14.4 ... | 21.0 |
| సర్వీసు పనివారు ... ... ... | 9.7 ... | 10.3 |
| కూలి పనివారు ... ... | (24.9) ... | (10.0) ... |
| తోట పనివారు, ఫోర్మెన్ ... ... | 13.6 ... | 4.4 |
| కూలి పనివారు - తోట పని తప్ప.. ... | 11.3 ... | 5.6 |

నప్పటికీ వ్యవసాయేతర పనివారిలో తగ్గుదలకు, ఇంచు మించు, సరియగునట్లుగా వృద్ధిచెందిన ఈ శాఖలో మొత్తం పెరుగుదలలో నేర్పరితనం లేని పనివారుకూడా ఉన్నారని మనం అనుకున్నాం. ఇతర ఉన్నతశాఖ లన్నింటిలో ఎక్కువ పెరుగుదల ఉంది. నిజంగా అధికంగావచ్చిన ఆప రేటివులు పని చాలావరకు పూర్వపు కాయకష్టపు పనులకంటె ఉన్నత స్థాయిలో ఉంది. సర్వసాధారణంగా, అది ఎక్కువ ప్రతిఫలం తెస్తుంది; తక్కువ శ్రమగలది; ఎక్కువ ఆకర్షవంత మైనది.

దీని ననుసరించి చాలా ఉద్యోగాలకు, విద్యామానసిక అర్హతలు కూడా వృద్ధి చెందాయి. అన్ని విధముల, ఎక్కువ నేర్పరి తనము, మెదడును ఎల్లప్పుడు ఉపయోగించక తప్పింది కాదు. లేకపోతే, ప్రస్తుత రేటు ప్రకారం మన నిర్మాణమును వృద్ధిపొందుట కవకాశంలేదు. ఏ అమెరికా వ్యాపారస్థుడు ఈ పద్ధతిని అనుసరించకుండా తప్పించుకొన సాహసించలేడు. ఎందుకనగా, అమెరికాలో కంటె ఇంకెక్కడా కూడా ఇంత త్వరగా మానసిక దౌర్బల్యానికి శిక్షగా అపజయం కలుగదు. దీనికి మారుగా వ్యక్తిగత నేర్పరితనం, తెలివి తేటలు, ఉత్సాహశక్తి, ఊహాశక్తులకు, బహుమతిగా, త్వరితంగా బ్రహ్మాండమైన విజయం లభిస్తుంది. మా వ్యాపారసులు ఎల్లప్పుడూ పరిశోధనా నిర్మాణ జ్ఞానశక్తులకై ప్రయత్నించటంలో ఆశ్చర్యంలేదు. వారికి అవి ఏ విధంగా లభిస్తాయి? అదే మనం చూద్దాం ఇప్పుడు.

ఇతర దేశాలలోకంటె అమెరికాలో ఎక్కువమంది బుద్ధిమంతులైన యువకులున్నారంటే నేను నమ్మను. కాని, ఒక తేడా ఉంది. వారిని ముందుకు రాకుండా మేము అభ్యంతర పెట్టము. "పెద్ద కుటుంబాల" వారి పిల్లలకే పెద్ద ఉద్యోగాలను ప్రత్యేకం చేయటానికి ప్రయత్నించే వర్గ భేదాలు చూపించే అలవాటు మాకు లేదు. మేము అటువంటివి చేయలేము కూడా. అటువంటి డాంబిక ప్రవృత్తి చాలా కర్చుతో కూడినది. అటువంటి విధానముతోను, నిజంగా ఇంచుమించుగా వర్గరహితమైన ఎన్నికలోను, ఈ దేశపు ధనికులు ఒకదానిని ఎన్నుకోవలసివస్తే, వారు రెండవదానినే ఎన్నుకుంటారు. వర్గము, వంశములతో సంబంధం లేకుండా శక్తి సామర్థ్యము, తెలివి, నేర్పరితనములు ఎక్కడ కనిపించినా వానికై ప్రయత్నించ మా యజమానులు సంకోచించలేదు.

బ్యాంకరైన జె. పి. మార్గాన్, సీనియరును గూర్చి ఒక ప్రఖ్యాతమైన కథ ఉంది. ఫేమస్ ఈష్టర్న్ కాలేజిలోని పట్టభద్రులు తరగతినుంచి తెలివైన యువకుని సిఫార్సు చేయమని, అతడు కాలేజ్ అధ్యక్షుని కోరాడు. తన దగ్గిర చాలా తెలివైన కుఱ్ఱవాడు ఉన్నాడనీ, అతని తల్లిదండ్రులు మొదటి అమెరికా కుటుంబాలనుంచి వచ్చినవారనీ, పెద్ద పెద్ద క్లబ్బుల సభ్యులనీ ఆయన వ్రాశాడు. అందుమీాదట తాను ఆ కుఱ్ఱవాని శక్తి సామర్థ్యాలను గూర్చేగాని, వంశ పారంపర్య చరిత్రను తెలుసుకోనవసరం లేదనీ, తనకు ముందు ముందు ఉపయోగించే కార్యనిర్వాహకుడు కావాలిగాని, తన

గుర్రపు శాలలో ఉండటానికి పోతు గుర్రం అవసరం లేదనీ మోర్గాన్ సమాధానం వ్రాశాడు.

ఈ దృక్పథాన్ని అర్థం చేసుకోవాలంటే 'పూర్వ కాలపు' రాజులు, సభలు, రాజకీయ వేత్తలను గూర్చి జ్ఞాపకం చేసుకోవాలి. 19 వ శతాబ్దపు ప్రారంభంలోకూడా కొందరు రాజులు, ప్రభువులు సామాన్యులలో ఇమిడివున్న శక్తి సామర్థ్యాలను ఉపయోగించుటకు నిరాకరించారనే విచారకరమైన సమాచారములను గూర్చి చదువుటకు చాలా వినోదకరంగా ఉంటాయి. ఒక జాతియొక్క శక్తి సామర్థ్యములనే బంగారపు గనులను ఉపయోగించకుండా విడిచిపెట్టి ఒక కులతత్వ సంఘం తనకు తానే చేసుకున్న అపకారము ఊహాతీతమైనది. ప్రభుత్వము, సైన్యము, వ్యాపారము, ఇతర వృత్తులు—అన్నీ కుళ్ళి అధఃపతితమై పోయాయి. బాధ్యతాయుతమైన గొప్ప పనులన్నింటినీ ఉత్తమ వంశీయులైన అసమర్థులకు, మేడిపండు రంగులవారికి ఇవ్వబడ్డాయి.

ఐరోపాలోకూడా మేడిపళ్ల కాలం పోయింది. అయినప్పటికీ మానవ శక్తిని అమెరికాలోని ధనికులు గౌరవించినంతగా మరి యే ప్రాంతంలోని ధనికులు గౌరవించరు. ఊహాజనితమైన, నిరుపయోగమైన పురాతన కుల తత్వ భావాలను అమెరికాలో అగౌరవించినంతగా మరెక్కడా చేయలేదు. అందుచేతనే స్వంత డబ్బా వాయించుకునే ఉన్నత వంశీయులను అమెరికావారు అసహ్యించుకుంటారు. ఆ విధంగా కాయకష్టంతోనూ, "స్వార్థతత్వ ప్రయత్నాల

తోనూ " నిర్మించేదానికంటె నూరు రెట్లు అధికంగా నిర్మించ గల జ్ఞానశక్తిని ఈ దేశం సంపాదించగలిగింది.

మార్క్సు ముందు చూపుతో చూడనిది—అట్లు చూడ సాధ్యం కానిది—అయిన వేరొక ప్రవాహం ఉంది. పరిశ్రమల వలన అధికమైన ఏకాగ్రత ఏర్పడుతుందని మార్క్సు జోస్యం చెప్పాడు. కొంతవరకు ఇది నిజమైంది. మా "అపనమ్మకం" చట్టాలు పరిశ్రమనంతనూ ఒక్కరే మింగివేయకుండా రక్షించగలవు. కాని, పరిశ్రమనంతనూ బహుకొద్ది వ్యాపార ముల ఆధీనం కాకుండా అది రక్షించలేదు. ఏది ఏమైనా ఈ ఏకాగ్రతను రెండు విధానములద్వారా సరితూగునట్లు చేస్తున్నారు. మొదటిది—క్రొత్త సరుకులు, క్రొత్త పరిశ్ర మలు, క్రొత్త రకాల వ్యాపారములు ఎప్పుడూ బయలుదేరు తున్నాయి. అప్పుడప్పుడు క్రొత్త పరిశోధనల కాలం అంత రించిందని కొందరు సిద్ధాంతులు ప్రకటిస్తున్నారు. కాని, ఎలక్ట్రిక్ యంత్రాలు, యలక్ట్రిసిటీ ఉత్పత్తి, క్రొత్త రసాయన వస్తువులు, మోటరుకార్లు, విమానాలు, రేడియోలు, టెలివిజన్లు మొదలైన నూతన పరిశోధనలతో వారి మాటలు తారుమారు లవుతున్నాయి. ప్రతీ పెద్ద పరిశోధనలతో చిన్నవి, తక్కువ ప్రాముఖ్యమైనవానితో కొన్ని చిన్న మధ్య రకపు వ్యాపారములు జన్మించి, ఇంతవరకు పేరూ ఊరూ లేనివారి కొందరికి అభివృద్ధి మార్గాలు కలిగించాయి.

వీనికి తోడు సైనిక వస్తువుల అమ్మకంలోనూ, మర మ్మతు చేయుటలోనూ, పోషణలోనూ ఉపయోగించే పరి

శ్రమలను దీక్షతో నడుపుటచేత తగిన ప్రతిఫలం లభిస్తుంది. ఇరివరకే పరిచయమైన వాచీలు, పాదరక్షలు, దుస్తులు, గృహాలు మొదలైనవాటికి సంబంధించినవే కాక, పై పరిశ్రమలవలన అనేకులైన స్వతంత్రవృత్తి పనులవారికి తగినంత ఆధారం కలుగుతుంది. క్రొత్తవస్తువులన్నీ తరుచు, సున్నితమై, యంత్ర సహాయంతోకూడినవగుటచేత మిగిలినవాటిలోకంటె, ఎక్కువమంది సహాయకుల అవసరం కలుగుతుంది. అసంఖ్యాకములైన గ్యాసు సర్వీసు స్టేషన్లకు, క్రొత్త, పాతకార్లు, టైర్లు, బ్యాటరీల అమ్మకానికి మోటారుకార్ల పరిశ్రమ ప్రాణం పోసింది. కార్లు ఉపయోగించే వారికి ఈ పనులు తప్పనిసరిగా కావాలి. ఆ విధంగానే ఎలక్ట్రిక్, రేడియో పరిశ్రమలకు సహాయభూతంగా పనిచేసే వ్యాపార సంస్థలు కొన్ని వేలు బయలు దేరాయి. ఈ సంస్థలకు పూర్వవృత్తి పనులవారు, నేర్పరి పనివారిలకంటె అధికమైన తెలివి, నేర్పరితనములు గల పనివా రధికంగా అవసరం.

ఈ అభివృద్ధులన్నింటి మూలంగా విద్యకూడా చాలా వృద్ధిపొందింది. దినదినాభివృద్ధి పొందుతున్న ఉద్యోగాలకై కావలసిన అర్హతల సంపాదనకై ప్రతీ తరంలోను క్రొత్త క్రొత్త విశాల విద్యా సౌకర్యాల అవసరం కలిగింది. ఇది చాలా ముఖ్యమైన క్రొత్తవిషయం. దీన్నిగూర్చి నీకు తరువాత వ్రాస్తాను.

# వర్గరహిత సమాజంలో విద్య

ప్రియమైన హెన్రీ!

వెంటనే జవాబు వ్రాసినందుకు, ధనిక పెట్టుబడిదారీ విధానంలోని విద్యనుగూర్చి మార్క్సు అభిప్రాయాలపై నీ విమర్శలకు నా కృతజ్ఞతాభి వందనములు. అతని సిద్ధాంతం అమెరికాకు వర్తిస్తుందా అనేది నీమటుకు నీకే సందేహంగా ఉన్నట్లుంది. కనుక 'కాపిటల్' గ్రంథంలో మార్క్సు అభిప్రాయాలను చూశాను. అతనికి మామూలు ప్రకారం, అతని దృష్టిలో సంపూర్ణమైన ధనికవాదియైన రచయితను ఉదహరిస్తూ సమర్థించుకో ప్రయత్నించాడు. అత డుదహరించినది: "పరిశ్రమకు తెలివి తక్కువ కన్నతల్లి..." బుద్ధి ఉపయోగానికి తక్కువగా ఉపయోగించినప్పుడు, మనుష్యులే వివిధ భాగములుగా పనిచేసే యంత్రాగారముగా పరిగణించబడినప్పుడు, నిర్మాత లధికంగా బాగుపడతారు. మార్క్సు మాటలకు ఆధారమును చూసినప్పుడు నాకు కలిగిన ఆశ్చర్యం ఆలోచించు. 1776 లో ప్రకటింపబడిన ఫెర్గూసన్ యొక్క "ప్రజా సమాజపు చరిత్ర" అనే గ్రంథం, ఫెర్గూసన్ భావం, ధనిక తత్వ వ్యాపార ప్రథమావస్థకు చెందివుండవచ్చు. కాని, అది మార్క్సుకాలానికి కూడా పురాతమైనదై ఉంటుంది. ఏ విధంగానైనా ఆధునిక అమెరికా పరిశ్రమలలోని "ఇంజన్లు" మనుష్యులతో చేయబడినవి కావని మాత్రం మీకు నేను చెప్పనవసరం లేదు.

ధనిక తత్వయుక్తమైన అమెరికా అనుసరిస్తున్న విధానం మాత్రం మార్క్సు అనుకున్నదానికి సరిగ్గా వ్యతిరేకం. పని వారిని విద్యాభ్యాసం చేయకుండా అవరోధం కలిగించి, వారిని శాశ్వతంగా దీనదశలో ఉంచాలనీ, వారు కాయకష్టముల నుంచి ముక్తి పొందుటకు విఘ్నం చేయకుండా అరికట్టాలనే కోరిక అమెరికా ధనికుల బుర్రలలో ఎన్నడు ప్రవేశించనేలేదు. సర్వజనులకు విద్యాభ్యాసమే జాతియొక్క ప్రధాన లక్ష్యము. కాలక్రమంలో దీనినే, ఉన్నత విద్యాభ్యాసానికి అందరికీ సమానావకాశములని వ్యాఖ్యానించారు. విద్యాభ్యాస సమానత్వములను అనుభవించుట ఇప్పుడే ఆరంభించిన నీగ్రో లుండే దక్షిణ ప్రాంతంలో తప్ప—ఈ విషయం గూర్చి తరువాత మరియొక ఉత్తరంలో వ్రాస్తాను—ధనికులు ఈ మార్గాన్ని నిరోధించుటకు చేస్తున్న ప్రయత్నా లేమీ నాకు తెలియవు.

ఆ విధంగా చేయుట వారికి నిజంగా అస్వాభావికమైనది. పరిశ్రమలు అభివృద్ధి చెందుతున్న కొలదీ, దాన్ని అభివృద్ధి చేసిన విద్యావంతుల ఆవశ్యకతను గూర్చి ఆలోచించు శక్తి సామర్థ్యాలకే కాకుండా, క్రొత్త ఉద్యోగాలను భర్తీచేసి, జాతికి ఉన్నతసేవను, ఉత్తమ పదార్థములను తయారు చేయగల విజ్ఞానవంతులకై సర్వదా అన్వేషణ జరుగుతున్నది. మన కాలంలోకూడా కాలేజి విద్యాభ్యాసం అత్యధికంగా ఉన్నప్పుడు ఇంజనీర్లు, రసాయన శాస్త్రజ్ఞులు, భౌతిక శాస్త్రజ్ఞులు, వైద్యులు ఎక్కువ ఆవస్యకమై ఉన్నారు. క్రమంగా

నేము మా పాఠశాలలను, కాలేజీలను, విశ్వ విద్యాలయ ములను అభివృద్ధి చెయ్యాలి.

అందరికీ విద్యాభ్యాసంలో సమానమైన అవకాశములను నిరోధించక పోవుటయేకాక, అటువంటి అవకాశములను అభి వృద్ధిచేసే ఉద్యమాలలో మా దేశ ధనికులు ముందంజ వేశారు. ఈ విషయంలో పరోపకార స్వభావం ఎంతో సహకరించింది. అనేకులైన ప్రతిభావంతులు అథమ స్థితినుంచి వృద్ధిజెందిన దేశంలో ఇది చాలా సహజం. వారిలో చాలా మంది ఇతరుల అభివృద్ధికై సహాయపడుట తప్పదని నిశ్చ యించుకున్నారు. అట్టి వారు పాఠశాలలకు, కాలేజీలకు గొప్ప దానములను, విద్యా వేతనాలను ఇచ్చారు. కాని దీనిలో బలవత్తరమైన అభిప్రాయం, ఉన్నతమైన స్వార్థం–ప్రజ్ఞాయుతమైన సహాయం అవసరమే. అమెరికా పరంపరా చారమైన సమానత్వభావంలో వేళ్ళు పాతుకున్న నర్గరహిత విద్యా విధానము, అమెరికా ధనిక పెట్టుబడిదారీ విధాన మునకు ముఖ్యావసరం.

ఇప్పుడు ఖచ్చితమైన ప్రతిఫలములను గూర్చి చూద్దాం. అమెరికాలో విద్యావిధానం అంతా రాష్ట్ర ప్రభుత్వాలకు. స్థానిక సంస్థలకు విద్యాసంస్థలకు విడిచిపెట్టబడింది. ఆర్థిక సాంఘికాభివృద్ధిలోనూ, ధన సమృద్ధిలోనూ వివిధ రాష్ట్రాలు వివిధరకాలుగా ఉండుటచేత, అవసరమైనంతసహాయం కేంద్ర ప్రభుత్వం ఇస్తున్నప్పటికీ, కొన్ని బీదరాష్ట్రాలలో విద్యా విధానం చాలా దీనదశలో ఉండుట ఆశ్చర్యకరం కాదు.

ఏమైనప్పటికీ, 1947–48 సం॥ లో 5 మొదలు 17 సంవత్సరముల లోపు వయస్కులైన పిన్నలు 3,0171,000 మంది ఈ దేశపు పాఠశాలల్లో చేరారు.

గత పుష్కరాలలో కూడా అన్ని వయస్కులైన వారిలోనూ విద్యాభివృద్ధి చాలా చురుకుగా జరిగింది. * 14 నుంచి 17 సంవత్సరముల వయస్సుగలవారిలో పాఠశాల విద్య చాలావృద్ధి పొందింది. ఉన్నత విద్యాభివృద్ధి కిది సూచన. 1899–1900 సం॥ లో పై వయస్కులు 100కి 7 మందిమాత్రం పాఠశాలలకు పోవుటచేత, 1929–30 లో సంఖ్య 100కి 51కి, 1947–48 లో 75కి హెచ్చింది. ఇప్పుడు న్యూయార్కు ప్రభుత్వ పాఠశాలలో 16 సం॥ వయస్సువరకు నిర్బంధంగా విద్యాభ్యాసం చెయ్యాలి.

ప్రజాస్వామ్య పాఠశాల విద్యావిధానం లేకపోతే, ఉన్నత పాఠశాలలో విద్య ఇంతగా అభివృద్ధిచెందదు. చాలా ఐరోపా దేశాలలో పిల్ల లందరూ ప్రాథమిక విద్యను తొమ్మిది లేక పది సంవత్సరాల వయస్సు వరకే అభ్యసిస్తారు. అందుచేత, ఆ చిన్న వయస్సులో ఉన్నత పాఠశాలలో చేరని పిల్లలు తరువాత ఆ పాఠశాలలో చేరుట కష్టతరం అవుతుంది. అమెరికా పిల్లలకు 12 లేక 13 సంవత్సరాల వయస్సు వరకు ప్రాథ

| * | 1910 | 1940 | 1947 | |
|---|---|---|---|---|
| 10 సం॥ వయస్సు: 100కి | 90.0. | _95.7. | 10 నుంచి 13సం॥. 100కి | 98.6. |
| 14 ,, ,, ,, | 81.2. | _92.5. | 14 ,, 15 ,, ,, | 91.6. |
| 16 ,, ,, ,, | 50 6. | _76.2. | | |
| 17 ,, ,, ,, | 35.3. | _60.9. | 16 ,, 17 ,, ,, | 67.6. |

మిక విద్య సాగుతుంది. ఆ విధంగా 12 లేక 13 సంవత్సరాల వారి కుపయోగించే ఉన్నత పాఠశాలలో చేరుటకు అందరికీ అవకాశం ఉంటుంది. ఇంకా విశేషం ఏమిటంటే పిల్లలలో అత్యధిక సంఖ్యాకులు చదివే బహిరంగపు పాఠశాలలలో విద్యాబోధ ఉచితంగా లభిస్తుంది. వారికి పాఠ్యగ్రంథాలు ఉచితంగా ఇచ్చి, మధ్యాహ్న భోజనం చాలా తక్కువ ఖరీదు కే ఏర్పాటు చేస్తారు. దీన్ని సోవియట్ రష్యాతో సరి పోల్చి చూడు. 1940 అక్టోబరు 3వ తేదీ డిక్రీమూలంగా, కాలేజీలు, విశ్వవిద్యాలయాలలోనే కాకుండా ఉన్నతపాఠ శాలలో ఆఖరి మూడు సంవత్సరాలకు కూడా తగినంత జీతాలు ఏర్పాటు చేశారు. ఆ సంవత్సరం నాలుగు వారాలలో జీతాలు కట్టలేనందుకు గాను, 6,00,000 మంది విద్యార్థులను పాఠశాలలనుంచి పంపించి వేశారు.

ఉన్నత తరగతుల విద్యావిధానములు గూర్చి ఆలోచించి నపుడు, పరిస్థితి ఇంకా ఆశ్చర్యకరంగా ఉంటుంది. 1950 అక్టోబరు మాసంలో కాలేజీలు, విశ్వ విద్యాలయాలు, ఇతర విద్యా సంస్థలలో 23,44,509 మంది అమెరికా యువకులు విద్యాభ్యాసం చేస్తున్నారు. వీరిలో చాలా మంది మధ్య, అథమ తరగతి వారికి సంబంధించినవారు.

చాలామంది విద్యార్థులు తమ జీతాలను, విద్యా వేతనాలు, ఇతర వివిధరకాల పనులద్వారా చెల్లిస్తారు. కొందరు విద్యార్థులు ఉపాధ్యాయులుగానూ, ప్రైవేటు ట్యూటర్లుగానూ పనిచేస్తారు. కొందరు షాపులలో అమ్మకపు

పనివారుగను, టాక్సీ నడిపేవారుగను మొదలైన వృత్తులు చేస్తారు. ఇంకా అథమ తరగతినుంచి ఉన్నత తరగతుల వరకు అన్ని తరగతి జనులలోనూ, న్యాయశాస్త్రము, కళ, లేక వారి ఇష్టమైన ఇతర శాఖలను అభ్యసించే విద్యార్థులు ఉన్నారు. పెద్ద పట్టణాలలోని కాలేజీలు, విశ్వవిద్యాలయాలు ఈ విద్యార్థులకొరకు సాయంత్రపు క్లాసులు ఏర్పాటుచేస్తారు. కొందరు పగలు క్లాసులకంటె సాయంత్రపు క్లాసులనే ఎక్కువగా ఏర్పాటుచేస్తారు. పగటికాలంలో ఇతర వృత్తిలో పనిచేసే విద్యార్థి మామూలుగా పూర్తిచేయవలసిన నాలుగు, లేక ఆరు సంవత్సరాలలో తన విద్యను పూర్తి చేయలేని పక్షంలో, అతడు మరికొన్ని సంవత్సరములు చదివి, లేక సాయంత్రపు క్లాసులలో చదివి తన వృత్తి జీవితానికి కావలసిన యోగ్యతా పత్రమును సంపాదించుకుంటాడు. ముఖ్యంగా ఒక ఉద్యోగానికి దరఖాస్తు చేసిన పట్టభద్రుని, ఆతని విద్య, డిగ్రీలనుగూర్చి మాత్రమే కాక, మామూలు ప్రకారం, అత డంతకుముందు ఏ ఉద్యోగం చేశాడోకూడా అడుగుతారు.

ఉన్నత విద్యాభివృద్ధికై తయారు చేయబడిన ప్రఖ్యాత ప్రజాస్వామ్య విధానమే "హక్కుల జి. ఇ. బిల్లు" అని పిలువబడుతుంది. దీనివలన రెండవ ప్రపంచ యుద్ధంలో పనిచేసిన వారందరికీ, సగటున శిక్ష సంవత్సరాలు ఒక విశ్వవిద్యాలయంలోగాని, ఇతర ప్రత్యేక పాఠశాలలోగాని చదువుటకు కావలసిన సొమ్ము నిర్ణయించబడినది. పైన

చెప్పిన విద్యార్థుల సంఖ్య, ఈ విధానపు ఫలమే అని మాత్రం అనుకోవచ్చు. 1950 వ సంవత్సరం ఆఖరుకి చాలామంది పాత సైనికులంతా విద్యాభ్యాసం పూర్తిచేశారు. వారిలో 601,753 మంది మాత్రమే కాలేజీలలో ఉన్నారు.

హార్వర్డు యూనివర్సిటీ అధ్యక్షుడైన డాక్టరు జేమ్సు బి. కోనెంటు అనే ఆయన "వర్గరహిత సమాజానికి విద్య (1940)" అనే వ్యాసంలో, భావికాలానికి ఇంకా పూర్తిగా ప్రజా స్వామ్య విద్యా విధానం కావాలని వ్రాశాడు. 1948లో వ్రాసిన గ్రంథంలో, బాగా బీద కుటుంబంనుంచి యైనా, బాగా వెనుకబడిన ప్రాంతంనుంచియైనా సరే ప్రజ్ఞావంతుడైనా ప్రతి బాలునికీ ఉన్నత విద్యాభ్యాసానికై తగిన అవకాశం ఇవ్వాలని ఆయన కోరాడు. ఇటువంటి పనులకై ట్రూమన్ అధ్యక్షుడు ఒక పెద్ద కార్యక్రమమును ప్రతిపాదించాడు.

ఇందులోని అన్ని కోర్కెలు సాధింపబడలేక పోయినా, విధానం మాత్రం తప్పు జరుగుటకు వీలులేనిది. భావి పురోభివృద్ధికరమైన ఆర్థిక వ్యవస్థకు ఎక్కువమంది పనివారు, పనివారి బిడ్డలు తమ విద్యాభ్యాసమును నిరాటంకంగా సాగించుట అవసరం అన్నది దీనిలోని ముఖ్యాభిప్రాయం. విద్యా ప్రమాణాలు అభివృద్ధియగుచున్న కొలదీ, వారికి క్రొత్త సాంఘికార్థికాభిలాషలు వృద్ధిపొందుతాయి. ఇక్కడ నీకు నిజమైన లాభకర వాతావరణం లభిస్తుంది.

కాని, మా బహిరంగ గ్రంథాలయాలనుగూర్చి ఇంచు మించు మరిచిపోయాను. అమెరికా జీవితంలో అవి మరి యొక వర్గరహితశాఖ. నేను అమెరికా రాక ముందు ఇక్కడి ప్రజలు గ్రంథాలయాభివృద్ధిలో ఎందు కింత శ్రద్ధ వహిస్తున్నారో, కార్నెగీ మొదలైన ధనికు లనేకులు వీని కొరకై అంత పెద్ద మొత్తాల నెందుకు విరాళము లిచ్చారో నాకు అర్థంకాలేదు. అప్పటినుంచి, ఈ గ్రంథాలయాలు ఇక్కడ జాతీయ వయోజన విద్యాభివృద్ధికి ముఖ్య సాధనము లని నేను గ్రహించాను. ప్రతి నగరంలోనూ, పట్టణంలోనూ గ్రంథాలయాలు, పెద్ద సిటీలలో బ్రాంచిలుకూడా నీవు చూడ గలవు. తరుచు అవి సాయం సమయాలలో తెరువబడి, ప్రదర్శ నలు, విద్యాబోధలు, ఉపన్యాసాలు మొదలైన వాటిని సాగిస్తుంటాయి. ప్రతీవారూ గ్రంథాలయాల లోనికిపోయి, ఏ సంప్రదాయాలు లేక, పేరుకూడా ఇవ్వనవసరం లేకుండా గ్రంథ పఠన సాగించవచ్చు. పుస్తకాలు ఇంటికి తీసుకు పోవాలంటే మాత్రం నీవు ఆ పట్టణ నివాసివై యుండాలి. కాని, ఏ ధరా వత్తుగాని, గ్యారంటీగాని ఇవ్వకుండా నీవు గ్రంథాలయ కార్డును పొందవచ్చు. ఆ విధంగా ఆశ్చర్యకరమైన ఏర్పాట్లతోను, సదుపాయములతోను, ప్రత్యేకంగా తమ పనులలో తర్ఫీదు పొంది సహాయార్థం పనిచేసే స్త్రీపురుషోద్యోగులతోను నిండిన గ్రంథాలయాలలో ప్రతివారు గ్రంథపఠన చేసుకోవచ్చు.

పనిపాటలు, సంపాదనలోనూ అభివృద్ధి కరంగాను, సాంఘిక సంస్కరణగాను, సామాన్య ప్రజలకు అమెరికా

విద్యావిధానం చాలా సహాయం చేసింది. 1880 సం॥ నాటి పూర్వం, అమెరికాలో ''ఏ ఇతర దేశంకంటె సగటున విజ్ఞానం అధికంగానూ, పఠించుట, ఆలోచించుట, అలవాట్లు సాధారణంగా తక్కువగాను ఉన్నట్లు'' జేమ్సు బ్రైస్ గ్రహించాడు. దీనికి వ్యతిరేకంగా, కొన్ని ఐరోపా దేశాలలోకంటె అమెరికాలోని ధనికులలో విద్యాభివృద్ధి సగటున తక్కువగా ఉన్నమాట నిజంకావచ్చు. మొత్తంమీద ఫలితం వర్గరహిత సమాజమునే చూపిస్తుంది. విద్యాధికులు ధనికులైన వారినుంచి విద్యావిహీనులైన పనివారు, రైతులను వేరుచేసే అపనమ్మకం అనే అఘాతం క్రమంగా సన్నగిల్లుతోంది. ప్రజలు ఒకరినొకరు సక్రమంగా అర్థం చేసుకుంటున్నారు. పరస్పర నమ్మకంలో వారు లాభం పొందుతున్నారు. ఆ విధంగా, మానవ సంబంధాలలోను, నిర్మాణంలోను, రాజకీయాలలోను, ప్రభుత్వంలోనుకూడా వర్గ విభేదానికి బదులు వర్గ సహకారమును పెంపొందించుటలో విద్య అత్యంత సేవచేసింది.

# కష్టనష్టాల - రక్షణ

ప్రియమైన హెన్రీ!

నీవు వ్రాసిన క్రిందటి ఉత్తరానికి కృతజ్ఞతాభి వందనములు. మన యిద్దరికీ మనస్సులోని అంతిమలక్ష్యం ఒకటే కనుక, ఇంతకీ నీకూ నాకూ ఎక్కువదూరం లేదు.

పనివారికి తగిన రక్షణలేనప్పుడు అతడనుభవించే సదుపాయముల కంత విలువలేదని నీ వంటున్నావు. అతడు చాలాకాలం ఉద్యోగహీనుడై వుండవలసిన అవకాశము, ఈ ప్రమాదము నెదుర్కొనుటకు తగిన ఆధారములు లేకుండుట, జబ్బుపడుట, అపాయము, తప్పనిసరియైన వృద్ధాప్యపు అశక్తి మొదలైన ఆటంగాలున్నంతకాలము, అతడు తన భావిజీవితమును గూర్చి భయాందోళనలతో జీవించ వలసి వుంటుందని నీవు నొక్కిచెప్పటం న్యాయమే. ఉన్నత వర్గాలనుంచి అతన్ని విడదీసే గొప్ప అడ్డంకి ఇదే అని నీ వంటావు.

ఒక తరానికి పూర్వపు అమెరికా పనివాని విషయంలో నీవు చెప్పిన నివేదనలన్నీ యదార్థమే కావచ్చు. కాని, మన కాలంలో అవి వర్తించవు. పనివారి స్థితినిగూర్చి నీవు ఆలోచించినంత సులభంగా వర్ణించుటకు వీలులేదు. యజమాని స్థితికూడా అంత సులభం కాదు.

మొట్టమొదటిది—మరొకవిధంగా ప్రకాశవంతమైన మన వాతావరణమును తరుచు మేఘావృతంచేసే ఆర్థిక భద్రతా రాహిత్యమే ఈ దేశంలోని వర్గరహిత జీవితంలోని మరియొక భాగం. భద్రతారాహిత్యం, కష్టనష్టాలు ఒక్క పనివారి

వర్గమును మాత్రమే బాధించవు. ఈ దురదృష్టాలవలన మధ్య తరగతులు, రైతులుకూడా వీరిలో సమానంగా బాధ పడ్డారు. ధనికులైనా వీటిచే విడిచిపెట్ట బడలేదు. 1929 లో ప్రారంభించి చాలా సంవత్సరాలు జరిగిన గొప్ప నష్ట సమయంలో జీవితాలు నాశనం చేసుకున్నవారు, ఆత్మ హత్యలు చేసుకున్నవారు పనివారిలో కంటె ధనికులలోనే అధికంగా ఉన్నారని నా నమ్మకం. అంటే సామాన్యపు వేతనాలు సంపాదించుకునే పనివారిలో కంటే, ధనిక ప్రజలలో అధిక సంఖ్యాకులు, తమ మామూలుగా అలవాటైన పద్ధతిలో జవితం గడుపలేక ఆర్థికంగా నాశనమై పోయారు. నష్టం పొందటానికైనా ధనికులవద్ద ధనం అధికంగా ఉండనీ నీ వంటావు. బహుశః కావచ్చు. ఏమైనా, 1929 లోని వ్యాపార మాంద్యపు దినాలలో నివసించిన ధనిక పెట్టుబడిదారునికంటె వేగంగా చితికి పోటానికి తగిన కష్టాలలో చిక్కుకోగలవా రింక మరెవ్వరూ ఉండరు.

ప్రజాస్వామ్యపు ధనిక పెట్టుబడిదారీ విధానంలో మాంద్యాన్ని కష్టనష్టాలనుంచి తప్పించుకోటం కొంతవరకు దుర్లభం అని నే నంగీకరిస్తాను. కాని, 1929–1933 సంవత్సరాలలో జరిగినంత దారుణ విపత్తులకు దారితీయించిన మాంద్యమునుంచి తప్పించుకోటం మాత్రం దుర్లభం అంటే నే నంగీకరించను. మన ఆర్థిక వ్యవస్థలో పనివారు నిరుద్యోగము, జబ్బు మొదలైన కష్టాలలో అసహాయతతో అవస్థపడక తప్పదని కూడా నే నంగీకరించను. దానికి వ్యతిరేకంగా, మన ఆర్థిక

విధానంలో జరిగే విపరీతమైన నిర్మాణంవలన, పనివారి రక్షణకు తగు మాత్రంగా వ్యక్తిగత భద్రతలకు తగిన ధనం నిలవ చేసుకోటానికి అవకాశం ఉంది. నిజం చెప్పాలంటే, ఇది మే మీమధ్యనే నేర్చుకున్నాం. 'యుద్ధం తరువాత నుంచి మొత్తంమీద, స్వదేశంలోని ప్రజావసరాలకు కావలసినవన్నీ అధికంగా సప్లయిచేస్తూ, ఇతర దేశాలలోని వేలాది ప్రజలను నిరాహార సమస్యనుంచి రక్షించగలిగాము.

ఈ సత్యాన్ని నీవు ప్రతిఘటించ వచ్చు. ఇతర ఆధారాల నుంచి నీకు తెలియచేసిన వాతావరణ దృశ్యముతో ఇది మారదు. దేశం ఎంతధనవంతమైనప్పటికీ, ధనికులైన "పరిపాలక వర్గం" ప్రజలకోసం స్వార్థత్యాగాలు చెయ్యకుండా, వేలాది ప్రజలను తిండిలేకుండా మాడ్చి వేస్తుందని నీకు తెలియచేశారు. నీకు ఈ విధంగా చెప్పినవారిలో చాలామందికే అసలు నిజస్థితి తెలియకపోవుట చాలా విచారకరం. ధనిక పెట్టుబడి దారులు చట్టములుచేసే పరిపాలకవర్గంగా ఎల్లప్పుడూ వ్యవహరిస్తారనీ, పనివారికి జరిగే ప్రతీ సదుపాయమూ వారికి నష్టకరంగానే ఉంటుందనీ. వారు మత సాంప్రదాయ తుల్యమైన నమ్మకంతో ఉంటారు. అటువంటి స్వయం పోషక భావాలు అమెరికా విషయంలో ఎంతమాత్రమూ చెల్లవు.

ఐరోపాలోకూడా అసలైన నిజపరిస్థితులు మార్క్సు భావాల కనుగుణ్యంగా ఉండవు. చాలా కాలం క్రిందట కొన్ని దేశాలలో నిరుద్యోగం, అపాయము, జబ్బు, ముసలి తనములలో పనివారల రక్షణకై కొన్ని చట్టాలను ప్రవేశ

పెట్టారు. వర్గసమాజపు ఛాయలతో ధనిక తత్వమునే మాయం చేసిన ఏకచ్ఛత్రాధిపత్యంలోని జర్మనీ దేశం ఇటువంటి చట్టములు ప్రవేశపెట్టిన దేశాలలో మొట్టమొదటిది. అటువంటప్పుడు, అమెరికా ధనికవాదతత్వానికి ఈ రక్షణ ఎందుకు వ్యతిరేకం కాగలదు ?

ఐరోపాలోని పెక్కు దేశాలకంటె, సాంఘికభద్రతలో కొన్ని సంవత్సరాలు అమెరికా వెనుకబడిన మాట వాస్తవం. ఇట్టి మాంద్యవ్యాపార పరిస్థితికి కారణాలు ముఖ్యంగా అమెరికా జాతీయాభివృద్ధికి కారణమైన మానసిక వాతావరణంలోనే ఇమిడి వున్నాయి. పూర్వపు రోజులలో ఏదైనా విషమ పరిణామావస్థ సంభవించగానే, ప్రజల నాహ్వానించి నూతన జీవితాల నేర్పాటు చేసుకోటానికి తగిన నూతనావకాశము లెన్నో ఉన్నాయి. ఈ దేశపు అనంతావకాశాలచేతనే ప్రజలు ఆనందాదృష్ట మన స్తత్వాన్ని అలవరచుకోగలిగారు. ముందు జాగ్రత్తలు, నీరసము అనవసరముగా కనుపించాయి. అందుచేత సైనిక సంసిద్ధతను నిర్లక్ష్యం చేసినట్లుగానే, మా జాతి ఆర్థిక భద్రతనుగూర్చి కూడా నిర్లక్ష్యం చేసింది.

పైన చెప్పిన గొప్ప వ్యాపార మాంద్యతవలన ప్రతివారూ మన లాభనష్టాల పరిస్థితిని తెలుసుకొనవలసిన అవసరం కలిగింది. 1933 సం॥లో ఫ్రాంక్లిన్ డి. రూజువెల్టు పరిపాలనతో ఆరంభించి, నిరుద్యోగము, అపాయము, జబ్బు, వృద్ధాప్యములనుంచి పనివారిని రక్షించుటకు అమెరికాలో ప్రభుత్వ మార్గాలు, ఇతర ప్రత్యేక మార్గాలద్వారా అనేకమైన

ఏర్పాట్లు చేయబడ్డాయి. సంయుక్త సాంఘిక భద్రతా చట్టం ప్రకారంగా అన్ని రాష్ట్రాలలోనూ (వృత్తి అపాయము) పని వారి నష్టపరిహారపు భీమా పద్ధతులు. నిరుద్యోగ భీమా పద్ధతులనేకం అభివృద్ధిచెందాయి. ఈ సరికి, చాలా పెద్ద కార్పొరేషనులు ఉద్యోగులకు ప్రత్యేక పెన్షనులకై నిధులను ఏర్పాటు చేశాయి. అనేకులైన పనివారి జీవిత భీమా పాల సీలతో పాటు, ఆరోగ్య వైద్య సహాయ భీమాలకు కూడా తరుచు కొంత భాగమో, పూర్తిగానో యజమానియే సొమ్ము చెల్లిస్తున్నాడు.

ఇదిగాక, గొప్ప మాంద్య సమయంలో కలిగిన నష్టాలు తిరిగి కలుగకుండా ఉండుటకు బ్యాంకులలోను, సేవింగ్సు బ్యాంకులలోను, అన్ని సేవింగ్సులను, డిపాజిట్లను కలిపి 10,000 డాలర్ల వరకు నిర్బంధపు భీమా విధానమును ప్రభుత్వ మేర్పరిచింది. అందుచేత, సేవింగ్సు విధానం చాలా ప్రోత్సాహింప బడింది. దానిఫలితంగా 1933 లో మొత్తం 41 కోట్ల నుంచి, 1950 లో 175 కోట్లకు హెచ్చింది. (వీనిలో 1933 లో జరిగిన 14.6 కోట్ల డాలర్ల భీమా, 1950 లో జరిగిన 54 కోట్ల డాలర్ల భీమా సొమ్ము, 1933 లో అసలేలేని అమెరికా సేవింగ్సు బాండ్సు, 1950 లోని 49 కోట్ల బాండ్సు కలిసి ఉన్నాయి). ఆ విధంగా గత 17 సంవత్సరాలలో పనివారి భద్రతా దృక్పథం పూర్తిగా మారిపోయింది. నిరుద్యోగం, అపాయము, జబ్బు వలన అతడు ఆకలి బాధకు లోను కావలసినదనే భయం ఇంక పనివారి కుండకూడదు. అందరూ

అంగీకరించి నిర్ణయించిన మొత్తం నెలకు 100 డాలర్లుగాని, ఎక్కువగాని వచ్చే వృద్ధాప్యపు భత్యంతోనూ, అంతకు ముందే అతడు నిలవచేసుకున్న సొమ్ముతోనూ, అప్పుడతడు చేసుకునే తేలిక పనితోనూ, కొడుకుల సహాయంతోనూ అతడు తన మిగిలిన జీవితకాలమును సుఖంగా గడుపవచ్చు.

అమెరికాలో పనివారికి మిగిలిన తీవ్రమైన ఆఖరి కోర్కెయైన భద్రతారాహిత్య సమస్య క్రమంగా తీరిపోతోంది. దానితో, "వర్గవిభేదాలకు" మూలాధారాలలో ఆఖరిదికూడా మాయమైపోయింది. పెన్షను, భద్రతల కోసం జరిగిన సమ్మెలు, పూర్వపు రోజులలో యూనియన్లు హెచ్చు జీతాలకై జరిపిన సమ్మెల తీవ్రతకంటె, ఎక్కువ తీవ్రంగా జరుగుచుండుట లేదు. ఇక్కడకూడా పనివారి సదుపాయాలు ధనికుల కే విధంగాను నష్టకరం కాదు.

ఇదివరలో వేతనాలు హెచ్చుచేసిన సందర్భంలో తాము నాశనమై పోతామేమో అని భయపడినట్లుగానే, పారిశ్రామికులు, పనివారి సాంఘిక భద్రత, పెన్షను నిధులలో పెద్ద మొత్తాలను తాము భరించాలనే భయంతో ఉన్నారనే విషయం నేను నిరాకరించటంలేదు. మనం చూస్తున్నట్లు వారేమీ నష్టపడలేదు. దానికి బదులు వారి వ్యాపారం చాలా అభివృద్ధి పొందింది. ఈసారి వ్యాపారంలో వారికి అధికంగానే లాభాలు ఇమిడి ఉన్నాయి.

దీన్ని బట్టి నీవు ఉత్తరంలో సూచించిన మరొక విషయాన్ని గురించి చెప్పాలిసి ఉంది. అంత్యంలో ఒక పెద్ద పరిణామంతో

ధనిక పెట్టుబడిదారీ విధానమునే తుడిచి పెట్టుకు పోతుందని మార్క్సు చెప్పిన జోస్యమును స్ఫురింప చేస్తున్నావు. బ్రహ్మాండమైన మాంద్యావస్థలో ఈ జోస్యం తప్పక జరిగిందని మార్క్సిస్టులంతా అనుకున్నారు. అంతకంటె ఎక్కువగా అది తిరిగి సంభవించ గలదనికూడా వారు నిరీక్షించారు. మా యొక్క స్వదేశ విదేశ భద్రతలను భయపెడుతూ, సోవియట్ పరిపాలకులు రెండింతలుగా ఖాయం చేసుకోటానికై దానిని విషమస్థితికి తీసుకు పోవాలని ప్రయత్నిస్తున్నారు.

కాని, వీరి ఆశయం సరియైనది కాదని నాకు నమ్మకం కలిగింది.

ఒక్క విషయం ఏమిటంటే, 1929 సం॥ లోని పరిణామం విచిత్ర పరిస్థితులవలన కలిగింది. ఇది, జాతి సంతటినీ స్పెక్యులేషను వ్యాపారం అనే పిచ్చి జ్వరంలో ముంచి తేల్చిన బాధ్యతా రహితమైన అప్పు పద్ధతియొక్క ఫలితమే. ఈ అపాయం తిరిగి సంభవించదు. ఎందుచేత ననగా, దానికిగల కారణాలను తిరిగి వృద్ధిచెంద నివ్వరు. అమెరికా ప్రజల మెదడులలో నాటుకుపోయిన, గొప్ప మాంద్యతవలన కలిగిన భయ చిహ్నాలే రక్షణ కొక సాధనంగా పనిచేస్తోంది. వ్యాపార సంస్థలు, బ్యాంకులు, ఇతర ప్రజల దివాలాలద్వారా 20 సంవత్సరాలకు ముందు ఇ: చుమించు ప్రతి కుటుంబము, ప్రతి కార్పొరేషను, చాలా కులములు, ప్రభుత్వాలుకూడా దివాళా తీయుటయో, దాని దగ్గిర పరిస్థితికో వచ్చాయి. ఆ కారణంచేత ప్రతి అమెరికాపౌరుడు—అతని ఉద్యోగం,

హెూదా ఏమైనప్పటికీ—భద్రతయొక్క అవస్థాన్ని కష్టంతో గుర్తించాడు. ఈ ఉత్తేజం అంతా నిజంగా వర్గరహితమైనది. దూరదృష్టిగల ఆర్థికవేత్తలు పూర్వమే సిఫారసు చేసినప్పటికీ, మరొక విధంగా ఎప్పుడూ సాధించ శక్యంకాని చాలా అభివృద్ధులను అది సాధ్యం చేసింది.

అమెరికా ఆర్థిక సంస్థలు ఖర్చు చేయుట, అప్పు తెచ్చుట, నిలవ చేయుట మొదలైన పద్ధతులన్నీ అనేక మార్పులు చెందినవి. నిజం చెప్పాలంటే, ఐరోపావారి పొదుపు చేసే అలవాట్లను అమెరికా వారికా అసహ్యించుకుంటారు. వారు డబ్బు ఖర్చు చేయుటకు, క్రొత్త వస్త్రాలు కొనటానికి, క్రొత్త కట్టుసామగ్రిని. క్రొత్త కారు—పాతికారికా పనిచేస్తున్నా సరే—కొనటానికి ఏమీ జంకరు. దీనివలన వ్యాపారంలో ఉద్యోగాలు అభివృద్ధి చెందుతాయి. అయినప్పటికీ వారు జాగ్రత్తగా ఆలోచించి, నిర్లక్ష్యపు ఖర్చులను పరిమితం చేసుకున్నారు.

1929 సం॥ లో దేశపు రాబడి 85,10,00,00,000 డాలర్లు. కొనుగోలుదార్ల వద్ద నిఖరం అప్పు 7,62,80,00,000 డాలర్లు నిలవలో హెచ్చినది. 1,34,50,00,000 డాలర్లుమాత్రం. 1948 సం॥ లో దేశపు రాబడి 2,13,60,00,00,000 డాలర్లు,—1929 సం॥ కంటె రెండున్నర రెట్లు అధికం. కొనుగోలుదార్ల వద్ద నిఖరం అప్పు (15,89,20,00,000)—1929 సం॥ లోకంటె రెండు రెట్లుమాత్రమే అధికం. కాని, ఆ సంవత్సరంలో నిలవ

సొమ్ము హెచ్చినది 7,78,60,00,000–1929 లో కంటె ఇంచు మించుగా ఆరు రెట్లు అధికం.

మా పెద్ద కార్పొరేషన్లుకూడా చాలా జాగ్రత్త వహించాయి. ఆర్థిక రహితమైన కార్పొరేషనుల తాలుకు వ్యాపారంలోనున్న నిలువలు 1920 సం॥ లో కంటె నాలుగు రెట్లు అధికం.

ఈ మార్పులన్నీ కొంతవరకు పరిస్థితులనుబట్టి స్వబుద్ధి పూర్వకంగా తీసుకున్న జాగ్రత్తల ఫలితంగా వచ్చినవి. వీనిని ప్రోత్సహించుటకు ప్రభుత్వం చాలా సహాయ పడింది. యుద్ధ సమయంలో పనివారు మామూలుకంటె అధికంగా సంపాదించుటచేత, అమెరికా ప్రభుత్వ సేవింగ్సు బాండ్సుద్వారా అధిక భాగమును నిలవ చేయునట్లు ప్రభుత్వమే బలవంతం చేసింది. ఈ మంచి అలవాటును వారు యుద్ధానంతరంకూడా అవలంబించినందువల్ల ప్రత్యేక వ్యక్తులకు చెందిన సేవింగ్సు బాండ్సు మొత్తం 1940 సం॥ ఫిబ్రవరి 28 వ తేదీకి ఉన్న 43 కోట్ల డాలర్లు, 1950 నాటికి 49 కోట్ల డాలర్లకు పెరిగింది. అత్యధికం అప్పులను అరికట్టుటకు వాయిదా పద్ధతి అప్పుల విధానమును ప్రభుత్వం తన అధీనంలో ఉంచుకుంది. 1929 లో నూటికి 20 లేక 25 మాత్రమే తేడా ఆచారంగా ఉండగా, ఇప్పుడు సెక్యూరిటీలను కొనే వ్యక్తి మొత్తం ఖరీదులో 100కి 75 చెల్లించవలసి ఉంది.

ఈ మార్పులన్నీ గొప్ప మాంద్యపు కాలంలో జరిగిన విపులమైన మార్పులను ప్రతిఫలింప జేస్తున్నాయి. జాతీ

యార్థిక జీవితంలో ప్రభుత్వము ముఖ్యపాత్ర వహించుట అసందర్భమైనది అనే భావం కలిగించుట కవకాశం ఇవ్వగల మామూలు ఆచారమైన అసహాయతను ప్రదర్శించే పద్ధతిని వదలుకున్నారు. సోషలిస్టు లగుటయేగాక జాతీయార్థిక విపత్తులు తిరిగి తలయెత్తకుండా రక్షించాలనీ, ఆర్థిక రంగాలన్నింటికీ అధికమైన రక్షణ నేర్పాటు చేయాలనీ కంకణం కట్టుకున్న పౌరులు అధికారంలో ప్రవేశించారు. మొత్తం జాతియొక్క ఆలోచనలన్నీ మారిపోయాయి. వర్గాధిక్య తత్వం అధికంగా ఉన్న పెట్టుబడిదారులుకూడా పూర్వకాలపు ఆర్థిక స్వాతంత్ర్యం (చాలామంది అల్లకల్లోలం అన్నారు) కావాలని కోర లేదు.

ప్రభుత్వంలోను, బైట నున్న ఆర్థికవేత్తలు ఈ ఆర్థిక దుస్థితినిగూర్చి కూలంకషంగా విచారించి వాటిని అరికట్టుటకు తగిన విధానముల నేర్పాటు చేశారు. నిశ్చయంగా మేము ప్రజాస్వామ్యంలో నివశించుటచేతనే, సోషల్ ఇంజనీరింగులో క్రొత్త పద్ధతులను కనిపెట్టుటకు అవకాశం ఏర్పడింది. నిర్ణీతమైన ఒక గ్రుడ్డినమ్మకాన్ని అనుసరించే కార్మిక, కర్షక పరిపాలనలో సమస్తము కూడా తప్పులేనిదే అన్నట్లుగా నటించవలసి ఉంటుంది. కాని, అమెరికా ఉద్దేశ్యంలో ఎల్లప్పుడు ప్రయత్నిస్తూ, నేర్చుకోవలెననియే భావిస్తుంది.

అన్ని విధములైన బహిరంగపు పనులకు సంబంధించిన ప్రాజెక్టులన్నీ బకాయిలో ఉన్నాయి. విజయవంతంగా జరిగిన ఒకశాఖ ఏదంటే నదీ విధానములు, ఆనకట్టలు, ఎలక్ట్రికు

పవరు యంత్రాలు మాత్రమే. ఆర్థిక విధానమునుబట్టి ఉద్యోగా లందరికీ చూపించ లేని సమయంలో ఇటువంటి ప్లాను లను అమలులో పెట్టవచ్చు. అన్నిటికంటె ముఖ్యంగా వ్యక్తిగత భద్రతలను అభివృద్ధి చేయుటకు ఏర్పరచిన పద్ధతుల ద్వారా మొత్తం జాతీయార్థిక విధానమునకు కూడా గొప్ప భద్రత ఏర్పడింది. వివిధములైన మా భీమా నిధులలోను, పెన్షనుల నిధులలోను, సాంఘికభద్రతా నిధులలోను, సేవింగ్సు లెఖ్ఖల లోను ముందు ముందు ఉపయోగించునట్లు దాచు కున్న కొనుగోలు శక్తివలన అవసరమైన కష్ట సమయాలలో గట్టెక్కుట కుపయోగిస్తుంది. మామూలు మంచి రోజులలో అప్పు విధానములను, ఖరీదు పద్ధతులను అధికంచేసే ఆదాయం లోని హెచ్చు భాగమును నిలవచేసి, దానిని వ్యక్తిగత జాతీయావసర సమయాలలో ఉపయోగించుకొనుటకు అవ కాశం ఏర్పడింది. ముందు రాబోయే కష్ట సమయాలలో సహాయపడుటకై ఈ నిలవలు తప్పకుండా ఉపయోగిస్తాయి.

ఈ పోరాటంలో మేము అప్పుడే స్వానుభవం సంపా దించాం. యుద్ధం ముగిసిన తరువాత, హెచ్చుపరిస్థితి, స్వాధీనం తప్పిపోతుందనే భయం తోచగానే, వ్యాపారాభివృద్ధికి, వ్యక్తిగతమైన కొనుగోలు పనులకు కూడా అప్పులు తగ్గించుట ద్వారా ఆటంకా లేర్పరిచాం. తరువాత ఆర్థికవిధానము తగ్గుదల చూపుతున్న సమయంలో ఆటంకాలను తగ్గించి ఆర్థిక విధానమును ఉత్తేజ పరచేశాము. 1949 లోని తిరుగుడల సమయంలో చాలామంది ప్రజలు భయపడినప్పుడు ఇది జరుప

బడింది. అప్పు నిబంధనలను సడలించుటకు తోడుగా, నిరు ద్యోగం ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో బహిరంగపు పనుల నధికంగా సాగించునట్లు ప్రభుత్వ ఆజ్ఞల నిచ్చింది. ఆ విధంగా స్థానిక క్లిష్ట పరిస్థితుల నుంచి త్వరగా తప్పించుకుని, 1949 సం॥ వచ్చే సరికి మాంద్య పరిస్థితులు మాయమై పోయాయి.

ఆర్థికపు హెచ్చు తగ్గులను పూర్తిగా లేకుండా చేయాలని మా తలంపు గాదు. సంవత్సరంలో ఋతువున్నట్లుగానే, హెచ్చు తగ్గులు ఎప్పుడూ ఉంటాయి. ఆర్థిక పరిస్థితులలోని హెచ్చు, తగ్గుదల మార్పుల తీవ్రత తరుచు కలుగకుండునట్లు ఆయా పరిస్థితులకు ఒక స్థిరత్వం ఇచ్చి కట్టుదిట్టం చేయుటను గూర్చి మేము నేర్చుకుంటున్నాము. ఆర్థిక దుర్భర స్థితుల నుంచి మా ప్రజలను రక్షించాలని మేము దృఢనిశ్చయం చేసుకున్నాము.

ముందువచ్చే మాంద్య పరిస్థితులను ఎదుర్కొటానికి మేము ఏమి చేశామో నీ విప్పుడు చూడవచ్చు. 1929 లో ప్రారంభమైన మాంద్య పరిస్థితులు మార్క్సు సిద్ధాంతమును ఋజువు చేయుట కెందు కుపయోగించదో కూడా నీవు చూడ గలవు. కేవలం సిద్ధాంత రీత్యాకూడా, ఆర్థిక హెచ్చు తగ్గులలో నిదానము, తప్పింప సాధ్యంకాని హెచ్చుదలను గూర్చి ఆతని నిశ్చితాభిప్రాయాలు కూడా సరియైనవి కావని నా అభిప్రాయము.

ధనిక పెట్టుబడిదారులు అత్యాశాపరులు, హ్రస్వదృష్టి కలవారు అయివుండి తీరాలి కనుక, వారు పనివానియొక్క

కష్టఫలంలో అతనికి సరియైనభాగము నిచ్చుట కెల్లప్పుడు నిరాకరిస్తారనీ, పైగా వారు ఈ లక్ష్యాన్ని సాధించుకో గలిగినంత బలవంతులై ఉంటారనే భావాలతో మార్క్సు గ్రుడ్డిగా నమ్మివేశాడు. అందుచేత, సంతతాభివృద్ధిలోనున్న నిర్మాణమును, పనివా రుపయోగించగల శక్తిని పనివారెప్పుడు వృద్ధిచేసుకోలేరు. మార్కెట్లలో సరుకులు మితిమీరి హెచ్చినందువల్ల వ్యాపార మాంద్యత, పనివారికి గొప్ప కష్టనష్టాలు కలుగగలవని అప్పుడప్పుడు అతడు నిర్ణయించాడు. ఈ విధమైన హెచ్చుతగ్గులను తప్పించుకోవాలంటే కేంద్రీకరింపబడిన ప్రభుత్వ విధానమే శరణ్యమని అతనికి పూర్తిగా నమ్మకం కలిగింది.

రాజకీయార్థిక బేరాలలో అమెరికా పెట్టుబడిదారులు నేడు సంపూర్ణాధిక్యతి కలిగియుండ లేదని—ఒకప్పుడు వారది కలిగియుండుట కవకాశం ఉన్నప్పటికీ—అమెరికా పరిశ్రమలు నిర్మించిన సరుకులలో అత్యధిక భాగమును అమెరికా పనివారుపయోగించుకో గలిగియున్నారనీ నేను నీకు చూపించాను. ఈ విధంగా పనివారు ఎక్కువ కొనుగోలు శక్తి గలిగివున్నప్పటికీ, ఒకొక్కప్పుడు మేము వ్యాపార మాంద్యతలనుభవిస్తున్నామంటే. దానికి ఆర్థిక దుస్థితి పెట్టుబడిదారులకు లాభకరంగా ఉన్నదనే కారణం ఎంతమాత్రం కాదు. దానికి బదులు ఆర్థికమాంద్యత పనివారికెంత భయప్రదమో, పెట్టుబడి దారులకు అంతే భయప్రదమైనది. ఒక్క సంవత్సరంలో, ఘోరమైన మాంద్య పరిస్థితులలో 30,000 కంపెనీలు దివాళా

తీశాయనీ, అమెరికా కార్పొరేషనులలో నూటికి 766 కోట్ల డాలర్లు మొత్తం నష్ట పడ్డాయనీ మాత్రం మనం మరిచి పోకూడాదు. అందుచేత. మన పెట్టుబడిదారులు ఏ మాత్రం ముందు దృష్టి కలిగియున్నా, మాంద్య పరిస్థితి తిరిగి రాకుండా చేయుటకు సర్వప్రయత్నాలు చేస్తారు. దురదృష్టవశాత్తూ, వారి ఆర్థిక విధానం ఎట్లున్నప్పటికీ, మానవు లటువంటి దూరదృష్టినే సాధించలేక పోతున్నారు. మన పెట్టుబడి దారులు—లేక మా ప్లానింగు బోర్డులు—ఎంతకాలమైతే వాతావరణమును నిర్ణయించలేరో, ప్రపంచం అన్ని ప్రాంతాల లోనూ శాంతిని నెలకొల్పజాలరో, క్రొత్త పరిశోధనలను, నూతన సృష్టిని ఆటంకపరచ జాలరో అంతవరకు వారి ప్లానులు, జోస్యములు తిరుచు అపజయం పొందుతాయి.

ఈ సందర్భంలో మార్పును అనుమానించని వ్యతిరేక భావాన్ని మనం ఎదుర్కోవాలి. ఎందుకంటే, పశ్చిమవారి యొక్క ఉన్నత జీవిత ప్రమాణములు—రాజకీయాలలోను, పరిశ్రమలలోను, వారికిగల అధిక బేరసారముల శక్తితో సహా—ఆర్థిక హెచ్చు తగ్గులనుంచి తప్పించుకోటం కష్టతరం చేస్తాయి. దానికి కారణాలు గ్రహించటం అంత కష్టంకాదు. జీవితావసరములను స్వల్ప తేడాలలో ముందుగానే చెప్ప కలిగినప్పటికీ, కనీస జీవితావసరాలకు మించిన వాటిని గూర్చి ముఖ్యంగా విలాసములను, స్వల్ప విలాసములను, ముందుగా జోస్యం చెప్పట బహు కష్టమైనది. అవి అన్ని విధములైన ఆర్థిక, మానసిక తత్వ స్థితిగతులనుబట్టి అధికంగా మారు

[illegible]ంది. ఉదాహరణకి, సరుకు దొరకదేమో అనే భయంతో ఖరీదులు హెచ్చినట్లుగనే, ధరలు తగ్గుతాయనే పుకారుగాని, ఆశగాని బయలుదేరితే అమ్మకం తగ్గిపోతుంది. అందుచేత, పనివారు కేవలం జీవితావసరాలకంటె ఎంత అధికంగా వృద్ధిపొందితే, వాంఛలను ముందే గ్రహించి అధిక నిర్మాణమును నిరోధించుట అంత కష్టతరం అవుతుంది.

మా లేబరు యూనియను అధికంగా ఏర్పరుచు కొన గలుగుతున్న విధంగా, కఠినమైన దీర్ఘ కాలపు వేతనాల కంట్రాక్టులవలన వ్యాపార మాంద్యతను క్లిష్టతరం చెయ్యవచ్చు. అధిక సంఖ్యాకులైన పనివారు నిరుద్యోగులు కాక ముందుగానే కూలిపనులు, తద్వారా ధరలను సరితూగునట్లు చేయలేని చోటు స్వల్పమైన తగ్గుదలయే సంపూర్ణమైన మాంద్యంగా వృద్ధిపొందక తప్పదు.

అందుచేత, పనివారికి కేవలం జీవనాధారం కనీసమునకు తగ్గించుటద్వారా, వారు అమెరికాలో సంపాదించు దానిని నిరాకరించుటకు, తిరుగుదలను తగ్గించుటకు అవసరమని తోచిన విధంగా, వేతనాలలోను, గంటలలోను చేయబడే మార్పులను అంగీకరించునట్లు వారిని బలవంత పరచుటద్వారా మాత్రమే దేశంయొక్క ఆర్థిక విధానమును—ముందు రాబోవునది, సర్దుకోగల అవకాశం గలది, రెండు విధములైనది—నిర్ణయించుటకు ఉత్తమమైన మార్గమని తోస్తుంది. కాని, అటువంటి నివారణను అమెరికా పౌరు డెవ్వడూ ప్రతిపాదించదు. కాని, ఎంత ఖరీదైనా సరే భద్రతనే నీవు కోరినట్లయితే—భద్రతయే

గాని మరేమీ కాదు, దానిని సాధించుట కిదియే ఉత్తమ మార్గమని నా నమ్మకం. ఏమైనప్పటికీ—అది సోవియట్ పద్ధతి. ఎక్కువ ప్రచారం పొందిన ఒక యదార్థమును గూర్చి —అది నిజంగా యదార్థమైతే—వివరణ మిదిగో—"సోవియట్లకు నిరోద్యోగమే లేదు." అటువంటి "సుఖప్రదమైన" మాయ వెనుక ఏముంది ?

అప్పుడప్పుడు అధిక నిర్మాణమునకు బదులు—పెట్టుబడి దారీ పద్ధతియొక్క హీనమైన "తప్పు"—సోవియట్ ఆర్థిక విధానం అంతకంటె అథమాధమమైన పద్ధతి నవలంభించారు. అదే శాశ్వతమైన అల్ప నిర్మాణం. 1947 సం॥ నుంచి ఒక సంవత్సరంలోకూడా అనేకులైన కర్షక కార్మికుల యొక్క ప్రాథమికావశ్యకములను సమకూర్చుటలోనైనా సోవియట్ ప్రభుత్వం విజయవంతం కాలేకపోయింది. మాంద్య పరిస్థితులలోకూడా అమెరికా వారితో పోటీ చేయుటకు చాలినంత ఆహారము, దుస్తులు, ముఖ్యంగా నివాసగృహములు ఈ బీద ప్రజలకు లేకపోయాయి. దీనికి తోడు, సోవియట్ పత్రికల ప్రకారం నాణ్యంకంటె సరుకు మొత్తమునకే అధిక ప్రాధాన్యత నిచ్చారు. "ధనిక పెట్టుబడిదారుల స్వార్థ వ్యాపారం" లో బాధపడుతున్న పనివారికి సాధారణపు అవసరాలుగా ఉన్న ఎలక్ట్రికు దీపాలు, రేడియోలు, వాచీలు, కావలసినంత వెచ్చని నివాసము రష్యా కార్మికులకు విలాసవస్తువులుగా ఉన్నాయి. నిశ్చయంగా ఆ విధమైన స్వల్ప నిర్మాణం వలన వస్తువుల అవసరం శాశ్వతంగాను, భావికాలపు అవసరంగాను

కూడా ఉండగలదు. నిర్మింపబడిన ఏ వస్తువైనా సరే, ఖరీదు నాణ్యములతో సంబంధం లేకుండా, అతి కోర్కెతో అనుభవించేవారు.

రష్యాలోని ఆర్థిక సుస్థిరత్వానికి రెండవకారణంకూడా స్వతంత్ర ప్రజలకు రుచికరమైనది కాదు. ఏలననగా, సోవియట్ నాయకులకు పరిస్థితుల మార్పునుబట్టి వారి ఆర్థిక విధానమును సరిచేసుకొనుట ఒక సమస్యకాదు. సోవియట్ కార్మికులు, వారి అధికారుల ఆజ్ఞల సలహాల ప్రకారం వారి వేతనాలకు, పనిచేసే గంటలకు, పనిచేసే పరిస్థితులకు, నివాస, జీవిత విధానములకు కూడా సంతోషంగా అంగీకరించి అనుకరించ సిద్ధంగా ఉంటారు. ఏదో ఫలానా విధమైన వేతనాలు, లేక నిర్మాణం "కామ్రేడ్ స్టాలిన్‌కు సంతోషం కలిగిస్తుంది," అని ప్రభుత్వం తరఫు తాబేదారు ఎవరైనా చెప్పితే చాలు, వెంటనే ప్రతీవారు తామంతట తామే స్వయంగా "అధిక కాలం పనిచేసి, జీతం లేకపోయినాసరే, లేక అతని విశ్రాంతి గాని, వేతనాలుగాని, మాంస భోజనంగాని తగ్గించుకొనియైనా సరే ఆ పని పూర్తి చేస్తారు. ఇతర గత్యంతరం లేనిస కేంద్రంలో నరక జీవితమే అయినప్పుడు—స్వయంగా ఎవరు సిద్ధపడరు? ఔను, ప్రతీవారు రాత్రింబగళ్ళు పనిచేస్తారు—ఇతరుల దయా ధర్మాలతోనైనా సరే, ఉన్నతాధికార వర్గంలో ఒకడుగా స్థిరపడిన వాడైనాగాని, ఎవ్వరూకూడా స్వతంత్రుడు కాకపోవుట, మానవ ముఖ్యావసరాలకు కావలసినవి చాలినంతగా ఎప్పుడూ లభించక పోవుటచేతనే.

కాని, అటువంటి "భద్రత" ఎంతో అధికమైన విలువ నిచ్చి కొనుక్కున్నది కాదా? పూర్తి వేగంతో పనిచేసి నిర్మాణం సాగించి, అప్పుడప్పుడు అధిక నిర్మాణమును ఎదుర్కొనటమే మంచిదని నా నమ్మకం. లేకపోయినట్లైతే, మార్క్సు, లెనిన్ సాంఘికాభివృద్ధికి పునాది అని సరిగ్గా చెప్పిన "బ్రహ్మాండమైన నిర్మాణం" జరుగుట దుర్లభం. అమెరికా కార్మికులు ఇదే అభిప్రాయమును కలిగి యున్నారు. కొన్ని అనుమానాస్పద స్థితులను వారు భరించవలసి వచ్చి నప్పటికి, వారి జీవిత ప్రమాణములను అభివృద్ధి చేసుకొనుటకై నిర్మాణమును వృద్ధిచేసుకుంటూ పోవుటయే వారి యభిమతం.

అధికాదాయము, దానితోపాటు సంపూర్ణమైన భద్రతను అనుభవించుట సాధ్యపడదని మా కార్మికులు గ్రహించారు. కాని, ఆర్థిక ఒడుదుడుకులతోనైనా సరే వారికి సుఖప్రదమైన జీవితమే కావాలి. వారికి కావలసిన దేమంటే ఘోర ప్రమాదాలనుంచి రక్షణ మాత్రమే. అది వారిప్పటికే పూర్తిగా సాధించారు. రష్యా కార్మికుడు చెల్లించే మూల్యం, చెల్లించే "పూర్తిభద్రత" వారంగీకరించరు. అమెరికా, రష్యా దేశాల లోని జీవితపరిస్థితులను తెలుసుకున్న వారెవ్వరు వారితో వాదించరు.

# ఉత్పత్తి విధాన స్వాతంత్ర్యము

ప్రియమైన హెన్రీ!

ఇదివరలో మన వాగ్వాదాలలో నీవెంత వ్యతిరేకుడవై యుండేవాడవో, ఇప్పుడూ అంత వ్యతిరేకుడవుగానే ఉన్నావు. కాని, నీవొక ముఖ్యమైన విషయమును తెలియజేశావని మాత్రం నే నొప్పుకుంటాను.

నీ ఉద్దేశ్యంలో అమెరికా భాగ్యసంపద కంతకీ ఆ దేశపు ప్రకృతి సంపదలే కారణం అని అనుకుంటున్నావు కనుక, అమెరికాలోని అనుభవాన్నిబట్టి చేసే ఏ నిర్ణయాలనైనా అంగీకరించుటకు సందేహిస్తున్నానని నీవంటున్నావు. మాకు ఎంతో సారవంతమైన భూమి ఉంది. అన్ని విధములైన ఉత్తమ ఖనిజము లున్నాయి.

ధనిక పెట్టుబడిదారుల జేబులనుంచి కార్మికుల జేబుల లోనికి పొర్లిపోవుట తప్పని సరియైనంతగా ధనము ఈ ప్రకృతి సంపదనుంచి తనంత తానే ఉద్భవిస్తోందని నీవంటు న్నావు. మరొకచోట ఈవిధంగా జరిపించ వచ్చుననే నమ్మకం నీకు లేదు. ప్రకృతి సంపదలు తగ్గిపోగానే "పొర్లి పోత" ఆగి పోతుందని నీ వనుకుంటున్నావు.

ఔను హెన్రీ! నీ వాదన చాలా బలకరమైనది. ఐరోపా దేశాలకంటె మా ప్రకృతి సంపదలు అధికమే అన్న విషయం నేను నిరాకరించ లేను. అయినప్పటికీ, తగినంత ఆలో చించిన మీదట, అమెరికాయొక్క భాగ్య సంపదలు, ప్రజలలో సత్వరాభివృద్ధి పొందుతున్న సౌభాగ్యానికి, ప్రధాన

కారణం నేను పేర్కొన్నే "వర్గరహితమైన పెట్టుబడిదారీ విధానమే" అన్న అంతిమ నిశ్చయానికి వచ్చి తీరాలి.

మొట్ట మొదట మనం అమెరికాను ఇతర దేశాలతో పోల్చి చూద్దాం. ఉదాహరణకి, రష్యాలో కూడా అనేకమైన ప్రకృతి సంపద లున్నాయి. నా వ్యక్తిగతాభిప్రాయంలో దాని విధానం 90 పాళ్ళు నిరంకుశత్వము, జమీందారీ పద్ధతి అని మాత్రమేయైనా, కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం జారు ప్రభుత్వంలోని రష్యా ధనికుల పెట్టుబడిదారీ దేశమే. ఏమైనా కాని, రష్యాలో తప్పకుండా పెట్టుబడిదారు లున్నారు. అయితే, అమెరికా వారివలె వారు తమ ప్రకృతి సంపద నెందుకు వృద్ధిచేయలేదు? భాగ్య సంపదలన్నీ కొన్ని కొద్ది కుటుంబాలకు మాత్రమే ఎందుకు కట్టుబడి ఉన్నాయి? ధాన్యము, కలప, నూనె మొదలైన పదార్థములను ఇతర దేశాలకు ఎగుమతి చేశారు. కాని, ఒక చిన్న ఉన్నత వర్గం మాత్రమే భాగ్యవంతు లయ్యారు.

మార్క్సిస్టు స్నేహితులు "పెట్టుబడిదారీ దేశం" అని పిలిచే దేశాలలో—నేను అంగీకరించకపోయిన—మరొక ఉదాహరణ స్పెయిను దేశం. స్పెయిను కూడా చాలావరకు జమీందారీ దేశమే అని నా ఉద్దేశ్యం. శక్తి సంపదలో ఆ దేశానికి వ్యవసాయం, ఖనిజసంపదలు, మంచి వాతావరణము, పొడవైన సముద్రతీరములు ఉన్నాయి. ఆ శక్తి సంపదను భాగ్యసంపదలుగాను, అందరికీ ఉపయోగించు భాగ్యముగాను ఉపయోగించుకో లేకపోవుటకు కారణం నా దృష్టిలో ఏమిటంటే—

బహు స్వల్పమైన పెట్టుబడిదారీ విధానము, అత్యంతమైన కుల, వర్గ తత్వములే.

మా దేశంలో ప్రకృతి సంపదలేమీ లేకపోయి నట్లైతే —మనం అనుకుందాం—ఐస్‌లాండు, ఉత్తరపు స్కాండనేవియా వలె మా దేశం కూడా బీదప్రదేశం అయితే, మేము మరి కొంత మెల్లగా అభివృద్ధి పొందియుండే వాళ్ళము. విచిత్రమైన మా సాంఘిక విధానమే లేకపోయినట్లైతే మా ప్రకృతి సంపద లనేకం అభివృద్ధి పొందకుండా ఉండుటయే కాక, అదృశ్యంగానే ఉండి ఉండుననటంలో నా కేమీా సందేహం లేదు.

అమెరికా సంఘంలోని పూర్తి ప్రజాస్వామ్య పద్ధతిని, అథమస్థితిలో నున్న సగం జమీాందారీ కులమును, వర్గసంఘమును పోల్చి చూసినట్లైతే ఇది మనకు బాగా బోధపడు తుంది. ఈ సందర్భంలో విషయమును సుబోధకంగా చేయుటకు ఉద్దేశ్య పూర్వకంగానే ఉత్ప్రేక్షిస్తాను. ఇంతకీ యదార్థములన్నీ పూర్తిగా నలుపు—తెలుపు రంగులు కాదు. కాని, పలుచని గోధుమ రంగొకచోట—దళసరి గోధుమ రంగొకచోట—అయినా మొత్తంమీాద రెండు ఛాయలకు తేడా ఉంది.

కుల సంఘంగాని, లేక కులవర్గాలతో కూడిన సంఘం గాని తక్కువ వర్గాలవారి ప్రయత్నాలకు ఆటంకం కలిగిస్తాయి. పెద్ద ఆర్భాటపు వినోదాలతోను, శుద్ధదండుగైన విలాసముల తోను కాలక్షేపం చేసే ఉన్నత తరగతివారు చూపించే

అయిష్టతను గూర్చి నీకు నేను వర్ణించ నక్కరలేదు. పానీయములను త్రాగిన విలువైన గ్లాసులను, విలువైన అద్దాలపైకి విసరుతూ వినోదించే రష్యా, జర్మనీ ప్రభువులను జ్ఞాపకం తెచ్చుకో! యిరోపా, చైనాలలోని స్త్రీలు అతిబిగువైన దుస్తులను, పాదరక్షలను ధరించి, తమకు తామే దైహికంగా పనులు చేయుటకు నిరుపయోగులుగా తయారగుటను కూడ జ్ఞాపకం చేసుకో!

ప్రత్యేకాధికారాలు గల వర్గంవారు, పోలీసు సైన్యబలాల ఆధారమును చూసుకుని, అతి గర్వంతో విలాస వినోదాలలో మునిగి తేలుటవలన కార్మికులలో అపాయకరమైన అసూయ, అసహ్యము, కసి తీర్చుకోవాలనే కడుపుమంటను పెంపొందించు కొనుటయేకాక, నిర్మాణంలో వారికిగల స్వతస్సిద్ధమైన జ్ఞానము కూడ నాశనం చేసుకుంటారు. "వారికోసం మనం ఎందుకు పని చెయ్యాలి?" అనే స్వల్పమైన ప్రతిభావం బయలు దేరుతుంది. వెంటనే సహకరించి పనిచేసే కార్మికుల శక్తి శూన్యమైపోతుంది. పరిపాలనా వర్గమునకు మాత్రమే ప్రతిష్టను, లాభాలను ప్రత్యేకించుకునే అసమత్వ విధానంలో, శక్తివంచన లేకుండా పనిచేయుటకు సమర్థులు, శక్తిమంతులునైన వ్యక్తులు ఇష్టపడకపోవుట సహజమే.

కాని, ఈ కులతత్వ విధానము, జాతీయ నిర్మాణ ప్రతిభను తగ్గించే మరికొన్ని ప్రతిబంధకములను తయారు చేస్తుంది. అటువంటి విధానంలో ఉన్నత వర్గాలలోనివారి అంతరాత్మనుబట్టి, తమ ప్రత్యేక స్థానమును సమర్థించుకోవాలనే

బలవంతం ఏర్పడుతుంది. ఉన్నత పదవులకు, ప్రభుత్వోద్యోగాలకు, పెద్ద వ్యాపారములకు ఉత్తమ తరగతుల వారిని అనర్హులుగా చేయుటకు తగిన కారణములను కనిపెట్టాలి. ఆ విధంగా, కొన్ని అనుభవాలనుబట్టి సామాన్యంగా చెప్పాలంటే, ప్రత్యేక వర్గ తత్వాన్ని సమర్థించేవారు "సామాన్య మానవుని" గుణములను నిరసిస్తారు. అతని తెలివిని, నిజాయితీని, నడతను, ధైర్యమును వారు సందేహిస్తారు, స్వభావ సిద్ధంగా, అతడు తన పనిలో అసంతృప్తిని, నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తాడు.

ఎన్నడో పూర్వకాలమే నిర్ణయింపబడి, దేవుని ఆజ్ఞగా చెల్లుబడి అవుతున్న కుల, వర్గ విభేదాల కారణంగా, పైనుంచి వచ్చిన ఒక విధమైన అసూయకే మానవత్వం కూర్చబడుతూ వచ్చింది. సామాన్య ప్రజలు విలాస వినోదాల ననుభవించుట "న్యాయము" కాదనే భావమే అని నా తాత్పర్యం. 17 వ శతాబ్దంవరకు చాలా దేశాలలో, అమెరికా కాలనీల సహితంగా వివిధ హోదాలలోగల వ్యక్తులుపయోగింపవలసిన బంగారము, వెండి, మేలైన బట్టలు, దుస్తులు, భోజనము కూడా, "సంప్చ్యులరీ" చట్టం ప్రకారం నిర్ణయింపబడి ఉండేవి. ఉదాహరణకి, 1433 సం॥ లో స్కాట్లండు పార్లమెంటు చట్టం ప్రకారం, బారన్ హోదాకు తక్కువైన ప్రజలు నివసించవలసిన విధానమును సూచిస్తూ, ఇతర వస్తువులతోపాటు (పీస్) పండ్లను, ఉడికిన మాంసమును ఉపయోగించకూడదని నిషేధించింది. 1752 వ సం॥లో

కూడా "ముక్కుపొడి, టీ, రిబ్బన్లపైన పనివారికుండే కోర్కెకు నిర్భ్రాంతపడి" సంప్ర్యులరీ శాసనములను తిరిగి ప్రవేశ పెట్టాలని ప్రతిపాదించాడు.*

ఈ భావములన్నింటికీ గల కారణములు నసించిన చాలాకాలం వరకుకూడా ఆ భావములు మాత్రం నిలిచి ఉంటాయి. ముఖ్యంగా వారి అపనమ్మకపు దృక్పథమును విడనాడకుండుటచేత, ఈ కాలపు ఐరోపాలోకూడా చాలా మంది కార్మికులు నిర్మాణమును తగ్గించి, కాయకష్టం తగ్గించే పద్ధతులను ఎదిరిస్తున్నారు.

అయినప్పటికీ, ఇక్కడ నాశన కార్యక్రమానికి గల కారణం ధనిక పెట్టుబడిదారీ విధానంకాదు. కాని, ఇప్పటికీ నిలిచివున్న జమీందారీ విధానపు కులతత్వ భావములే కారణం. పైనుంచి వచ్చినచో దాని నా విధంగా పిలవక పోయినా, అది ముఖ్యంగా ఒక విధమైన వర్గ పోరాటమే.

మార్క్సు బోధించిన సామాన్య ప్రజావర్గ పోరాటం కూడా ఈ ఫలితాలనే కలిగిస్తుంది. ఇదికూడా శాంతి, సుహృద్భావ, పరస్పర సహకారము లత్యావసరమయినప్పటికీ, అసూయను, అసహ్యమును పెంపొందిస్తుంది. ఈ వర్గములలో నిర్మాణ శక్తులను నాశనం చేయగల నిరాశ, కర్మసూత్ర మనే నిస్పృహాభావాలను ఇదికూడా కలిగిస్తుంది. పెట్టుబడి దారులయొక్క, కార్మికులయొక్క శక్తి సామర్థ్యాలను, భాగ్యాభివృద్ధి కుపయోగించటంకంటె, వారివారి వర్గ సంరక్షు

* ఆర్. హెచ్. టానీ వ్రాసిన 'మతము, ధనిక పెట్టుబడిదారీ విధానాభివృద్ధి' నుంచి.

ణార్థము పంపకంలో అధికంగా ఉపయోగించునట్లు ఇది కూడా చేస్తుంది. ఒక్కొక్కప్పుడది జాతీయార్థిక వ్యవస్థనే తారుమారు చేస్తుంది. ఈ వర్గపోరాటం, ఉన్నత వర్గానికైనా, అథమ వర్గానికైనా సర్వదా వారివారి క్షేమ సంపదలకే భంగ కరమౌతుంది.

సామాన్యంగా ఐరోపాలో కంటె, అమెరికాలోని వర్గ రహిత పెట్టుబడిదారీ విధానం వైపుగల పురోగమన కారణంగా, పనివానికి అతడు పనిచేసే వ్యాపారంలో ఎక్కువ అనుకూల భక్తి శ్రద్ధ లుంటాయి. పనివాడు, తాను యజమానితో సమానుడనే భావం ఎంతగా వృద్ధిచేసుకుంటాడో, అంత శ్రద్ధగా అతడు తన పనిలో బుద్ధిని, మనస్సును ఉపయోగించి పనిచేస్తాడు. ఈ దృక్పథమే పనివాడు నిర్మాణ కార్యక్రమంలో తనవంతు బాధ్యతను నిర్వహించునట్లు చేస్తోంది.

ప్రత్యేక వ్యక్తి యాజమాన్యంలో, "పనివాడు తనపనిలో తగుశ్రద్ధ తీసుకోజాలడు" అనే స్వయంనిర్ణయమే మార్క్సిస్టులు చేసిన గొప్ప ప్రమాదకరమైన మానసిక పొరపాట్లలో ఒకటి. అసలు నిజస్థితి చూస్తే, ప్రత్యేక యాజమాన్యమే ప్రోత్సాహ శక్తి అనేది నిరాకరించుటకశక్యమైన సత్యము. కాని, సాంఘిక జాతీయ స్థాయిలలో గల యాజమాన్యం ఒక భూతంగా పరిణమించి ఎవ్వరికీ ప్రోత్సాహకరంగా ఉండదు.

ఆధునిక పెట్టుబడిదారీ విధానంలో నిజంగా గొప్ప బాధ్యతలను నిర్వహించేవారు, స్వయంశక్తి ప్రాముఖ్యంతో

పని చేసేవారు, ఏ విధమైన సొంతదారు అధికారం వహించరు. "సొంతదారు" స్వభావంకంటె "యాజమాన్య" స్వభావమే ప్రాముఖ్యం వహించేది. యజమానులీ స్వభావం కలిగి యుండటంలో ఏ విధమైన నిర్బంధములు లేవు. మా యొక్క ఆర్థిక విధానం, బుద్ధిబలంలేని పనిముట్టువంటి ఉద్యోగికి బదులుగా, సహకారమిచ్చే సహాయకుణ్ని నియమించుటకు శ్రద్ధ వహిస్తుంది.

పనివాడు స్వయంగా పనిచేసే వ్యాపారంలో అతడు ఉత్సాహమును, బాధ్యతను వహించునట్లుగా అతన్ని ఉత్తేజ పరుపవలసిన ఆవశ్యకత విషయంలో మా "పెట్టుబడిదారులు" పనివాళ్ళు కూడా పూర్తిగా ఏకీభావంతో ఉన్నారు. ఉదాహరణగా, అమెరికా కార్మిక ఫెడరేషనువారు, ఒకప్పుడు 'ఫెడరేషనిస్టు' అనే వారి ప్రచురణలో ఇలా ప్రకటించారు: "ఒక్కొక్క పనివాడు స్వభావ సిద్ధంగాను, అనాలోచితంగాను పని చేయుచుండవచ్చు లేదా, ఒక్కొక్కడు అభ్యుదయాన్ని తప్పకుండా సాధించగల స్వయం కల్పనాశక్తి స్వభావం కలిగి, అభివృద్ధిని జాగ్రత్తగా పరిశీలిస్తూ, యంత్రములను, వస్తువులను అప్రమత్తుడై శ్రద్ధతో ఉపయోగించవచ్చు. కాని, ఈ ఉత్తమ రకమైన పనితమును చూపించుటకు ఇద్దరి యొక్క సమన్వయము కావాలి."

పనివారు ఉద్యోగులిచ్చే ఉపయుక్తమైన సలహాలకు పారితోషికముల ద్వారా, కొన్ని సంవత్సరాల క్రిందటనే ప్రారంభించబడిన లాభాలలో భాగమునిచ్చే విధానము

ద్వారా, పెద్ద వ్యాపారసంస్థ లనేకం ఈ స్వభావమును ప్రోత్స హిస్తున్నారు. ఒక మానవునకు చూపించే గౌరవము, మానవుని స్వేచ్ఛా స్వాతంత్ర్యములకు అనుశ్రుతమైన విలువ, హోదాలకు గల ఆమోదములు అతి ముఖ్యమైనవి. ఇది కాక కుల వర్గ తత్వము, అందరి ఉద్యోగులలోను యాజమాన్యపు భావాలను నాశనం చెయ్యాలి. ఒక యజమాని తాను "ఉన్నత కుటుంబీకుడు" గదా అని, తానున్నత మానవుడనని భావించు కున్నట్లయితే, తన వ్యక్తిగత సహాయకులతో సహా, క్రింది తరగతి ప్రజల విమర్శనుగాని, సలహాను గాని నిరాకరించాలనే భావం అతి సులువుగా కలుగుతుంది. చాలా ఐరోపా కంపెనీలలో, ఒక ఉద్యోగి, లేక క్రింది అధికారి యైనప్పటికీ, ఉన్నతాధికారితో విస్పష్టంగా మాట్లాడుటకు సాహసించలేడు. తన సొంత అభిప్రాయాలను గూర్చి అతడు తరుచు వాదించలేడు. ఇతర దేశాలలో ప్రయాణంచేసే అమెరికావారికి ఒకొక్కప్పు డీ స్వభావం చాలా ఆశ్చర్యం కలిగిస్తుంది. సమానత్వ వాతావరణంలో ఒకరి కొకరు పరస్పరాభిప్రాయ సంప్రదింపులే తమ విజయానికి కారణం అని వారికి తెలును.

అన్ని తరహాలలోను, "యజమాన్యపు" సుగుణములు, బహిరంగాధికారముద్వారా కాక, కుల వర్గ తత్వ నిర్మూలనముద్వారానే రాణించుచున్నవని మనం గ్రహించగలము.

# బలవత్తరాత్మ శక్తి

ప్రియమైన హెన్రీ!

సత్యమైన స్వాతంత్ర్య ప్రజాస్వామ్య సంఘముచేత ప్రోత్సహింపబడిన ఉత్పత్తి శక్తులను గూర్చి మన వాదమును సాగించుటకు, ముందు మనం అనుకూల భావాలను గూర్చి ఆలోచిద్దాం. ఎందుచేతనంటే, కేవలం దురభిప్రాయమును, అసహ్యమును, అసూయను, అహంభావమును పోగొట్టుట మాత్రం సరిపోదు. అది మోటారుకారు ఆక్సిలరేటరు మీద కాలు పెట్టకుండా, బ్రేకులను విడిచి పెట్టుట వంటిది. అయితే, మన ఆర్థిక వ్యవస్థాయంత్రమును నిజమైన వేగవంతంగా పరుగెత్తించుట ఎట్లు? అమెరికా పారిశ్రామిక వ్యవస్థ, తన ప్రతిభావంతమైన విజయసాధనల కే విధంగా ఏర్పాట్లు చేస్తోంది?

ఔను—ఒక్క మాట చెప్పాలంటే—అది బుద్ధిబలంచేత. భుజబలంకంటె బుద్ధి బలమే అత్యధిక నిర్మాణ శక్తి గలది అని నిరూపించుటకు మహత్తర వేదాంత భాష్యాలను చెప్ప నవసరం లేదనుకుంటాను. "వ్యక్తియొక్క సర్వ విద్యాభివృద్ధితో పాటు నిర్మాణ శక్తులుకూడా పరిపక్వం పొందుతాయి. సాంఘీక సంపచ్ఛక్తులన్నీ సంతతధారా వృష్టిగా కురుస్తాయి," అని మార్క్సు నమ్మెటకు వీలగునట్లుగా వక్కాణించాడు. ఆ స్థితిలో "బుద్ధి శక్తికి, భుజశక్తికి గల పోటీ అంతరించి పోతుంది." అమెరికాలో జరుగుతున్నదాని కిప్పుడిది చక్కని వర్ణన. నిర్మాణ విధానంలో బుద్ధిబలం చాలదనే భావం తప్ప, లెనినుకూడా మార్క్సు విధానమునే అనుసరించాడు.

"వ్యాపారపు లెక్కల సంరక్షణ, అధికారము, కమ్యూనిస్టు సాంఘికవ్యవస్థ సరియైన సాఫీ మార్గంలో నడచుటకు ముఖ్యావసరములుగా" అతడు భావించాడు. "గణితంలోని ప్రాథమిక సూత్రాలు నాలుగు తెలుసుకుని, చదువుట, వ్రాయుట నేర్చిన ప్రతివారికి కూడ కనిపెట్టుట, గ్రంథ రూపంలో వ్రాయుట, రసీదులనిచ్చుట మొదలైన పనులన్నీ అతి సుల భాతిసులభంగా తయారైనంతవరకు, "సూక్ష్మంగా" తయారు చేసినందుకై అతడు పెట్టుబడిదారీ విధానమును ప్రశం సించాడు.

లెనిను వంటి సూక్ష్మగ్రాహి వ్యాపారపు లెక్కల సంరక్షణ, అధికారములను, వ్యాపార యాజమాన్యమునకు కేవలం ముఖ్యాంగాలుగా అపార్థం చేసుకొనుట, అన్ని తరహాలలోను ప్రారంభోత్సాహము, జ్ఞానశక్తి, పరిశోధనా శక్తులకు గల ప్రాముఖ్యతను గ్రహించ లేకపోవుట మహా శ్చర్యంగా ఉంది.

ఆధునిక పారిశ్రామిక వ్యవస్థ వృద్ధిపొందటానికి సహాయ పడిన లక్షలాది భావాలు, పరిశోధనల కారణంగా, అమితమైన కాయకష్టం అనవసరంగా చేయబడింది. కాయకష్టము సధి కంగా తగ్గించి, పనివాడు హాయిగా ఒకచోట కూర్చొని తన పనిని సులువుగా చేసుకొనునట్లు, అతనికి కావలసిన పదార్థాలు సులభంగా అతని వద్దకే వచ్చునట్లు ఏర్పాటయింది. కాని. ఇదివరలో అతడు నిల్చుని, అటునిటు తిరుగుతూ శ్రమ పడవలసి ఉండేది. చిత్రించుటకు బదులు చిమ్మనయంత్రంతో

రంగు పూయుట ; చేతితో కోయుటకు బదులుగా యంత్ర సహాయంతో కోయుట ; కమ్మర కొలిమితో పనిచేయుటకు బదులు యంత్ర సహాయంతో సులభంగా పోతపోయుట ; సుత్తితో అతుకుటకు బదులు యంత్రంతోనే లోహభాగము లను కరిగి అతుకుట మొదలైన పను లనేకం చేయుటకు క్రొత్త పద్ధతులు వచ్చాయి. ప్రతిదినము క్రొత్తక్రొత్త విధానములు, ఉపాయములు కనిపెట్టి, కాయకష్టంతో చేసేపనుల నన్నింటిని ఆవిరి, విద్యుచ్ఛక్తి, నూనె మొదలైన సాధనా లుపయోగించి సులభంగా చెయించుటవలన, కాయకష్టమును పూర్తిగా తగ్గించుటయేకాక, మానవ శ్రమకూడ తగ్గించబడింది.

ఈ విధమైన నూతనాభివృద్ధికి సరియైన దృష్టాంతం కావాలంటే అమెరికాలో రోడ్లు వేయుట పరిశీలించాలి. ఐరోపాలో ఇప్పటికీ రోడ్ల నిర్మాణంలో అనేక వేలమంది మనుష్యులు చెమటలూడ్చి, కాయకష్టం చేయుటవల్లనే అధిక భాగపు పని జరుగుతోంది. కాని, ఇక్కడ కొద్దిమంది మనుష్యులు, ఘనమైన యంత్రాలు పనిని చేస్తాయి. ఇక్కడ ఇంత యంత్రమున నడిపించుతూ పనిచేయించ గలవాడే ఐరోపాలో బహుశః పార గునపాల నుపయోగించి పనిచేస్తుంటాడు. మానవ బుద్ధి శక్తి సామర్థ్యాలతో నిర్మించబడిన పనిముట్లకు, పదిమంది ఒక వారం రోజులలో చేయగల పనిని ఒక్క రోజులో చేయ గలుగునట్లు తయారు చేసిన విద్యకు ప్రత్యేకపు తరిఫీదుకు కృతజ్ఞతాభివందనములు. అతడు ఉత్తమ

మైన, తృప్తికరమైన పనిని చేసి అనేకరెట్లు ఎక్కువ డబ్బు సంపాదించగలడు. ఆతని వెనుక, సహజంగా, అంతకంటె "ఉన్నతమైన పనులు" చేసే పనివారున్నారు. అతని పని కంతకు అవసరమైన పథకాలను తయారు చేసే ఇంజనీర్లు; యంత్రాలను కనిపెట్టి వాటి చిత్రాలు వేసే ఇంజనీర్లు; వాటిని తయారు చేయుటలో ప్రత్యేక నిపుణులైన ఇతర పనివారు అనేకు లున్నారు. వారంతా ఇదివరలో లేరు; ఇంకా అనేక దేశాలలో ఇప్పటికీ అటువంటివారు లేరు.

అయితే, ఇప్పుడు సరియైన పనికి తగిన మనిషిని ఎన్నుకొనుటయే మొట్టమొదటి పని. "ఉన్నత వర్గాల వారికి" ఉత్తమ పనులను ప్రత్యేకించుటవలన సంఘంలోని మానవ శక్తులన్నీ ఏవిధంగా నిరుపయోగమైపోతాయో, అతిముఖ్యమైన హోదాలలో కేవలం అలంకార విగ్రహాలను ఏ విధంగా నియమించవలసి వస్తుందో నే నిదివరకే తెలియజేశాను. ఏ పనికైనా ఉత్తమ శక్తి సామర్థ్యాలను రాబట్టుకొనుటకు వర్గ నిర్బంధాలను తొలగించుటే గొప్ప పురోగమన సాధనము.

అయినా, అన్ని శక్తులను, అన్ని ఉపాయములను ఉపయోగించుట మాత్రం సరిపోదు. ఒక నూతన తత్వం కూడా అవసరం—పరిశోధనా ప్రయత్నాలలో నిరంతరోత్సాహము, ధైర్యంతో, నియమనిర్బంధ రహితమైన ప్రయత్నం మన ఇంజనీర్లకే కాదు, మన యజమానులు, పాలకులు, విద్యావేత్తలు, ఇతర వృత్తుల వారందరికీ, మన ఉద్యోగులకు, పనివారికి కూడా అది అవసరమే. వర్గతత్వ నిర్బంధాలను వది

లించుకుని, ప్రజల యాత్మశక్తి సంపదలపై నమ్మకం కలిగించే సంఘానికి సహజ వస్తువు.

డి టొకువెల్లి అనే అతడు దానితో ముగ్ధుడై యిలా వ్రాశాడు: "ధనిక ప్రభువులైన ప్రజలు ముందుగానే మానవ జాతికి అధిగమింప శక్యంలేని హద్దులు ఏర్పాటు చేశారు... ఆ తరహా గొప్పతనము, జ్ఞానము ఇంచుమించుగా వారిదివరకే కలిగివున్నారనే అహంభావము కలిగివుంటారు. దానిని అసంపూర్ణమైన మన ప్రకృతి అనుమతిస్తుంది. వారి చుట్టుప్రక్కల సర్వము నిశ్చలంగా ఉండుటచేత, సర్వము యథాస్థానంలో ఉన్నదని సంతోషించుటకు వారు సమ్మతిస్తారు.

కులాలు క్రమంగా మాయమైన కొలదీ లక్ష్యప్రదమైన సర్వజ్ఞత్వపు ఛాయ, ఎప్పుడూ ఎగురుతూ మానవ మనస్సులో గోచరిస్తుంది. అప్పుడది ప్రతిమానవుని పరిశీలనలో ఎల్లప్పుడు అనేక మార్పులు పొందుతూంటుంది. అభ్యుదయకరమైన అనంతశక్తి మానవునకు ప్రసాదించ బడినదని అప్పుడతడు నిర్ధారణ చేస్తాడు. ఈ విషయాన్ని చిత్రించటానికి; "అమెరికా ఓడలు కొద్దికాలము మాత్రం పనిచేయునట్లుగానే ఎందుకు నిర్మిస్తారు?" అనే ప్రశ్నకు సమాధానంగా, ఒక అమెరికా నావికుడు "కొద్ది సంవత్సరాలకంటె అధికంగా పని చేసినట్లయితే ఎంతో మంచి ఓడకూడా నిరుపయోగం కాగలదేమో అన్నంతగా, అమెరికా నౌకాయానము ప్రతి దినము అతివేగంతో అభివృద్ధి చెందుతోంది" అని నిస్సం

క్షోచంగా ఏ విధంగా సమాధానం ఇచ్చాడో డి టొకువెల్లి చెపుతున్నాడు.

"పరిపాలక ప్రభువుల జాతులలో మానవ విజ్ఞాన వికాసమునకు గల అవకాశములను తగ్గించే స్వభావం, ప్రజా స్వామ్య జాతులలో హద్దుమీరి దానిని అభివృద్ధి చేసే స్వభావం సహజంగానే ఉన్నాయి.

కాలక్రమంలో అన్ని రంగాలలోను నీతి సిద్ధాంతాలలో, ప్రాపంచిక విషయాలలోకంటె తగ్గకుండా అధికమైన అభ్యుదయాలను సాధించాలనే నమ్మకమే. అమెరికాలోని సాంకేతిక సాంఘిక సంఘాభివృద్ధి రహస్యాలలో ఒకటి. నే నదివరలోనే చర్చించిన అనంతమైన ఆశాభావ తత్వ మూలసూత్రాలలో ఒకటి.

ప్రజలు ఎల్లప్పుడు నూతన భావాలలో ఉంటారు. విజయ వంతులైన ఉత్సాహ వంతులతో దేశం నిండి ఉంది; క్రొత్తగా ప్రవేశించిన రంగాలలోనైనా అతడు విజయవంతుడగుట అసాధారణం కాదు. అంటే, చాలా అపజయాలుకూడా ఉంటాయనే దీని భావం. కాని, ఒకడు తనపనిలో అపజయం పొందినా, లేక దివాలా తీసినా అంతటితో ఆతని పని అంత మైనదని దాని అర్థంకాదు. అతడు పడిపోయాడు. సరే—కాను, అతన్ని మళ్ళీ ప్రయత్నం చెయ్యనీ, తరువాత ప్రయత్నంలో బహుశః అతడు జయించగలడేమో!

ఈ తత్వాన్ని అర్థం చేసుకోటానికి ఎవరైనా కొన్నాళ్లు అమెరికాలో నివసించాలి. అసలు అది ఐరోపావారిలోకూడా

ఉంది. కాని, ఐరోపాలో తరచుగా అది అనుశ్రుతపు టాచార, అధికార ఛాయలలో కప్పు పడిపోతుంది. పురాత నాచా రాల ప్రకారంగా ఉద్భవించి అనుభవిస్తున్న కులతత్వం, విద్యా, రాజకయ సంస్థలలోనే కాక సాంకేతిక రంగాలలోకూడా పరిశోధనలను, పురోభివృద్ధిని ప్రోత్సహించదు. అది మంచి ఉద్దేశ్యంతోనే జరుగుతోంది. క్రొత్త పరిశోధనల కారణంగా, తరుచు, పాడుపడిన భాగ్యాలకు నష్టం కలుగుతోంది. ఉదాహరణకి—ఓడలు, రైళ్ళు, క్రొత్త వ్యవసాయపు పనిముట్లు కారణంగా, అనేకమైన పెద్ద ఇనాములు ఇంచు మించు విలువ లేకుండా పోయాయి. ప్రత్యేకత, స్వభావ సిద్ధంగానే, ఒకని చర్యలను నియమబద్ధం చేయుటకై అధికార రక్షణకు ప్రేరేపిస్తుంది. ఆలోచన పథకాలు వేయుట, ఇంజనీరింగు, మొదలైన అన్ని రంగాలలోని మానవశక్తులలోను అది నిర్బంధాల నేర్పరచుతుంది. భాగ్యమును అభివృద్ధిచేసే అన్ని మానవ ప్రయత్నాలకు అది ఆటంకంగా పనిచేస్తుంది.

ఆధునిక యుగంలో ఈ ప్రత్యేకతకు సమానమైనదేది ? సరిగా చెప్పాలంటే—దాని వంశ పరంపరలోనిదే—సర్వాధికారం. అదికూడా "అవాంఛితాలను" తరమగలదు. నిర్మాణమును నిర్ణీతంచేసి, అభ్యుదయమును వెనుకకు తోస్తుంది. అది పనిచేసే ఫ్యాక్టరీలను నిరుపయోగం చేస్తుంది. క్రొత్త పరిశోధనలను సంకుచితం చేస్తుంది. కాని, సోవియట్ ప్రజలు ప్రేమతో పిలిచే "సర్వాధికార పెట్టుబడిదారీ విధానం" అనే మాటలోనే స్వవచన వ్యాఘాతం ఉంది. పురాతన కులాలు,

సంఘాలు విధానాలను, తత్వాన్ని అనుసరిస్తున్న "పెట్టుబడి దారీ విధానమునే" అది తెలియజేస్తుంది. అందుచేతనే, అందరి కంటె అధిక "పెట్టుబడిదారీ" దేశమైన అమెరికా సర్వాధి కారాలను అరికట్టుటకు పెద్ద ప్రయత్నాలన్నీ ప్రమాద జనితం కాదు. ఇక్కడ పెద్ద ధర్మసంస్థ లన్నింటిని విచ్ఛేదం చేశారు. లేదా, వాటిని ప్రజాధికారంలో ఉంచారు. నీ వెక్కడైనా సర్వాధికారమును కనిపెట్టినట్టు భావిస్తే-వివిధ రకాల వస్తువుల మధ్య నీవు పోటీలు చూడగలవు.

సర్వాధికార విధానములలో ఉన్న అపాయమును అమెరికనులు నిశితంగా గ్రహించారు. అది ప్రజాస్వామిక స్వాతంత్ర్యానికే కాకుండా, ఆర్థిక వ్యవస్థకు, పెట్టుబడి దారీ విధానమునకు అపాయకరమే అని వారికి తెలుసు. ఈ భావం వారి మనస్సులో నాటుకుపోయింది. సర్వాధికార మునుగాని, పరస్పర ఒడంబడికలనుగాని అమెరికావారు చట్ట విరుద్ధంగాను, నీతి బాహ్యమైనదిగాను భావిస్తారు. ఇతర ఐరోపా వారనేకులవలె, నే నిచ్చటికి రాకముందు నేను గ్రహించలేని యదార్థములలో ఇది ఒకటి.

కులము, ప్రత్యేకత, సర్వాధికార విధానములు పశ్చిమ ఐరోపాకు మాత్రమే అంటిపెట్టుకుని యుండలేదు. ప్రపంచం అంతటిలోని సర్వాధికార విధానము లన్నింటినీ తలదన్నే సోవియట్ రష్యాలో కూడా కులతత్వాన్ని క్రొత్త స్వరూ వంలో నీవు చూడగలవు. అతడింకా ప్రముఖ కమ్యూనిస్టుగా ఉండగా, మాస్కోలో చేసిన "అపజయం పొందిన భగ

వంతుడు" అనే ప్రసంగంలో ఇగ్నాజియో సైలోన్ ఈ విధంగా తెలియజేశాడు :

"ఒక రోజున ప్రభుత్వ ప్రచురణశాఖ డైరక్టర్లలో ఒకామెకు సోవియట్ రచయితలు నివసించిన, భయంకర, నిరుత్సాహ వాతావరణం గూర్చి ఆమె అధమం ఎందుకు సిగ్గుపడవలసి ఉందో తెలియజేస్తూ నేను గంటలు గడిపాను. నేను చెప్పుటకు ప్రయత్నించిన దేమిటో ఆమె కర్థంకాలేదు. 'స్వేచ్ఛ'-అంటే అనుమానించుటకు, వెదకి ప్రయత్నించుటకు, ఏ ఆజ్ఞకైనా 'లేదు' అని చెప్పుటకు అవకాశాలు," అని నే నుదాహరించవలసి వచ్చింది.

"అయితే అది...అది విప్లవ వ్యతిరేకం...మీా స్వేచ్ఛ మాకు లేనందుకు మేము చాలా సంతోషిస్తున్నాము" అని ఈ ఘోర సోవియటు విజ్ఞానంలో ప్రముఖపాత్ర వహిస్తున్న యామె నసిగింది.

ఎక్కడైతే స్వేచ్ఛ ఖూనీ చేయబడుతుందో, అక్కడ అభ్యుదయ నిర్మాణతత్వం హరించిపోవుట నీవు చూడగలవు. "మన ఆధునిక సాంఘికోత్సాహమును త్వరలో నాశనం చేయగల 'అవసర సూత్రమును' ప్రకటించి నందుకు ఐరోపా విజ్ఞానులను డి టాకువెల్లి విమర్శించాడు. "సంపూర్ణంగా నిస్సహాయతను ప్రకటించకుండా, మానవ శక్తులను ఉన్నత స్థాయికి తెచ్చుటయే మా కాలంలోని గొప్ప లక్ష్యం," అని అత డన్నాడు.

సోవియట్ లుకూడా వస్తునిర్మాణ ప్రోత్సాహపు పనుల ఆవశ్యకతను గుర్తించారు. అసాధారణమైన ప్రతిభా ప్రజ్ఞలకు వారు ధనం బహుమతు లిస్తారు. అయినా, ఈ పనులు సరి పోయినట్లు కనపడటం లేదు. లేకపోతే, తమ నిర్మాణపు కోటాలను పూర్తి చేయలేనందుకై, "విధ్వంసకులను" శిక్షించే వార్తలనుగూర్చి మనం తరుచుగా చదివియుండము. "పెట్టుబడిదారీ దండయాత్ర" వలన కలిగే ఊహామాత్రపు అపాయములతో సర్వదా భయపెట్టి ప్రజలచేత గొప్ప గొప్ప పనులు చేయించుటకు ప్రభుత్వం తాపత్రయపడ నవసరం లేదు. స్వేచ్ఛాయుతమైన పోటీ సంఘంలో వచ్చిన బహుమ తులకంటె, దైవ ప్రభుత్వంనుంచి రాజకీయ సత్ప్రవర్తనతో ముడిపెట్టి ఇవ్వబడిన బహుమతులు తక్కువ ఫలితాల నిస్తాయి.

నిజానికి ప్రజలను తమ శక్తివంచన లేకుండా పనిచేయు నట్లు చేయునవి బహుమతులు, ప్రీమియములు, ఎక్కువ జీతాలు కాదు. తనయొక్క సొంత, స్వేచ్ఛా ప్రయత్నం ద్వారా మహాత్కార్యాన్ని సాధించామనే ఆత్మగర్వంకూడా ఆ పని చేస్తుంది. చాలామంది అమెరికావారు, మరొక కంపెనీలో వారికి అధికావకాశము లిచ్చి ప్రోత్సహించి నట్లైతే, హఠాత్తుగా వారి ఉద్యోగాలు మాని వెళ్ళిపోతుంటారు. కొందరికి 'హఠాత్తుగా' "క్రొత్త భావం స్ఫురిస్తుంది." వెంటనే వారు అప్పుచేసి, స్వతంత్ర వ్యాపారమును స్థాపించి, పూర్తిగా క్రొత్త కార్యక్రమం సాగిస్తారు.

ఈ విధమైన స్వేచ్ఛతో జరిగే సులభమైన మార్పుల వలన ఆర్థిక వ్యవస్థలోకూడా మార్పు, అభివృద్ధి బుడగలవలె కలుగుతుంటాయి. పై అధికారినుంచి అనుజ్ఞ లేకుండా ఎవ్వరూ, ఉద్యోగ మార్పునకుగాని, సొంత దుకాణం పెట్టు కొనుటకుగాని అధికారం లేని విధానంలో పనిచేసే పెద్దపెద్ద యంత్రాలద్వారా అటువంటి పరిస్థితు లేవిధంగా రాగలవో నాకు తెలీదు.

పెట్టుబడిమీాద మంచి లాభం సంపాదించే పెద్ద వ్యాపార సంస్థల నెప్పుడు, ఏ అమెరికా కార్మిక సంఘము కూడా ద్వేషించ లేదు. దాని సూచనగా, అమెరికా పనివాళ్లు, ఉద్యోగులు అంతా "పెట్టుబడిదారు" అనే పదాన్ని ఐరోపావా రుపయో గించే దానికంటే పూర్తిగా వ్యతిరేక కార్థంలో ఉపయోగిస్తారు. ఐరోపాలో ఎంత చిన్నదైనా, ప్రతీవ్యక్తి గత వ్యాపారానికే ఈ పదాన్ని ఉపయోగిస్తాడు. కాని, అమెరికాలో దీనిని పెట్టుబడి దారులకు, కోటీశ్వరులకు మాత్రమే ఉపయోగిస్తారు. అది ఎందుచేతనంటే, ప్రత్యేక వ్యక్తిగత వ్యాపార ప్రయత్నం లేకుండా ఆర్థిక సంచలనం జరిగే విధానం అమెరికా వారికి మామూలుగా గ్రాహ్యం కావటంలేదు. అది లేని పక్షంలో, మీా ఆర్థిక వ్యవస్థకు వెనుక బలంగా ఉండే ప్రోత్సాహశక్తి నశించిపోతుందని వారు స్వభావ సిద్ధంగానే అనుకుంటారు. నీవు "పెట్టుబడిదారీ విధానము" అని అనుకునేది ఆ విధంగా, అమెరికాలో వర్గరహిత భావముగా, అందరి ఆమోదమును పొందిన ఒక కార్యక్రమంగా మారిపోయింది.

# పంపక సమస్యలు

ప్రియమైన హెన్రీ!

మేము ఉత్పత్తిని గురించియే ఎక్కువగా శ్రద్ధ తీసికొని పంపక సమస్యలను నిర్లక్ష్యము చేయుటలేదా ? అని నీవు అడుగవచ్చును. ఇచ్చట నీవు దయతో మంచి సమస్యనే ఉత్పన్నము చేసినావు. నీవు అట్లు చేసినందులకు నా కృతజ్ఞత. కార్మికుల మంచికి ధనము నుత్పత్తి చేయుటయా ? లేక దానిని పంచిపెట్టుటయా ? ఏది ముఖ్యము ?

ఉత్పత్తి చాల తక్కువగా నున్నప్పుడు పంపకము ప్రధాన విషయముగా ఉంటుంది. లేకపోతే మిలియన్ల కొలదీ ప్రజలు క్షామపీడితులై యుండగా ధనికులు మాత్రము ఆనందిస్తూ ఉంటారు. మా సైన్యము యొక్కయు, మా మిత్ర రాజ్యముల యొక్కయు యుద్ధావసరముల కొరకై మా దేశములోని సామాన్య పౌరులకొరకు చేయబడెడి ఉత్పత్తి పరిమాణమును ప్రభుత్వమువారు పరిమితముచేసి ఉత్పత్తి మొత్తములో చాల భాగమును యుద్ధము కొరకై యిచ్చెడి వారు. మేము కూడ రేషనింగు, వస్తువు ధరల నిబంధనలకు కట్టుబడియుంటిమి. కాని, అటువంటి పద్ధతులు ఎక్కువగా నున్నచో వాంఛితములను పరిమితము చేయగలవు. అవి జాతియొక్క పరిస్థితి నభివృద్ధి పరచజాలవు. ఉత్పత్తి పరిమాణము పెరుగుదలయే ఆ పనిని చేయగలదు.

సిద్ధాంత రీత్యా మార్క్సు విధానము ననుసరించువారు ఎల్లప్పుడున్నూ ఉత్పత్తియే ముఖ్యమైనదని నొక్కి చెప్పుట

నేను బాగుగా ఎరుగుదును. ఆచరణలో మాత్రము వారు పంపకమే ముఖ్య సమస్యయని మనస్సులో పెట్టుకొని యున్న ట్లున్నది. మార్క్సు, లెనిన్‌లు ఉత్పత్తి నధికము చేయుటయే తమ ఉద్దేశ్యమని బహిరంగముగా చెప్పినను వారు ఈ లక్ష్యము నెట్లు సాధించదలచిరో ఎన్నడూ చెప్పలేదు. వారు ధనికుల కుండెడి హక్కులను తీసివేసెదమనియు, దానివలన ముఖ్యముగా కొంతవరకు పంపక సమస్య తీర్చబడుననియు మాత్రమే చెప్పిరి.

ఉత్పత్తిని పెంచుటయే అమెరికావారి ప్రధాన లక్ష్యము. అందుకు ఫలితముగా ప్రజాస్వామికము లేని పెట్టుబడిదారీ విధానములో మనము ధనికులవద్ద నుండెడి ధనమును లాగివేయకుండ ఉత్పత్తి చేయుటలో వినియోగించిన యెడల యింకను దేశములోని ధనము పెరిగి అందరికి కూడ ఎక్కువగా లభించును.

దీనిని పూర్తిగా అర్థము చేసుకొనుటకు నీవు ఒక సంవత్సరములో దేశములోని మొత్తము ఉత్పత్తియొక్క విలువను దానితో కూడ బెట్టబడిన ధనముయొక్క విలువతో పోల్చి చూడవలెను. (మానవునిచే ఉత్పత్తి చేయబడిన భూమి, భూమిలోని ఖనిజములు మొదలైన వానిని మినహాయించి) చాలమంది సగటున సంవత్సరవారీ ఉత్పత్తియొక్క పరిమాణము దేశముయొక్క ధనములో యిరువదియవ వంతు వుండునని అంచనా వేయుదురు. వాస్తవముగా ఎట్లైనను, అభివృద్ధి పొందుచున్న ఆర్థిక విధానములో, అది దానిలో

నాల్గవవంతు హెచ్చుగా నుండునని అంచనా వేయబడినది. మా ఉత్పత్తిలోని చాలభాగము ప్రస్తుతావసరములకై వినియోగింప బడుచుండుట చేతను, మరియు దేశముయొక్క కూడ బెట్టబడిన ధనముగా పరిగణింపబడెడి వెనుకటి సంవత్సరములలో ఉత్పత్తి చేయబడిన వానిలో మిగిలిన సరకులు పాడగుటవలన వానియొక్క విలువ క్రమక్రమముగా తగ్గిపోవుచుండుటను నీవు గమనించినట్లైతే, ఈ సంబంధము నీకు అర్థమగును. యుద్ధములో నాశన మొందిన ప్రాంతమును త్వరగా పునర్నిర్మాణము చేయుచుండుటవలన యిదివరలో కూడబెట్టబడిన (లేక నాశనము చేయబడిన) ఆస్తులతో పోల్చి చూచిన యెడల ప్రస్తుత ఉత్పత్తి ఎట్లున్నదో తెలియును. ఆ రీతిగా అధికమయిన ఉత్పత్తిలోని భాగమును అప్పటికప్పుడే పంచి వేయుటకంటె నిలువచేసి తక్కువ రాబడి వచ్చెడి వర్గములవారిని ధనవంతులనుగా చేయవచ్చును.

ఉత్పత్తి చాల తగ్గిపోవుటవలన సర్వ సామాన్యముగా దరిద్రము వచ్చును. ఈ పరిస్థితి నీకు చాలవరకు లాటిన్ భాష మాట్లాడెడి అమెరికా ప్రాంతములలో నీకు కనబడును. దీనిని చులకనగా చూసేవారు చాలమంది ఉన్నారు. పని ఉన్న ఉదయమునకూడ ఆరోగ్యముగా నున్నను జూదమాడుతూ కూర్చునేవా రెందరో ఉన్నారు. అటువంటి దేశములలో యించు మించుగా అన్ని వస్తువులకున్నూ కరవేర్పడుట నీవు చూడగలవు. దేశవ్యాప్తముగా దరిద్రముగల చోట్లలో

కార్మిక వాదుల (కమ్యూనిస్టుల) ప్రచారమునకు అనువుగా నుండును. మరియు అసలు అచ్చట లేనటువంటి పెట్టుబడిదారీ విధానమునకు వ్యతిరేక ప్రచారమును వారు చేయుదురు. వాస్తవముగా దానికి విరుగుడు పంపకములో లేదు. అది ఉత్పత్తి చాల అధికముగా చేయుటవలననే నివారింపబడును.

అమెరికా వంటి ఆధునిక పారిశ్రామిక దేశంలో పెట్టుబడిదారులయొక్క ధనమంతయు ఉత్పత్తిచేయు పరికరములలోను, ముడిసరుకులు రవణాచేయుట, పరిశ్రమల నడుపుట, మరియు ఉత్పత్తి దారునకు, కొనుగోలు దారునకు సంబంధము కలిపెడి సరకులలోను వినియోగింపబడును. ఈ ధనము పేరుకు మాత్రమే పంచి పెట్టబడగలదు; అది కొనుగోలు దార్లయొక్క ప్రస్తుతావసరములకు ఉపయోగించదు. ధనమును ప్రజలందరకు సమముగా పంచి యిచ్చినను వారి వ్యక్తిగత ఆస్తిలో చెప్పదగిన పెరుగుదల అగుపడదు. ఈ విషయము 'ఫ్రాంకుఫర్టు' లోని లక్షాధికారియైన 'రోత్స్ చైల్డ్' ను గురించి చెప్పిన కథలో వ్యక్తపరుపబడినది.

ఇది కేవలము అతిశయోక్తిగా మాత్రమే చెప్పబడెను. రోత్స్‌చైల్డ్ యొక్క నలుబది మిలియన్ల డాలర్లలోను చాల భాగము బహుశా అప్పులు, తనఖాలులోను యిండ్లు, యంత్రాలయములు కట్టుటలోను లేక సరకుల కొనుబడిలోను వినియోగింపబడి యుండవచ్చును. తక్కువ వ్యవధిలో పంపకము చేయుటకు కావలెననిన అందులో కొంచెము భాగము మాత్రమే లభ్యమై యుండెడిది.

అమెరికాలోని కార్మికులు, కార్మిక సంస్థలు అధికోత్పత్తి వలన వారికి కలిగెడి లాభము కంటె 'ఉన్నధనమును తిరిగి పంచి యిచ్చుటవలన వారికి వచ్చేది తక్కువని చాల కాలము క్రితమే గ్రహించినారు. పెద్ద మొత్తమును ఉత్పత్తిచేసి అందులోనుండి పంచుకొనవలసిన ఆవశ్యకతను గురించి వారు బాగా తెలిసికొని యున్నారు. మరియు ఉత్పత్తిని నిరోధించు వర్గ విచక్షణ వారు తీవ్రముగా ప్రతి ఘటించిరి. అందుచేతనే కార్మికులయొక్క హక్కుల కొరకై తీవ్రముగా పోరాడు నప్పుడుకూడ శామ్యూల్ గోంపర్స్ మార్క్సు సిద్ధాంతములు " అర్థశాస్త్ర ప్రకారము దుర్బలమైనవనియు; సామాజిక నియమముల ప్రకారము చెడ్డవనియు ; పారిశ్రామికముగా ఆచరణ సాధ్యముగాని వనియు " చెప్పి వానిని త్రోసి పుచ్చెను. పంచి పెట్టుటకు ముందు ఉత్పత్తిచేయవలెనని ఆత డెరుగును. అప్పుడు గనులలో పనిచేసెడి కార్మికులయొక్క కేంద్ర సంఘమునకు అధ్యక్షుడైన జాన్ మిచ్చెల్ ఆ శతాబ్దప్రారంభములో యిట్లు వ్రాసెను: " కార్మిక సంఘములలోని సభ్యులుయంత్రములు దేశములోని ఉత్పత్తిని బ్రహ్మాండముగా పెంచుటకు సహాయపడుచున్నవని గుర్తించిరి...... దాని ఫలితముగా పాత పద్ధతులలో పనిచేసెడి కార్మికుల యొక్కయు, మరియు ఆధునిక యంత్రముల సహాయముతో పనిచేసెడి కార్మికుల యొక్కయు జీవనప్రమాణములు పెరిగినవి. "

పై విషయముల వలన మనము పంపక సమస్య యెడల నిర్లక్ష్యము చూపవచ్చునని అర్థముకాదు. మా కార్మిక సంఘములు మా కార్మికులకు తగిన జీవనభృతిని సంపాదించి పెట్టుటలో ఎంత కృతార్థతను పొందియున్నవో యిదివరకే నేను చెప్పియున్నాను. వరుసగా గత 20 సంవత్సరములలోను పెద్ద రాబడి వచ్చెడివారి రాబడిలోకంటె తక్కువ రాబడి వచ్చెడివారి రాబడిలో ఎక్కువ పెరుగుదల ఉండెను. దేశపు మొత్తపు రాబడిలో ధనికులకు వచ్చెడి వంతు రాబడి పన్నుల వలన చాలా తగ్గిపోయినది. చాల ఎక్కువ రాబడి వచ్చెడి జనాభాలోని 5% మందిని చూడుము. *1929 లో దేశము మొత్తపు రాబడిలో వీరికి 34% వచ్చియుండగా 1946 వ సంవత్సరంలో 18% మాత్రమే వీరికి వచ్చెను. దేశములో చాలా తక్కువరాబడి వచ్చెడి 1% మందియొక్క రాబడి ఆ సంవత్సరములలోనే 19.1% నుండి 7.7% కు తగ్గిపోయినది.

సంఘములుగా ఏర్పడిన నిపుణులైన కార్మికులను హెచ్చు స్థాయికి తీసికొనివచ్చి నిపుణతలేని తక్కువ వేతనములను పొందెడి కార్మికుల నష్టే యుంచుటవలన క్రొత్తగా విశేష సదుపాయము లివ్వబడిన ఒక క్రొత్తవర్గమును మేము తయారు చేయుచున్నట్లవలేదా ? దీనివలన సమాజ నిర్మాణములో తరతమ భేదములను సృష్టించినట్లగుటలేదా ? యని నీ వడుగవచ్చును. మా సంఘనాయకులు సామాన్య ప్రజలను

*(ఈ సంఖ్యల వివరము దేశీయ ఆర్థిక పరిశోధనా సంస్థవారి వద్ద నుండి తీసికొనబడినది.)

మరచిపోయిరని వ్రాయుచున్నావు. వారు రాజకీయముగా పోరాటము సలుపకుండా న్యాయముగా వారి వంతుకు రావలసిన భాగము నెట్లు సంపాదించగలరని నీవు అడుగుచున్నావు.

మా దేశములోని సామాన్య ప్రజలు ఏ విధముగాను నిర్లక్ష్యము చేయబడలేదు. గేంపర్సు మరియు అతని అనుచరులైన ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, గ్రీసు దేశమువారు ప్రధానముగా నిపుణత గల్గిన కార్మికులయొక్క సమస్యలపైననే తమ దృష్టిని కేంద్రీకరించి పనిచేసిరి. తరువాత కాలము గడచినకొలది ఎట్లో ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, మరియు గ్రీసువారుకూడ వృత్తులనుబట్టికాక సూటిగా పరిశ్రమలనుబట్టి నిపుణత లేని కార్మికులనుకూడ తమలో కలుపుకొని ఒక క్రమమైన వ్యవస్థను ఏర్పాటు చేసిరి. మరియు 1936లో పారిశ్రామిక కాంగ్రెసు సంస్థ (సి. ఐ. ఒ.) సరియైన కార్యక్రమంతో స్థాపింపబడినది. దాని ఫలితముగా 1900 లో అమెరికా కార్మిక సంఘంలో 4% మంది కార్మికులు, ఉద్యోగులు సభ్యులై యుండగా 1940 లో ఆ సంఖ్య 20% కున్నూ, 1945 లో 33% కున్నూ పెరిగినది.

అదిగాక, వారు కేంద్ర ప్రభుత్వపు శాసనముద్వారా 1938 నుండి ప్రతి కార్మికునకు ఒక కనిష్ఠ ప్రమాణమునకు పైబడి వేతనము లభించునట్లు సాధించిరి. అంతక్రితము కనిష్ఠ వేతనము గంటకు 25 సెంట్లుగా ఉండెడిది. 40 సెంట్లకు పెంచబడినది. ఇప్పుడు గంటకు 75 సెంట్లకు తక్కువ వేతనమిచ్చెడి

యజమాని దోపిడియగును. సంఘముల రక్షణ లేనివారికి ప్రభుత్వ మూ విధముగా రక్షణ ఇచ్చుచున్నది.

ఆఖరుకు ఆర్థికముగా వెనుకబడియున్న ప్రాంతముల నభివృద్ధిచేయుటకు ప్రభుత్వముచే భారీ చర్యలు తీసికొనబడుచున్నవి. బహుశా వీటన్నింటిలోను బాగా తెలిసినది 'టెన్నిన్ వ్యాలీ అథార్టీ' (టి. వి. ఎ.) అనగా టెన్నీన్ లోయ ఆధిపత్యము. ఆ టెన్నీస్ పర్వతములలోని ప్రజలు చాలా బీదవారు. అచ్చట నదులపై ఆనకట్టలు కట్టుట వలనను, విద్యుత్ శక్తి నుత్పత్తి చేయుటవలనను ఉత్పత్తి అధికము చేయబడుటచే ఆ ప్రాంత వాసులందరు క్రమక్రమముగా అభివృద్ధి పొందుచున్నారు. కాని, వ్యక్తులచేకూడ ఆ విధమైనవి లెక్కలేనన్ని ప్రణాళికలు అమలు జరుపబడినవి. రైలుదార్లు దేశములోని అన్ని భాగములకు నూతన శక్తిని, అభివృద్ధిని తెచ్చినవి. అరణ్య ప్రాంతములలో పరిశ్రమల మూలమున డెట్రాయిట్ పట్టణమువంటి పట్టణములు సృష్టించబడినవి. మేము జాతినంతను అభివృద్ధి పరచుచు దారిద్ర్యమును నిర్మూలించుటకు సదా ప్రయత్నించుచున్నాము.

అమెరికాలో దరిద్రమన నేమో నీకు కొంచెము చెప్పెదను. 1948 లో కుటుంబములేని వ్యక్తులలో 500 మంది 1000 డాలర్లుకంటె తక్కువ ఆదాయము కలిగి యున్నవారు యించు మించు తనఖాలు లేనటువంటి స్వంత యిండ్లను, 25% మంది మోటారుకార్లను కల్గియుండిరి; 25% మందికి గుప్తధనముండెను; 25% మంది రేడియోలు, రెఫ్రిజిరేటర్లు

బట్టలుతుకు యంత్రములు, టెలివిజన్ యంత్రములనుకూడ కొనగల్గి యుండిరి. "తక్కువ రాబడిగల కుటుంబములు— ఆర్థిక స్థిరత్వము," అను విషయము ఆర్థిక పరిశీలనపై సహాయ కమిటీవారిచే (అమెరికా సంయుక్త రాష్ట్ర కాంగ్రెసు). ప్రకటించ బడినది.

సర్వ సమృద్ధమైన మా దేశములో ధన పంపకము యిప్పుడు ప్రధాన సమస్యగా లేదని నీవు నమ్ము. మా పెట్టుబడి దార్లు లాభము సంపాదించుటకు కార్మికులను మాడ్చ నవసరం లేదు. కార్మికులు చక్కని జీవనము గడుపుటకు, కుటుంబములను పోషించుకు పెట్టుబడిదారను నష్టపర చవలసిన పనిలేదు. అనగా 1849 లో అమెరికాలోని కార్మికులకు మోటారుకార్లు, రేడియోలు లేనప్పుడు అలెగ్జాండర్ మేకే, ఆంగ్లేయ పత్రికాధిపతి 'పాశ్చాత్య ప్రపంచము' ('వెస్టరన్ వరల్డ్') అను పత్రికలో నిట్లు వ్రాసెను: "అన్ని జాతులు ఒకే యోగ్యతతో నుండుచోట ఒకజాతి వేరొక జాతి సుఖము ననుభవించున్నదని ఆక్షేపణచేయదు. అమెరికాలో ధనికులపై అసూయ లేనే లేదు."

ఇచ్చట ఉత్పత్తి నధికముచేసెడి విపరీత గమనములో అందరూ కలసి పనిచేయుట వర్గ విచక్షణలేని పెట్టుబడి విధానముయొక్క సామాజిక సంబంధమైన ప్రాముఖ్యత వలననే జరుగుచున్నది. ఆ విధానము అన్యాయమైనదైనను, అస్థిరమైనదైనను ప్రజా సామాన్యమున కంతకును ధనమును ఔదార్యముతో కేటాయించిన సమముగా పంచినట్లగును.

# మానవ మర్యాద

ప్రియమైన హెన్రీ!

క్రిందటిమారు నీకు నేను ఉత్తరము వ్రాసిన తర్వాత మార్క్సు సిద్ధాంతములకు సంబంధించిన కొన్ని నా పాత గ్రంథములను మరియొకమారు చదివాను. ఆర్థికాభివృద్ధి కొరకు గట్టిగా ప్రయత్నము చేయుటకు ముందుగా కార్మికుల యొక్క, వారి నాయకులయొక్క హృదయములలో ఒక గాఢమైన వాంఛిత మొకటి యున్నదని ఎల్లప్పుడు గట్టిగా నమ్మిన దానినే నేను గమనించాను. అదే మానవ మర్యాద. ప్రతి మానవునకు అతని యొక్క గుణగణములను బట్టియు, తెలివితేటలను బట్టియు, అతని యొక్క ప్రవీణతను బట్టియు ఒక వ్యక్తిత్వ మిచ్చుట అవుసరము. కార్మికుడు ఆ కర్మాగారపు నాల్గు గోడలమధ్యమున ఉండి పనిచేయుటవలన, తన చేతులను మురికి చేసుకొనునంత మాత్రమున తక్కువ వానిగా పరిగణింపబడుట కిష్టపడడు.

చాలమంది కార్మికుల కుండెడి ధనాపేక్ష చాలవరకు పై ఉద్దేశ్యముచేతనే కల్గినదనియు అతడు తన నిత్యావసరములకు కావలసిన దానికంటె హెచ్చుగా కోరుట, అందులో కొంత భాగమును వెచ్చించి మానవునకు సమానత్వము పొందుటకు అవుసరమైన వస్తువులను కొనుటకు వినియోగించుటకొరకే నని నేను నమ్మితిని. ఐనప్పటికి, ఈ కోరికను కేవలము ధనమే తీర్చలేదు. ఆంగ్ల అర్థశాస్త్రవేత్త అయిన ఆర్. హెచ్. టానీ, "మతము—పెట్టుబడిదారీ విధాన వ్యాప్తి"

అను తన గ్రంథములోని ఆఖరు పుటలలో "సామాన్య ప్రజ లకు కూడ అంతరాత్మ ఉన్నది; వారి కుండెడి ధనము వృద్ధియైనను వారియొక్క ఆత్మగౌరవమునకు, వారియొక్క స్వేచ్ఛకు కలిగింపబడు అంతరాయము నెదుర్కొనుటకు వలయు ఏర్పాట్లు ధనమువలన చేయబడజాలవు" అనెడి వాస్తవిక విషయముపై యిట్లు వ్యాఖ్యానించినాడు......
"ధనమునకు సంబంధించని ఆ లక్షణము, లేక కోరిక నెరవేర్చ బడిననే తప్ప, లేనిచో అవమానించబడిన మానవుడు స్వభావ సిద్ధమైన తన మర్యాద కొరకు తిరుగుబాటు చేసి పరిశ్రమలను స్థభింపజేయ సమకట్టును".

నిజముగా మానవుడు ఒక కనిష్ఠ ప్రమాణముకంటె హెచ్చుగా ధనమును సంపాదింపకోరును. ఆతడు తనయొక్క యోగ్యతను కనబరచుటకు అవకాశమును కోరుచుండును. ఆతడు తన బుద్ధిబలమును ప్రదర్శించవలెనని గాఢవాంఛతో నుండును.

ఇంకను పెద్ద బాధ్యతతో కూడిన పెద్ద పదవి నలంకరింప గోరు పనివా డెప్పుడున్నూ అచ్చట చాల తక్కువగా వర్గ పక్షపాతమును చూడగలడు. సామాన్యముగా అమెరికా దేశస్థు లందరు పెట్టుబడిదా ర్లందరితో సహా కార్మికునకు అతనియొక్క వ్యక్తిగత గుణములను తెలియజేసికొనుటకు హక్కు ఉన్నదని తలంతురు. అధిక సంఖ్యాకులుగా కార్మి కులు బాధ్యతాయుతమైన అధిక జీతముగల్గిన పెద్ద హోదాల వరకు వెళ్ళగల్గిన కార్యాలయములలో నియుక్తులై యుండుట;

గొప్ప పలుకుబడి, అధికారము, ధనము కలిగియుండుట నీవు ప్రత్యక్షముగా చూడవచ్చును. కాని, వీటన్నింటికంటె కూడా ఎక్కువగా కార్మిక కుటుంబములలోని మిలియన్ల తరబడి బాలబాలికలు కళాశాలలకు వెళ్ళి చదువుకొని, మిగతా వర్గముల వారందరితో సమానముగా అన్ని మార్గములలోను పోటీ చేయుచున్నారు. వారు వారియొక్క వ్యక్తిత్వములు, సామర్థ్యములవలన మాత్రమే ఏదేని పనికై ఎంచుకొనబడు దురు. అంతే కాని, యింకేమియు పరిగణింపబడవు.

మానవజాతి స్వభావసిద్ధమైన తన శక్తి సామర్థ్యము లను ప్రదర్శించుటయే అమెరికాలో ప్రతి వ్యక్తియొక్క వాంఛి తము. అదే మానవుని యొక్క సౌఖ్యమునకు మూలా ధారము; సమాజమునకు గొప్ప ఆస్థి. ఏ దేశములలో కార్మికులు మిగతా మానవు లందరికంటె తక్కువగా చూడ బడుదురో ఆ దేశములలో ఈ ఉద్దేశ్యమునకు భంగము వాటిల్లును.

అటువంటి వర్గ పోరాటములో చాలవరకు కార్మికుల యొక్క మర్యాదను భంగపుచ్చుటలో ఐరోపా ఖండము చాల ప్రాముఖ్యము వహించినదని నేను నమ్ముచున్నాను. ఒక ఉన్నత రాజకీయ సిద్ధాంతముగా పరిణమించిన దాని ప్రారంభోద్దేశ్యం కార్మికులయొక్క మార్గమున కడ్డుపడెడి వారితో కలసి మాటలతో చెప్పెడి సమానత్వమును సాధిం చుటకు మాత్రమే. ఇచ్చట నీకొక విషమ సమస్య ఏర్పడినది. ఉన్నత వర్గములవారినుండి ప్రారంభించి వర్గ విచక్షణను

వేరుచేసినచో అది క్రింది వర్గములవారిని వర్గ సమస్యా విషయములో రెచ్చగొట్టినట్లగును. దానివలన కల్గెడి వైషమ్యా ములు వివిధ వర్గముల మధ్యనున్న భేదాభిప్రాయములను అధికము చేయును.

అటువంటి పరిస్థితులలో రాజకీయముగా వర్గ పోరాట మును తీసికొనివచ్చుట గమనార్హమైనప్పటికిన్నీ, దానికొరకై ప్రచారము చేసెడివారు ఐరోపాలోని కార్మికులకు చాల హాని చేసిన వారగుచున్నారు.

వారు, పెట్టుబడిదార్లు భరించవలసియున్న నష్టమును, ఉత్పత్తి చేయుటకు పడిన శ్రమను, వారి బుద్ధి కుశలతను గురించి ఉన్నదానిని తగ్గించిచెప్పియు, వారు కార్మికులకు అన్యా యము చేయుచున్నారనియు, నిజముగా దొంగలవలె వారి యొక్క కాలమును, ఉత్పత్తి శక్తులను (అధిక విలువ) దొంగిలించి, వారి అధికార బలముతో సంఘమును మోసము చేయుచున్నారనియు కార్మికులకుచెప్పి. పెట్టుబడిదార్లయొక్క చిత్రమును వికృతముగా చిత్రించి, వారి జీవితము వ్యర్థ మని వారి మనస్సులకు ఎక్కించిరి. వారి యజమాని అన్యా యము చేయుచున్నాడనెడి అనుమానము బలపరచ బడినది. మార్క్సు సిద్ధాంతములను గురించి ప్రచారము చేసెడి వారి మాటలను వినినవాడు ఉన్నత వర్గమువారి యదార్థ వాక్య ములను నమ్మరు. వారి సుహృద్భావమును, సోదర భావ మునుకూడ విశ్వసించరు. తగినన్ని సదుపాయములు కల్పించి నను యింకను ఏదో లోపమున్నదని అనుకొనును.

అమెరికాలోని కార్మికులు యిట్టి ప్రచారమును నిరసించిరి. ఒక్కొక్కప్పుడు యిచ్చటకూడ ఈ విషయములో చాల పట్టింపు ఉండెడిది. ఉదాహరణకు, 19 వ శతాబ్దము ఆఖరు దశలలో ఈ ప్రచారము చాల తీవ్రముగా యుండెడిది. ఐనప్పటికి ఐరోపాలోవలె యిచ్చట ఆ వైషమ్యములు తీవ్రమైన రాజకీయ పరిణామములకు దారి తీయలేదు. మొత్తము మీాద యిచ్చట ధనిక వర్గమువారిలో గర్వము, కార్మికుల యెడ అయిష్టత తక్కువగా నున్నది. మరియు కార్మిక వర్గము వారిలో ధనిక వర్గమువారి యెడల అవనమ్మకము, కినుక తక్కువగా నున్నది.

మొన్న మొన్నటివరకు ఐరోపాలోని చాల దేశములలో నుండెడి జమీాందారీ విధానముయొక్క పద్ధతులతో పోల్చి చూచినయెడల అమెరికాలో ఐకమత్యముతో కూడిన వాతావరణ ముండుటకు యిచ్చట పని, విశ్రాంతికాలములకు ప్రత్యేక ప్రమాణములలో విలువ నిచ్చుటయే కారణము. ఖాళీగా జీవితమును గడిపెడి అమెరికాలోని ధనికుని ఆతని స్నేహితులు, బంధువులు కూడ 'సోమరిపోతు' అని పిలతురు.

అచ్చట నీతివంతమైన ఏ పనియైనను చేయదగినదిగా పరిగణింపబడును. పట్టభద్రులు అయిన భార్యాభర్త లిరువురు న్యూ యింగ్లాండులో ఒక వ్యవసాయదారునియొక్క యిల్లు కొని దానిలో ఒక హోటలుపెట్టిరి. వీరు సమాజములో అథమస్థితికి వచ్చివేసినారని ఎవ్వరున్నూ అనుకొనరు. అందుకు బదులుగా వారియొక్క పరిశ్రమను అందరు మెచ్చుకొందురు.

కష్టపడి పనిచేసి జీవించు విధానము ప్రపంచ మంతటను ఒప్పు కొనబడినది. అమెరికాలోని కార్మికులు అనవసరముగా బాధపడకుండ విశ్రాంతి తీసు కొనుచుందురు. ఇదివరలో అట్టి విశ్రాంతి తీసుకొనుట ధనవంతులకు మాత్రమే సాధ్యము. అది సమాజములో ఒక వర్గముయొక్క ఆధిక్యతను తెలియ జేయును. మార్క్సు తన ' పెట్టుబడి ' (Kapital) అనుగ్రంథ ములో నిట్లు చెప్పెను : " పెట్టుబడిదారీ విధాన మమలులో నున్న సమాజములో సామాన్యుల జీవిత కాలమంతయు పని చేయు కాలముగా మార్చబడుట ద్వారా ఒక వర్గము వారికి విశ్రాంతి కాలము సంపాదింపబడినది. " మార్క్సు తన కాలములోని ఐరోపా పరిస్థితిని బాగానే వర్ణించి యున్నాడు. కాని, అమెరికాలో కొన్ని పరిశ్రమలలో వారము నకు 40 గంటలు, మరికొన్ని పరిశ్రమలలో యింకను తక్కువ గంటలు కార్మికుడు పని చేయవలెను కనుక అందరు విశ్రాంతి ననుభవింప వచ్చును. చాలినంత విశ్రాంతి లభించు టచే అమెరికాలోని కార్మికుడు ఎక్కువగా ఆత్మగౌరమును, మర్యాదను సంపాదించినాడు.

మా దేశములోని కార్మికులు యిదివరకెన్నడు పొందని క్రొత్త సదుపాయముల నిప్పుడు వారి విశ్రాంతి సమయములో ధనవంతులతోపాటు పొంది ఆనందించుచున్నారు. రేడియోలు అన్ని దేశములలో కంటె మా దేశములో చాలచవుక. కనుక మిలియన్ల కొలది రేడియోలు ప్రజలు ఉపయో గించుచున్నారు. దేశములోని పట్టణములకు దగ్గరగా ప్రజల

కొరకు ఉద్యానవనములు, పట్టణములకు దగ్గరగా నున్న సముద్రతీర ప్రదేశములు వినోదార్థము అభివృద్ధి పరచబడినవి. ఆ తావులకు వారాంతమున బంధుమిత్ర పరివారముతో వెళ్ళి విందు లారగించి కాలక్షేపము చేయవచ్చును, 'గోల్ఫు' ఆట కూడ యిప్పుడు ప్రజల అందుబాటులో నున్నది. ప్రజల ధనము చాలవరకు ఈ పనులకై వెచ్చింపబడినది.

50 సంవత్సరములు క్రితమునుండి యింజనీర్లకు, యజమానులకుకూడ తక్కువ గంటలు కార్మికునిచే పనిచేయించుట వలన పరిశ్రమయొక్క ఉత్పత్తి అధిక మగునని తెలియును. తక్కువ కాలము పని చేసిన పని రోజులలో మనుష్యులు ఎక్కువ వేగముతోను, కచ్చితముగాను పనిచేయగలరు. ఉత్పత్తిలో రద్దు తగ్గును, వస్తునాణ్యతఅభివృద్ధి పొందును.

ధనికులకు, బీదవారికి, యజమానికి, పనివానికి మధ్య నుండెడి సంబంధములను గురించి వివరించి, పనివాని మర్యాద సమస్య అంత పెద్దది కాదని నీకు ఘంటాపథముగా చెప్పి యున్నాను. కాని, యిద్దరు సోవియట్ రచయితల అనుభవములు నీకు నచ్చియుండవచ్చును. 1936 వ సం॥లో వారు 'చిన్న బంగారపు అమెరికా"('Little Golden America') అను పుస్తకమును వ్రాసిరి. దానిని రష్యావారు ఎక్కువగా చదివెదరు. అది అమెరికాలోని పెట్టుబడిదారీ విధానమును పరిశీలించి వ్రాయబడినదే అనుకొనుము. అందులో ఇల్ యా ఇల్ఫ్ మరియు యూజిన్ పెట్రోవ్ అనువా రిరువురు అమెరికా 'ప్రజాస్వామ్యములో ప్రజలయొక్క అన్యోన్య సంబంధము

లలో కనిపించెడి అద్భుతమైన విషయమునుగురించి నొక్కి చెప్పినారు. దానిని పైకి కనపరచెడి రూపము మాత్రమే (ఇల్ఫ్ మరియు పెట్రోవ్ ఎల్లప్పుడు N. K. V. D. ని మనస్సులో నుంచుకొనవలెను) అని అనినను, అది మానవ మర్యాదను పెంచునని వారు ఒప్పుకొనిరి.

క్రొత్తగా పెట్టుబడిదారీవిధాన మమలులోనికివచ్చినప్పుడు, పెట్టుబడిదార్ల నావరించియున్న అభివృద్ధి నిరోధకమైన వర్గ విచక్షణను వారు విడనాడవలెను. అమెరికాలో ఒక వైపున అభివృద్ధి ఎక్కువవగా, వర్గవిభేదములు తగిపోయినవి. ఇంకొక వైపున ధనము, ఆరోగ్యము, ఆర్థిక స్థిరత్వ మేర్పడినవి. స్వాతంత్ర్య ముండుటవలన అందరికిన్నీ మర్యాద, విద్య విషయములో అవకాశము లివ్వబడుచున్నవి. ఒక నాయకుడు గాని, ఒక నియంతగాని, లేక ఒక ప్రత్యేక వర్గమువారు గాని వారి తెలివితేటలవలన వీటిని సాధించలేదు. ఎవ్వరినీ పాడుచేయుటవలన ఇవి సాధింపబడలేదు. సమాజ శక్తుల వలనే సాధించబడినవి.

ఈ విధముగా అమెరికా పరిపూర్ణమైన పెట్టుబడిదారీ విధానమును అమలు పరచినది, పెట్టుబడిదారి విధానముకు ప్రతి మానవునికి వ్యక్తిగత విలువ, గౌరవములందును, ప్రజా స్వామ్య సూత్రములందును అచంచల విశ్వాస మున్నదని రుజువు చేసినది.

# దాస్యమునకు మార్గము

ప్రియమైన హెన్రీ!

మానవ ఘనత గురించి నాకు కల్గిన కొన్ని అభిప్రాయ ముల గురించి నీవేమియు అనుకొనవని తలచెదను. క్రిందటి నా ఉత్తరంలో కథ అంతటిగురించి లేదు. మానవ మర్యాద విషయంలో అమెరికాలోని కార్మికుని రష్యాలోని వాని సోదరునితో పోల్చిచూచిన, ఎవ్వనికైనను స్వాతంత్ర్యం లేనిదే మర్యాద ఉండదని గ్రహించగలవు. తన జీవనోపాధి సంపా దించుకొనుటకు మానవుడు ఎల్లప్పుడు తన యజమాని నిచ్చెడి ప్రతి చిన్న సూచనను అనుకరించవలెను. ప్రత్యక్షముగా కాన్పించెడి నేరమును సిగ్గువిడచి పొగడినను, అంతరాత్మ చెప్పినట్లుగా నడచిన వానిని నేరస్థునిగా నిందించినను సంతో షముతో అంగీకరించవలెను. ఎందులకై మనము వర్గ విచక్షణ నిర్మూలన చేయవలెను? స్వాతంత్ర్యములో లబ్ధి పొందుటకు బదులు మనమంతా బానిసలు కావలెను. స్వాతంత్ర్యా మెందుల కనగా మన వుచ్చులు మనం బిగించుకొనుటకు మాత్రమే.

పరిహాసికముగా మార్క్సు ఏ మార్గమున కార్మికుల యొక్క మర్యాద యథాస్థితికి తెచ్చుటకు ప్రయత్నము చేసెనో ఆ పద్ధతి వల్లనే ఈ దాస్యత్వము తీసుకొని రాబడినది. నేను హక్కులు విడచుకొనుట గురించి, సర్వమానవ సమా నత్వమును తీసుకొని వచ్చుటగురించి చెప్పుచున్నాను. మార్క్సు యీ హక్కును సిద్ధాంతీకరించి యున్నాడు. కారణ

మేమన అతనికి అర్థశాస్త్రప్రకారం పెట్టుబడిదారులు ఉండుటలో న్యాయమేమియు కనబడలేదు. ఇంకను అతడు వారియొక్క ఆర్థిక, రాజకీయ శక్తులను రెండింటినీ పూర్తిగా వినియోగించి మాత్రమే వారు లాభములు పొంద గల్గిరని అనుకొనెను.

ఇప్పుడు ఈ విషయములో కూడా నేను ఇంకను చాల మంది అమెరికన్లు చాలవరకు మార్క్సుతో అంగీకరించగలము. కాని, మేము వేరు విధమైన నిశ్చయము చేసుకొంటిమి. అది ఒక సరళమైన, తార్కికమైన నిశ్చయమని నేను అనుకొందును. మేము యీ ద్వివిధ శక్తులను ఎప్పటికప్పుడు లోపరహితంగా వేరుచేసుకొంటూ వచ్చి చాలవరకు కృతార్థులమైతిమి. మా రాజ్యాంగవిధానము, మా పద్ధతులు, మా సంఘపద్ధతి, మా గవర్నమెంటు—అవి అన్నియు వాస్తవికంగా వర్గాతీతమైనవి. ఇంకను యీ రోజులలో పెట్టుబడిదారులయొక్క ప్రాబల్యము కార్మికులయొక్క, ఇతరవర్గముల వారియొక్క ప్రాబల్యముతో సరితూగ గల్గియున్నది. అందుచేత, అమెరికాలోని మేము యీ సమస్య విషయములో ఎంతమాత్రము దిగులొందవలసిన పని లేదు. ఆ ద్వివిధ శక్తులను వేరుచేసికొని వర్గరహితమైన సమాజము నేర్పాటు చేసుకొనుటలో స్వాతంత్ర్యమునకు దరి చేరుచున్నాము.

పెట్టుబడిదారీ విధానము ఎంతమాత్రమూ ఏకవర్గ ఆధిపత్యముతో బాటు ఉండలేదని నిశ్చయముగా సిద్ధాంతీకరించుట వల్ల మార్క్సు తనంతట తానే అసలు మార్గమును గ్రహింప

నారంభించెను. ఇది అతని పరిజ్ఞానములో మేల్తునక. కాని, ధనిక జాతులతో నిండియున్న రాజ్యమును లేక సమాజమును ఆత డూహింపలేక వర్గవిధానము, పెట్టుబడిదారీ విధానమును నాశనము చేయవలెనని నమ్మెను. పెట్టుబడిదారీ విధానము, వర్గ విధానమును నిర్మూలించవచ్చు ననెడి ప్రత్యామ్నాయ మును గురించి ఆతడెన్నడును ఆలోచించ లేదు. పెట్టుబడిదారీ పద్ధతి సంకుచితమైన కట్టడులలో ఉండుటకు అవకాశములేదు. లేదా పరిపూర్ణత్వమును పొందుట కవకాశము లేదని మనము చూచితిమి. పెట్టుబడిదారులు బీద ప్రజానీకము ఉన్నచోట్ల వృద్ధి పొందలేరని, వారియొక్క బ్రహ్మాండమైన ఉత్పత్తిని కొనుగోలు చేయలేరని, యంత్రసామగ్రి, సాధన సంపత్తి (నిజమైన పెట్టుబడి సరకులు) సుశిక్షితులైన, ప్రవీణు లైన పనివాండ్రు లేనిదే సరియైన మార్గమున ఉపయోగింప బడ జాలవనెడి విషయము మానవుని హెచ్చరించి బుద్ధికుశల తను కల్గించుచున్నది. ఈ పరిస్థితులలో పెట్టుబడిదారు లెట్లు స్థాపితస్వార్థప్రయోజకులు కాగలరు? వాస్తవముగా ప్రత్యేక సదుపాయములు, వర్ణ ప్రాధాన్యత అనెడి అడ్డంకులు లేని దేశములో పెట్టుబడిదారీ విధానము ప్రమాదవశమున అత్యు న్నత విజయమును సాధించియుండలేదు.

ఇప్పుడు సోవియట్ రష్యాలోనివారు ఏమి చేసినారు? రాజకీయ శక్తిని ఆర్థికశక్తినుండి విడదీయుటకు బదులుగా యిదివరకెన్నడును సమ్మిళితము చేయబడినంత గట్టిగా వానిని ఒకే వర్గమువారి చేతులలో కేంద్రీకరింప జేసినారు. రష్యాలో

యిదివరలో రాజకీయశక్తి చాలవరకు ధనికవర్గము వారిచే నడిపింపబడుచుండగా, యిప్పుడు రాజకీయవేత్తలచేత ఎక్కువగా ఆర్థికశక్తి నడుపబడుచున్నది. తత్ కారణంగా రష్యనులు చెప్పేటటువంటి సమానత్వము యిప్పుడు కేవలముదాస్యము దరికి చేర్చబడినది.

ప్రస్తుతము నేను రష్యన్ గవర్నమెంటు చేతులలోనున్న ఆర్థిక రాజకీయ అధికారముల సమ్మేళనమును ప్రాచీనకాలపు యూరపు ఖండములోని పెట్టుబడిదారీ విధానముతోడను, మరియు భూస్వామ్యపు పద్ధతితోడను పోల్చి చెప్ప సాహసించినందుకు ద్వేషము చెందవద్దు. సోవియట్ రష్యాలోని పద్ధతి పూర్తిగా వేరని నాకు తెలియును. కారణ మేమన, రాజకీయ, ఆర్థిక అధికారములు రెండున్నూ ఆ దేశస్థు లందరికిన్నీ వర్తింప చేయబడినవి. ఇది అసలైన హక్కు, కాని అసలు పరిస్థితు లేమి ?

అదృష్టవశమున మనము ఈ విషయమై అనధికార సమాచారములమీాద, లేక ఊహాగానముపైన ఆధార పడవలసిన పనిలేదు. సాధారణముగా లెనిన్, స్టాలిన్ లయొక్క అధికార ప్రకటనలో ప్రకటింపబడిన నిక్కపటమైన మనుష్య ద్వేషము మనము చదువగలము. వాటి ప్రకారము సోవియట్ పద్ధతిలో రాజకీయ అధికారము అల్పసంఖ్యాకమైన కమ్యూనిస్టు పార్టీలో కేంద్రీకరింపబడి యున్నది. కేవలము 1947 లో రష్యాలో 19,40,00,000 ల ప్రజలలోను 63,00,000 ప్రజలు మాత్రమే యీా పార్టీకి చెందినవారు. నిజముగా అధికారము

చేబూనిన కొలదిమంది చేతులలో కీలుబొమ్మవలె నుండుటకు ఆ పార్టీ అల్పసంఖ్యాకముగా నుండవలెను. ఐనప్పటికి పార్టీలోని సభ్యులేమైన చెప్పవలసినచో ఏమియు వీలు లేకున్నది. ముఖ్యమైన విషయములపై కేవలము నాయకులయొక్క అభిప్రాయములను సంతోషముతో ఏకీభవించ వలసినదే. కొద్దిమందియొక్క కూటమి ఒకనిని సర్వాధికారి లేక, నియంతగా ఏర్పరచుకొని రాజకీయ, ఆర్థిక అధికారము లను చలాయింతురు. ఈ రెండు అధికారములు కేంద్రీకరింప బడిన రాజ్యము కని విని ఎరుగనంత పూర్తిగా బానిసత్వ ముతో నిండి యుండును.

ప్రభువులు ధనిక వర్గములవారు రాజ్యమేలినప్పుడు యించుమించుగా ఎల్లప్పుడు స్వలాభపరుల అండను వారి వ్యతిరేకులు నిలచుటకు ఆశ్రయ ముండెడిది. ఇంకను శ్రామికుడు తన యజమాని తననెత్తిపైన రుద్ది అన్యాయముగూర్చి. పోలీసు అధికారివద్దకో, నగరాధ్యక్షునివద్దకో, కోర్టులకో వెళ్ళేవాడు. తరువాత కాలములోకూడ తనకు కల్గెడి ప్రమాద ములనుండి రక్షించుటకు, లేక తన ఆరోగ్యమునకు హానికర మైన విషయములనుండి రక్షించుటకు ప్రత్యేకాధికార్ల వద్దకు వెళ్ళేవాడు. అందులో చాలమంది అధికార్లు పెట్టుబడిదార్ల పలుకుబడివల్ల నియుక్తులై వారితో లాలూచిపడి చూచియు చూడనట్లు ఊరకుండెడివారనెడి సంగతిని నేను కప్పి పుచ్చుటలేదు. ఏమైనను ప్రజాస్వామ్యము క్రీతవు సమాజ ములోకూడ చట్టములు, సిద్ధాంతములు అమలులో పెట్టుటకు

తగిన సిబ్బంది ఉండెడివి. మరియు వాస్తవికముగా తరచు ఎక్కువగా స్వలాభాపేక్ష లేకుండ పనులు జరుగుచుండెడివి. ఇప్పుడు అమెరికాలోని మేము నిష్పాక్షికముగా చట్టములను అమలు జరుపుచున్నాము.

కాని, ఎచ్చట ఒక జాతియొక్క ఆర్థిక సంపత్తి అంతయు రాజకీయపు పెత్తువల్ల ఎన్నికైన ఒక వర్గమువారి పరిపాలన క్రిందనుంచినచో పారిశ్రామికులు వారియొక్క స్వాతంత్ర్యమును పూర్తిగా కోల్పోయిన వారగుదురు. సోవియట్ రష్యాలో 1940 జూన్ 26 తేదీ తీర్మానము ప్రకారము ఒక పనివాడు తన యజమానియొక్క అనుజ్ఞలేనిదే పని విడచి పెట్టుటకు వీలులేదు. పనివాడు పని చేయుస్థితిలో లేడని వైద్యుడు సర్టిఫికేటు యిచ్చినగాని యజమాని వానికి సెలవు యిచ్చుటకు స్వతంత్రుడుగాడు. కార్మిక సంఘములు కూడ మానవులను దాస్యమునుండి తప్పింప ప్రయత్నించ లేదు. ఇందుకు విరుద్ధముగా ఆ సంఘములు రాజ్యాధినేతలయొక్క, పార్టీ రాజకీయ అధికారులయొక్క చేతులలో కీలుబొమ్మలుగా ఉన్నవి. పనిని తొందర పరచుటే వారి యొక్క ముఖ్య కార్యక్రమము (దీనినే నీతి బాహ్యమైన "స్టాచ్‌నో విజమ్ అంటారు.) సమ్మెలను రాజద్రోహము గాను, హత్యానేరముగాను పరిగణించి ఉరిశిక్ష విధించెడి వారు. 'హారీహాప్‌కిన్స్' రూజ్‌వెల్టు యొక్క దూతగా యుద్ధ కాలములో మాస్కో వెళ్ళి యిచ్చి పుచ్చుకొనెడి వ్యాపార సంబంధమైన సామగ్రి సమ్మెలవల్ల అమెరికాలో

ఆటంకపరుపబడినదని చెప్పగా "మీకు పోలీసు బలము లేదా ?" అని స్టాలిన్ అడిగెను.

ఆ సంస్థలయొక్క కేంద్ర కార్యనిర్వాహకసభలో ఒక సభ్యుడు, "కార్మికుల యొక్క వేతనములను ఏర్పాటు చేయుటలో కార్మిక సంస్థలకు కూడ సమాన అవకాశము ఉండవలెననుట కేవలము అవకాశవాదము. దానివల్ల ఏకైక నాయకత్వమునకు భంగము వాటిల్లును. అధికార్లతో జోక్యము పెట్టుకొనుట అగుననియు చెప్పెను. (లక్ష్మివారము జూలై 8, 1933.)

ధనము, ఉత్పత్తులపై సంపూర్ణమైన హక్కు కల్గిన రాజ్యములో వచ్చిన కార్మికులయొక్క క్రమ శిక్షణా భంగము, పెట్టుబడి దారీ విధానము అమలునందున్న సమాజములో కల్గినచో వేతనముల నష్టము, జుల్మానా యింకను తీవ్రతర పరిస్థితిలో పనినుండి తప్పించుట మొదలైన కఠిన శిక్షలు విధించెదరు. జూన్ 26, 1940, తీర్మానము ప్రకారమే రష్యాలో తాత్కాలికముగా కార్మికుడు పనినుండి మానుట, లేక యిరువది నిమిషములు పనిలోని కాలస్యముగా వచ్చుట మొదలైన స్వల్పనేరములకు దాదాపు ఆరు నెలలవరకు బలవంతముగా పనిచేయించి శిక్షించెడివారు. ఈ జుల్మానా అయితే సాధారణముగా తన మామూలు పనిచేయు తావునందే చేయుగలడు. కాని, పర్యవేక్షణ క్రిందను, నూటికి 25 వంతులు తగ్గింపబడిన జీతము మీదను పని చేయవలసి

యుండెను. అనుమతి లేనిదే పని విడచి వెళ్ళువాడు రెండు మాసములవరకు ఖైదుకు వెళ్ళవలసి ఉన్నది.

కర్మాగారము స్వంతమైనను, ప్రజలదైనను, గవర్నమెంటుదైనను కర్మాగారపు యజమాని అన్యమార్గము లేని పరిస్థితులలో మాత్రమే శిక్ష విధించును. కాని, అది రష్యనుల ఉద్దేశ్యము మాత్రము కాదు. గవర్నమెంటు, కర్మాగార యాజమాన్యము ఒక్కరివే అనే విషయము పంచాయతీదార్లు, లేక ఒక న్యాయాధిపతిచేత విధించబడును. ఇంకను నేరస్థులను కోర్టులకు తీసుకొనిరాని కర్మాగారపు యజమానులను కూడ ఆ తీర్మానము ప్రకారమే పెద్ద మొత్తపు జుల్మానాలను విధించి శిక్షింతురు. కాని, అది అంతటితో పూర్తికాలేదు. 1940 జూలై 24 తేదీని మరియొక తీర్మానము న్యాయాధిపతులు మానవ సహజమైన భావములకు లోనైనచో చాల కఠినమైన హెచ్చు జుల్మానాలతో శిక్షింపబడుదురని ప్రకటింపబడెను. అమెరికాలోని గర్వించదగినటువంటి ప్రభుత్వ న్యాయవిచారణశాఖ రష్యాలో పోలీసుల యొక్క, ఒక పార్టీయొక్క అనుబంధ సంస్థగా చేయబడి నీచపరుపబడినది.

సోవియట్ విధానములో ఆర్థిక రాజకీయ అధికారములు మిళితమై యుండుటయేగాక, ఒక్కొక్కప్పుడు పెట్టుబడిదారీ విధానము అమలులోనున్న సమాజములో నుండునట్లు ఏకత్వమును పొంది యున్నవి. పారిశ్రామికుడు అవమానింపబడిన మనుష్యుడు తమకు అక్రమముగా కల్గిన నష్టమునుగురించి

చెప్పుకొనుటకు స్వతంత్రమైన అధికారి లేడు. ప్రభుత్వము, న్యాయస్థానములు, సంఘములు, ఆఖరుకు చర్చులు అన్నీ ఏకైక వర్గచిహ్నములే. ఆ సమాజములో ఎచ్చట వెలికినను ఆ భయంకరమైన విధానముయొక్క విభాగము, ఆ సర్వవ్యాపియైన స్టాలిన్ యొక్క చిత్తరువుతో బాటు గోచరించుచుండును. ఆ సర్వవ్యాప్తిజెందిన పోలీసుల రాజ్యములో వారి జులుముతో ఒక మనుష్యుడు దేశద్రోహిగా పరిగణింప బడినప్పుడు ఆతడు నిర్దోషి అయినప్పటికిన్నీ సహాయము చేయుటకు ఎవ్వరూ సాహసింపలేరు. ఆత్మబంధువులను దోషులని చెప్పినచో బహుమతి యివ్వబడును. కాని, ఒక మనుష్యుడు సైన్యములో పని చేయు వయస్సులో నున్నప్పుడు (ఏబది సంవత్సరములలోపు వయస్సు) "శ్రామికులయొక్క స్వర్గము"ను చేరుటకు పరుగెత్తి పోవలెను. అందులకై విదేశయానములు చేయవలెను. 1936 జూన్ 6 వ తేదీ తాలూకు జుల్మానముల చట్టము ప్రకారము అట్లు విదేశములకు వెళ్ళిన వాని బంధువు లెవరైన —వృద్ధులు—అట్టి ప్రయాణముగురించి తెలిసికొన్న వారైనచో వారు అయిదు మొదలు పది సంవత్సరములవరకు ఖైదుశిక్ష ననుభవించవలెను. దానినిగురించి వారికి తెలియకపోయినచో వారు 5 సం॥లు వరకు సైబీరియా (ఎడారి ప్రదేశము)కు పంపబడుదురు. ఆ విధముగా సోవియట్ కమ్యూనిస్టు విధానము ఆఖరుకు స్వాతంత్ర్య చిహ్నములనుకూడ తుడిచిపెట్టివేసినది. నిస్సహాయమైన బానిసత్వమును చేకూర్చినది.

పెట్టుబడిదారీ విధాన మమలులో నున్నటువంటి అమెరికాలో వ్యక్తి స్వాతంత్ర్యము, వ్యక్తి గౌరవము పరిరక్షింపబడినవి. స్వతంత్రత కలిగిన కోర్టుచే జారీ చేయబడిన సరియగు వారంటులేనిదే ఏయిల్లు తనిఖీ చేయబడదు; ఏవ్యక్తియున్ను నిర్బంధింపబడడు. విరుద్ధముగా రష్యాలో ఏ వ్యక్తియైనను అనిర్దుష్టమైన కాలము ఖైదీగా నుంచబడును, లేక పోలీసువారిచే బానిసగా పనిచేయుటకు పంపబడును. కాని, అమెరికా సరియైన సాక్ష్యములేనిదే నేరము మోపుటకు వీలులేదు. న్యాయ స్థానములు, రాజ్యాంగ అధికారులు చట్టవిరుద్ధముగా చేసిన ఏపనినైనను సమ్మతింపక వ్యతిరేకముగా తీర్పు యివ్వవచ్చును. న్యాయస్థానములు రాజ్యాంగమునకు విరుద్ధమైన ఏ చట్టమునైనను చెల్లదని తీర్పు యివ్వవచ్చును. ప్రభుత్వమునుండి ఆర్థిక విధానమును, అందుండి ఉత్పత్తి సాధనమును వేరుచేయుటవలన పారిశ్రామికులకు వారి యజమానులవల్ల కల్గిన అన్యాయము సులభముగా తీర్చబడుచున్నది. ఆ విధముగా ప్రభుత్వము ఉత్పత్తిలో పాల్గొనకుండా తన ఔన్నత్యము కాపాడుకొనుచూ వివిధ వర్గములకు మధ్యవర్తిగా అందరి సామాన్య హక్కులను కాపాడుచున్నది.

# నీగ్రోలు: పెట్టుబడిదారీ విధానము

ప్రియమైన హెన్రీ!

సామాన్య పారిశ్రామికుని గౌరవమును గురించి నేను చేసిన చర్చవలన తార్కికముగా అమెరికాలోని నీగ్రోల పరిస్థితి గురించి నీవు ఎదుకు ప్రశ్న వేయవచ్చును. ఆ విషయములో నీతో పూర్తిగా ఏకీభవించు చున్నాను. పరిస్థితి విచార కరమైనదే. అమెరికా దేశస్థులలో అధిక సంఖ్యాకులు దానిని గురించి చాల బాధపడుచున్నారని నేను వాస్తవముగా నమ్ముచున్నాను.

కాని, మేము కేవలము విచారించి అంతటితో తృప్తి చెందితి మనుకొనకుము. ఆ పరిస్థితులను చక్కబరచుటకు చేయవలసిన దంతయు చేయుచున్నాము. 1950 లో మొత్తం నీగ్రోజనాభా 15 మిలియన్లలోను దాదాపు 6 మిలియన్లు. ఇంచుమించుగ పరిస్థితులు బాగున్నటువంటి పశ్చిమ, ఉత్తర రాష్ట్రములలో నివసించు చుండిరి. ఇంకను చట్ట వ్యతిరేకముగా తీర్పులు చెప్పుట, నీగ్రోలకు వ్యతిరేకముగా జరుపబడిన హింసాకాండ మొదలగు ఏ సంఘటనల గూర్చి మీరు విన్నారో అవి మీరు అనుకొని నంత వ్యాప్తిగా జరుగలేదు. 1945 మొదలు 1949 వరకు గత అయిదు సంవత్సరములలోను జనసమూహములచే జరుపబడిన హింసాకాండలో 13 గురు నీగ్రోలు మాత్రమే చంపబడిరి. మా పత్రికలు జాతి విభేదము గూర్చి పక్షపాతముతో ప్రచారము చేయుచున్నవని అనుకొనుట చాలా తప్పు.

వాస్తవముగా దక్షిణ రాష్ట్రములలో కూడ యిటువంటి పరిస్థితి చాల అరుదు. ఏచ్చటనైనను కొద్దిపాటి రహస్య ప్రచురణములు ఉండిన అదియొక లెక్క కాదు. ఇంకను అమెరికాలో ప్రచురించబడు వార్తలు చదివిన జాతి సమానత్వముకొరకు పూర్తియైన ప్రోద్బల మివ్వబడు చున్నదని గ్రహించ గలవు. "హేరియట్ బీచర్ స్టవ్" అనే ప్రాంతములో నీగ్రోయోధులలో ఒకరైన 'విలియమ్ ఫాక్నర్' 'టామ్ మామగది' అనే పుస్తకము వ్రాసి నోబుల్ బహుమానమును పొందెను. వారి పుస్తకములు జాతి కంతకు ఉత్తేజమును కల్గించినవి.

అమెరికాలోని ప్రజలందరు నీగ్రో వ్యతిరేక తత్వముగల వారని ఆరోపణ చేయుటకు కూడ వీలులేదు. 1861 మొదలు 1865 వరకు జరిగిన అంతర్యుద్ధములో బానిసత్వము కొరకై పోరాడిన అధిక సంఖ్యాకులైన శ్వేత జాతుల ఉత్తర రాష్ట్రములను మరచి పోకుము. అప్పుడు యిప్పటివలె పశ్చిమ ఉత్తర రాష్ట్రములలోని అధిక సంఖ్యాకులైన ప్రజలు, క్రమ క్రమముగా అభివృద్ధి పొందిన దక్షిణ ప్రాంతములోని ప్రజలు కలసి సమానత్వము, సమాజ అభివృద్ధి కొరకు నీగ్రోల పోరాటములో వారితో సహకరించిరి.

19 వ శతాబ్దము యొక్క ఆఖరు దశాబ్దములో తీసుకొని రాబడిన పారిశ్రామిక సంబంధమైన మార్పులవలన కొంతవరకు పరిస్థితులు హీనమై తిరోగమించినవి. కాని, 20 వ శతాబ్దంలో పరిస్థితి మారి పురోగమించ నారంభించినది.

1948 వ సం॥ లో అమెరికా అధ్యక్షుడు "ట్రూమన్" తన ఎన్నికల సందర్భములో ఈ విషయమే తన ప్రధానలక్ష్యముగా నుంచుకొనుటవలన ఈ పోరాటము ఒక నూతన ఔన్నత్యమును పొందినది. మొట్ట మొదట సంప్రదాయము ప్రకారముగా దక్షిణ రాష్ట్రములవారు ప్రజాస్వామిక టిక్కట్టుపై నిలబడిన అభ్యర్థి నెన్నుకొనునట్లు కనబడెను. కాని, వా రాతనిని విస్మరించి చాలమంది దక్షిణ ప్రాంతపువారి అభ్యర్థికే వోట్ల నిచ్చిరి. ట్రూమన్ విజయమే యీ కార్యక్రమము యొక్క బలమునకు తార్కాణము.

మీ ప్రాచీన సంప్రదాయములు, అభిమానములు ఒక్క రోజు నిర్మూలింపబడ జాలవు. ఎవరితో మీరు స్నేహము చేసెదరు ? ఎవరిని పరిణయ మాడెదరు ? ఎవరితో కలిసి కాపురము చేసెదరు ?–ఇవన్నియు ఆత్మసంబంధమైనటువంటి నిశ్చితములు. మేము ప్రజాస్వామిక ప్రభుత్వంక్రింద నున్నాము. గాన, మాకు ప్రజాభిప్రాయమే ప్రధానమైన తీర్పు. మేము బాగా అవగాహన చేసుకొనుటకున్నూ, సమాజ పురోభివృద్ధి కొరకున్నూ అవకాశ మివ్వవలసి యున్నది. దానిని మేము చట్టనిర్మాణంద్వారాను, విద్యావ్యాప్తి ద్వారాను చేసెదము. నీగ్రోలయొక్క జీవిత పరిస్థితులలో తీసుకొని రాబడిన మార్పులు, వారి విద్యా సదుపాయములు, ఆర్థికాభివృద్ధి నీవు చూచినచో వారు పూర్తిగా అభివృద్ధి చెందినారని తెలుసు కొందువు.

1950 లో వోటుపన్ను (నీగ్రోలను, శ్వేత జాతి బీద ప్రజలను వోటుచేయ వీలు లేకుండ చేయు పద్ధతి) దక్షిణపు 17 రాష్ట్రాలలోని ఆరింటిలో ఉండెను. అందువలన 1940 లో 2,50,000 మంది నీగ్రోలు మాత్రమే వోటుచేయగా, 1948 లో 7,00,000 మందికి వోటుచేసే అవకాశం కలిగినది. నీగ్రోల ప్రతినిధులు కాంగ్రెసులోను, 16 రాష్ట్ర శాసన సభలలోను ఉండుట కవకాశం గల్గినది. ఉద్యోగాల నిచ్చునిమిత్తం అధ్యక్షుడు రూజ్వెల్టు సంస్థ నొక దానిని స్థాపించెను. వారు ప్రజాభిప్రాయ ప్రకారం చేయుచు సంఘమును పటిష్ఠము చేయుచున్నారు. దాదాపు ప్రతి విషయంలోను నైతికముగా తేబడిన ఒత్తిడి వల్లనే ఫిర్యాదు విచారణ చేయబడి లోపము సవరింప బడెడిది. యుద్ధానంతరం ముఖ్యమైన పది రాష్ట్రాలు అందులో ప్రత్యేకించి అత్యధిక జనాభా కలిగిన న్యూయార్కు రాష్ట్రం న్యాయముగా ఉద్యోగములనిచ్చునట్లు చేయుటకై చట్టములు చేసినవి. ఇంకను చాల రాష్ట్రము లాపద్ధతి నవలంబించబోవుచున్నవి. ఈ చట్టములలో చాలభాగము ఒక ఉద్యోగము కొరకు పెట్టుకొనబడిన దరఖాస్తుదారుల మధ్య జాతి, మత వివక్షత చూపబడుట నేరముగా పరిగణించుచున్నవి. ఈ కార్యక్రమము గురించి విదేశముల వారు తెలుసుకొనక పోవుట చాలవిచారకరము.

1900 లో మా దేశములోని నీగ్రో జనాభాలో మూడవవంతు మాత్రమే నిరక్షరాస్యు లుండిరి. 1940 లో పదవ వంతు మాత్రమే విద్యా విహీను లుండిరి. ఇప్పుడు

సుమారు 1,30,000 మంది నీగ్రోలు కాలేజీలలో చదువుతు చున్నారు. అనగా అరువది సంవత్సరముల క్రితము అమెరికాలో మొత్తం కాలేజీ విద్యార్థుల సంఖ్య ఇప్పుడు కాలేజీలో చదువుతున్న నీగ్రోల సంఖ్యకు సమానము. దక్షిణ రాష్ట్రములలో ప్రభుత్వ విశ్వ విద్యాలయములలో నీగ్రోలను చేర్చుకొనకూడదనెడి ఆంక్షలు చాలవరకు ఉన్నత న్యాయస్థానముల తీర్పుల వల్ల రద్దుచేయు బడినవి. ఉత్తర రాష్ట్రములలోని కళాశాలలలో నీగ్రో అతని శక్తి సామర్థ్యముల వలన తగిన గౌరవమును కూడ పొందుచున్నాడు. ఉదాహరణకు, 1951 లో ఆడపిల్లల కళాశాలలలోనికెల్ల ప్రఖ్యాతి గాంచిన "స్మిత్ కళాశాల" విద్యార్థి సంఘాధ్యక్షురాలుగా ఒక నీగ్రో బాలిక ఎన్నుకొనబడినది. హార్వర్డు విశ్వ విద్యాలయములో 1949 లో పట్టభద్రుల పరీక్షలలో యోగ్యతలను పొందిన వారు నీగ్రో జాతివారే. 1950 లో రట్జర్స్ విశ్వ విద్యాలయములో క్లాసుకు పెద్దయున్నూ, యేల్ విశ్వ విద్యాలయములో బంతి ఆట (ఫుట్ బాల్) కెప్టెను నీగ్రోలే. 1949 లో "ఆమ్‌హర్ట్స్ కాలేజీ" విద్యార్థి సంఘములో నీగ్రో సభ్యుడుగా చేర్చుకొనబడుటయేగాక అతనిని చేర్చుకొనవద్దని ఏకీభావముతో యితరులందరిచే చేయబడిన ఒత్తిడి వ్యతిరేకించబడినవి.

పై పరిస్థితులవల్ల ఉద్యోగ విషయములో త్వరగా మార్పు కలుగుచున్నది. నీగ్రోలను పోలీసు వుద్యోగులుగాను, గుమాస్తాలుగాను, జడ్జీలుగాను, ఉన్నత ప్రభు

త్యాధికార్లుగాను నీవు యిప్పుడు చూడగలవు. ఇప్పుడు అమెరికా దేశాంగ శాఖవారు గొప్ప రాజనీతిజ్ఞుడైన "డాక్టరు రాల్ఫ్‌బంచ్" ని ఐక్యరాజ్య సమితి యొక్క ధర్మకర్తృత్వ సంఘమునకు అధ్యక్షునిగా నియమించినారు.

గత దశాబ్దములో చాలమంది నీగ్రోలు అమెరికాలో "వెస్ట్‌పోయింట్" వద్ద నున్న "అమెరికా సైనిక శిక్షణాలయము" లోను, "ఎన్నాపొలీస్" వద్దనున్న నౌకా శిక్షణాలయములోను పట్టభద్రు లయిరి. ఇదివరలో పూర్తిగా శ్వేతజాతివారే ఉన్న మా సాయుధ సైనిక దళములలో 1950 జనవరి నెలనుండి నీగ్రోలకు కూడ స్థానమివ్వబడినది. వారిని చిన్న హోదాలలో మాత్రమే ఉంచి వేయవలె ననెడి అడ్డంకులు కూడ లేవు. మా సైన్యమునకు ఒక నీగ్రో అధిపతి కూడ ఉన్నాడు.

ఆర్థిక విషయంలో నీగ్రోజాతివారు యింకెంత మాత్రము ప్రాణావశిష్టులైన కూలీలు కారు. 1900 లో పరిశ్రమలలో నీగ్రోపనివారి సంఖ్య 1,00,000. 1950 లో ఆ సంఖ్య 15,00,000 వరకు పెరిగినది. అందులో చాలమంది ప్రవీణులు. తదనుగుణముగా వ్యవసాయములో నీగ్రో కూలీల సంఖ్య తగ్గనారంభించినది. రాజధాని ప్రాంతములలో తెల్లవారి కాటపట్టుగా నుండెడి స్థానములలో నీగ్రోలకు ప్రవేశమున కాటంక మింకెంత మాత్రమును లేదు. నీవు బాగా అలంకరించబడిన ఒక దుకాణము వద్దకు వెళ్ళినచో సమర్థులైన, అందమైన అమ్మకపు గుమస్తావనిలో నియుక్తులైన

శ్వేత జాతి పురుషుడుగాని, స్త్రీగాని నీకు సహాయము చేయుట నీవు చూడగలవు. ఈ విధముగానే చాల కార్యాలయములలో జరుగు చుండును. "జనరల్ ఎలక్ట్రిక్" "డ్యూపాంట్", "మేసీ" మొదలైన మా పెద్ద సంస్థలు ఇంజనీర్లుగాను, యింకను పెద్ద వుద్యోగస్థులుగాను నీగ్రోలను నియోగించు చున్నవి. కొంతమంది నీగ్రోలు పెద్ద వ్యాపారస్థులుగనో, పెద్ద భూస్వాములుగనో ఉంటున్నారు— నిజముగా పెట్టుబడి దారులుగానూ ఉంటున్నారు. నీవు దీనిని చూచి ఆశ్చర్యపడెదవు. కాని, 78 ఎకరముల పరిమిత కలిగిన నీగ్రో సేరీలు 2,00,000 వరకు గలవు.

మా దేశములో చాలమంది నీగ్రో జాతి చిత్రకారులు, రచయితలు, ఆటగాండ్రు ఉన్నారు. ప్రఖ్యాతి చెందిన గాయకుడు "మెరియన్ అండర్సన్", బేస్ బాల్ ఆటలో ప్రఖ్యాతి జెందిన "జాకీరాబిన్ సన్" కూడ మాదేశస్థులే. క్రమముగా నీగ్రో జాతివారిలో వైద్యులు, న్యాయవాదులు, ఇంజనీర్లు, రసవాద శాస్త్రజ్ఞులు, ఆత్మతత్వజ్ఞులు మొదలగు వారి సంఖ్య పెరుగుచున్నది. ఉత్తరపు రాష్ట్రములలో 70 కళాశాలలలో అధ్యాపకులుగా నీగ్రో లున్నారు. దక్షిణపు రాష్ట్రములలో 68 నీగ్రో కళాశాలలలోను, విశ్వ విద్యాలయములలోను కూడ నీగ్రోలే ఉపాధ్యాయులుగా నియమింప బడుచున్నారు.

మరియొక క్రొత్త అభివృద్ధి కార్యక్రమము గృహ నిర్మాణము. కేంద్ర ప్రభుత్వ సహాయముచే చిన్న కిమ్మతు

చేయు గృహ నిర్మాణ కార్యక్రమము ప్రకారము అందరు కలసిమెలసి యుండవలెనని యుండగా, అది త్రోసిపుచ్చుట వలన న్యూయార్కు నగరములోను, యితర పట్టణములలోను కూడ క్రొత్త యిండ్లు వరుసలుగా నీగ్రోల ప్రవేశము నిమిత్తమై కట్టబడినవి. తదుపరి నీగ్రోలు, తెల్లవారు కలసి మెలసియున్నారు. ఆ విధముగా నీగ్రోల సమానత్వము కొరకు శాసనములు పరిస్థితుల కనుగుణముగా మార్చబడు చున్నవి. రెండు రాజకీయ వర్గములవారు అనగా పారిశ్రామిక వర్గము వారు, పౌర వర్గము వారు ఈ విషయముపై ఏకీభవించినారు. వర్గములవారు ఇంకను చాలా చేయవలసి యున్నది. నీవు ప్రతీ సంవత్సరము అభివృద్ధి చూడగలవు. ఏ విషయములో గాని ఏజాతిని గురించి గాని విచారణ చేయునప్పుడు అంతా బాగా ఉన్నదా యని అడుగ కూడదు. కాని, పరిస్థితులు క్రమముగా అభివృద్ధి చెందుచున్నవా? లేక అధ్వాన్న స్థితికి వచ్చు చున్నవా యని మాత్రమే అడుగవలెను. పద్ధతి ఏ విధముగా నున్నదీ చూడవలెను. ఆ విధముగానే ఈ విషయములో కూడ చూడవలెను.

కాని, జాతిసమానత్వము కొరకు పోరాడుచుండగా పెట్టుబడిదారీ విధానముపై నీగ్రోలయొక్క పరిస్థితి బాగుండ లేదని నిందించి మనలను మనము సమాధాన పరచు కొనలేము. ఐరోపియను రాజకీయవేత్తలు ఎల్లప్పుడు అమెరికా నీగ్రో సమస్య వైపు దృష్టి సారిస్తూ ఉండుట నాకు ఆశ్చర్యము కలిగించుచున్నది. "ఆహా! మీ నీగ్రోల సంగతేమిటి?" అని

అరచుచుందురు. "అమెరికా పెట్టుబడిదారీ విధానమునకు వ్యతిరేకముగా ఒక విషయం పట్టుకొన గల్గితి" మని అనుకొనెదరు.

కాని, అమెరికా పెట్టుబడిదారీ విధానమునకు దానికి ఏమియు సంబంధములేదు. అది అందులకు విరుద్ధముగా నున్నచో మా ఆర్థిక ప్రతిపత్తి నీగ్రోజాతి కార్మికులను బాధించుట నిజము కాదు. నీగ్రోలు అమెరికా మొత్తం జనాభాలో పదవవంతు మాత్రమే. చాల ఎక్కువ పరిశ్రమలు ఉన్న ఉత్తరరాష్ట్రములలో వారు 5% కంటెకూడ తక్కువగా ఉన్నారు. అమెరికా యొక్క భాగ్యము నీగ్రోలను స్వార్థముకొరకు ఉపయోగించుకొనుటవలన వచ్చినదేయైనచో 23% కు ఎక్కువగా నీగ్రో జనాభాయున్న దక్షిణరాష్ట్రములలో వారి నుపయోగించుకొని భాగ్యోన్నతి పొందియుండ వలసినది. నూటికి సగముపైగా నీగ్రోజాతివారున్న 'మిస్సిసిపీ' రాష్ట్రములో వారు అందరికన్నా ఎక్కువ ధనాఢ్యులై సుఖంచవలసి యున్నది. వాస్తవముగా నీగ్రోలు అల్ప సంఖ్యాకులుగానున్న పశ్చిమ, ఉత్తర రాష్ట్రములలోనివారే బాగున్నారు. దక్షిణపు రాష్ట్రములలో తెల్లవారిలోని అధిక సంఖ్యాకులు పేదవారుగా నున్నారు. 'మిస్సిసిపీ' రాష్ట్రములో తెల్లవారు బీదవారుగా నున్నారు. దక్షిణపు రాష్ట్రములలో నీగ్రోలయొక్క అనైక్యత, దారిద్రయమువలన అచ్చట ఆర్థికాభివృద్ధి మందముగా నున్నది.

నా అభిప్రాయం ప్రకారం—చాలమంది దక్షిణ రాష్ట్రములలోని తెల్లవారికి కోపము రావచ్చును—రంగుజాతుల

ఆర్థిక, సామాజిక అభివృద్ధికంటె వేగముగా ఏదియున్నా దక్షిణపు రాష్ట్రములలోని అధిక సంఖ్యాకులైన తెల్లవారి యొక్క దారిద్ర్యమును నిర్మూలింప జాలదు. నీగ్రోలు తెల్లవారితో సమానమైన కొనుగోలు శక్తి కలిగియున్నారను కొందాము. దక్షిణ ప్రాంతపు నీగ్రోలకు విద్య, ఉద్యోగముల విషయములలో సంపూర్ణమైన అవకాశము లభింప జేసినచో ఉత్పత్తి ఎంతగా అభివృద్ధి చెందునో ఆలోచింపుము. "డాక్టరు రాల్ఫ్‌బంచ్" మానవునియొక్క శక్తులన్నియు జాతి విచక్షణ పోరాటములో వ్యర్థపరచుట చాల విచారకరముగా నున్నదని చెప్పెను. నీగ్రోలను హీనముగ చూచెడి దక్షిణ ప్రాంతపు తెల్లవారు వారి లాభమేమో యోచించుకొనుట లేదనియు, ఈ విషయములో వారి ఆలోచన పెట్టుబడిదారీ విధానమున కింకను అనుగుణంగా లేదనియు నేను నమ్ముచున్నాను.

నీగ్రో సమస్యయొక్క మూలకారణం పెట్టుబడిదారీ విధానములో లేదని మంచి ప్రామాణ్యము గలదు. నాకు సాక్షి లెనిసే. అతడు "అమెరికాలోని వ్యవసాయము, పెట్టుబడిదారీ విధానము" అనెడి తన పుస్తకములో అమెరికాలో వ్యవసాయ పద్ధతి చాలవరకు పెట్టుబడిదారీ విధానముపై అధారముగా ఏర్పాటు చేయబడినదనెను. కాని, అప్పుడు దక్షిణ రాష్ట్రములలోని వ్యవసాయ సేరీలలో అధిక సంఖ్యాకులుగా నుండెడి నీగ్రోల దురవస్థలను గురించి వర్ణిస్తూ యిచ్చట మేము యించుమించు భూస్వామిక విధాన సంబంధమైన పద్ధతిలోనున్నామని చెప్పెను. ఆ విధముగా పెట్టుబడిదారీ విధానముపై

ఇతర లోపములవలెనే నీగ్రోలయొక్క దురవస్థల గూర్చి ఖండించు సామాన్య ప్రచార ధోరణిలో చెప్పెను. ఈ దేశమునకు ఒక్క నీగ్రోకూడ బానిసగా తీసుకొని రాబడకపోయి నట్లైతే ఈ దేశము చాల అభివృద్ధి చెంది యుండెడిదని చెప్పి, నీగ్రోల సామర్థ్యమును నేను న్యూనతపరచ దలచలేదు. కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు మొదలగు దేశములలో నీగ్రో జనాభా యించుమించుగా లేక పోయినను సమాజ పరిస్థితి అమెరికాలోని సమాజ పరిస్థితి వలెనే యున్నది. అమెరికాలోని నీగ్రోలందరు సంపూర్ణమైన సమానత్వము, సౌఖ్యమును అనుభవించు రోజులు వచ్చినప్పుడు దక్షిణప్రాంతములలో తప్ప మా ఆర్థిక విధానములో మార్పేమియు ఉండబోదు. దేశములోని అన్ని ప్రాంతములు, సమాజమంతయు లాభము పొందినప్పుడు విమర్శకులు తప్ప ఇంకెవ్వరును నష్టపోయేవారు లేరు. నీగ్రోలయొక్క పరిస్థితిపై వాస్తవిక విషయములు, మా లోపములను, పరిపూర్ణతను పొందిన ప్రజాస్వామ్య పెట్టుబడిదారీ విధానమునుగూర్చి తెలుసుకొనుటకు ఉపయోగించును. వర్గ, జాతి, మతసంబంధమైన విభేదమేదైనను పెట్టుబడిదారీ విధానముగాక మరియొక్క విధానము అమలులో నుండెడి సమాజములో తరచు కనబడు చుండును. అది పనిచేయుట కుపయోగించును.

# నైతిక సమస్యలు

ప్రియమైన హెన్రీ!

నీవున్నూ, నీ స్నేహితులున్నూ చెప్పెడి మన విజ్ఞాన నైతిక ఔన్నత్యములను చెరచు అనాత్మ వాదము గురించి చెప్పెదనన్న నా వాగ్దానము గురించి జ్ఞాపకముచేసినందులకు ధన్యవాదములు. కేవలము ధనార్జనచేయగోరు ప్రజలు ప్రాపంచిక వస్తు సముపార్జన చేయువారు. మా ఉత్పత్తి, వ్యాపారపోటీ, నూతన మార్గాన్వేషణలలో ఉత్సాహముతో ప్రవేశించినవారు పై వారికి కేవలము మూర్ఖపు అనాత్మ వాదులుగా కనబడెదరు. కాని ఐరోపాలోకూడ ధనము, ప్రపంచములోని మంచివస్తువు లన్నియు ప్రేమింపబడునను విషయమునే మరచిపోలేదు. బహుశా చాలమంది ఈ ఐరోపా దేశస్తులు ఈ విషయముపై కాదని ఒప్పించుటలో అంత నిజాయితీగా లేరు. లేక అట్లు ఒప్పించుటలో అంత బాగా కృతార్థులు కాలేక పోయినారు. ఈ తేడా వారి యొక్క నైతిక, వైజ్ఞానిక ఔన్నత్యముల వలననే వచ్చిన దేమోనని నేను సందేహపడుచున్నాను.

నేను పరిహాసము చేయగోరుట లేదు. చిన్నచిన్న లోపములు చాలవాటికి అమెరికా దేశస్థులపై విదేశస్థులచే ఆరోపింప బడిన నిందలన్నియు నాదృష్టిలో ఆస్థులే అని మీరు గ్రహించియే యుందురు. అవి కేవలము మేము సంకుచిత ఏకజాతి పక్షపాతము అభివృద్ధిచేసే విధానమును, చాల అల వాట్లను సరసతతో వదలివేసితిమని తెలియజేయును.

ఐరోపా దేశస్థులలో చాలమంది ముఖ్యులు. నటనగా అప్రధానమైన కొన్ని మంచి అలవాట్లను ఆత్మవిశ్వాసము కలవారిని అకారణంగా ప్రాధాన్యతతో ఎదిరించుట గురించి నేను ఆలోచించుచున్నాను. ఈ విధంగా చాలదూరం సాగించ బడినది. హిట్లరు ఆలోచనా విడిది నాయకుల ఇండ్లలో నుండెడి "మొజార్ట్" "బీథొవెన్" ల యొక్క గానకళ సంబంధమైన పుస్తకముల తోడను హిట్లరుయొక్క కళాభిమానము ప్రత్యేకించి "వాగ్నర్" యొక్క సంగీతసంబంధమైన పుస్తక భాండాగారము గురించి జ్ఞాపకం చేసుకొనుము.

అటువంటి నీతిబాహ్యమైన, కపటపు విజ్ఞానము అమెరికాలో బహుతక్కువగా నున్నది. అక్కడ నిజాయితీ, ఒక విధమైన నైతిక బాధ్యత ఉన్నవి. దీనికంతకు మూలము మతము నైతికశక్తులలో నున్నది. 'మాక్స్ వెబ్నర్' ఒకప్పుడు అమెరికా దేశపు పెట్టుబడిదారీ విధానముయొక్క మూల కందము. పై మతముయొక్క ప్రభావము ముఖ్యంగా పవిత్రమతస్థుల మరియు క్వేకర్ల యొక్క ప్రభావము గూర్చి వివరించి చెప్పెను. అమెరికాలో వర్తకమునందు, ఉత్పత్తిలోను సాధించబడిన విజయం చాలవరకు ఆ దేశ మందలి ప్రజలు మతము, నైతిక పథములయందు నిర్లక్ష్యము చేయకపోవుటవలనను,సాంఘికధర్మములందు, బాధ్యతలందును గట్టి నమ్మక ముండుటచేతనే అని అతడు కనిపెట్టెను.

ఇప్పుడు నీకు వారిని గురించి గొప్ప చెప్పుచున్నట్లు కనబడవచ్చును. అందుచేత అమెరికాలోని వర్తకులు,

పారిశ్రామిక యజమానులు అందరికంటె నైతికముగా మిన్నయని చెప్పగోరుట లేదని మరియొకమారు చెప్పు చున్నాను. వారు అమెరికాలో ఎంత ఐక్యతతో నుందురో యింకెచ్చట నైనను అట్లే ఉందురు. వారి వ్యక్తి గత ఋజువర్తనము లెట్లున్నను అమెరికా దేశస్థులు అధిక సంఖ్యాక ఐరోపా దేశస్థులకంటె వేరు విధముగా నడచు కొనెదరు.

ఐరోపాలో చాలవరకు సాంఘిక సంస్థలు ప్రభుత్వము చేతనో, ఒక తెగవారిచేతనో స్థాపింపబడి యుండగా, అమెరికాలో అటువంటివి చాలభాగము స్వంత మూలధనముల వల్లనో లేక వ్యక్తులయొక్క మరణ శాసనముల ద్వారా వచ్చిన ధనమువల్లనో స్థాపింపబడి నిర్వహింప బడుచున్నవి. అమెరికా దేశములో ఏ వ్యక్తి కావ్యక్తి తనంతటతానే ఎక్కువ పెద్ద మొత్తములు చందా వేసుకొనేటంత దేశ మింకొక టేదియు లేదను కొనెదను.

అమెరికాలోని "అమెరికన్ కామన్ వెల్తు" ప్రతికలో జేమ్సుబ్రైసు వ్రాసినట్లుగా "ధనము ఒక పూచీతో ఒప్పచెప్పబడినదిగా" అనుకొందురు. అట్లు యిచ్చేవాని స్వాభిలాషయే ఆ దానముయొక్క పరిమితిని తెలియ జేయును. ప్రజలు తరచుగా వారిచ్చెడి ధనముతో బాటు, వారు ప్లాను వేయుటలోను, మూలధనము నభివృద్ధి చేయుట లోను, చికిత్సాలయములు, కళాశాలలు, పుస్తక భాండా గారములు మొదలైనవాటి ప్రతిష్ఠాపనా కార్యక్రమము

లోను, యింకను ఎన్నో లెక్క లేనన్ని సంఘవిద్రోహ శక్తుల నెదుర్కొను కార్యక్రమములలోను కూడ సహాయము చేయుదురు.

కాని, సంఘ బాధ్యత ధార్మిక సంబంధముగా కాక మరి యొక విధముగాకూడ కనబడును. గడచిన శతాబ్దములలో వర్ణ ప్రాధాన్యతతో నున్న సమాజములో ధనమును ఆర్జించిన వాడు దేశముయొక్క ధనములోనుండి తన సొత్తును తన కుటుంబ అనుభవము కొరకే తీసి వేరుగా జాగ్రత్త పెట్టు కొనుటకు ప్రయత్నించునని ఇదివరలో నేను చెప్పియున్నాను. అతని ఐశ్వర్యము ఉత్పత్తి నెంత మాత్రము చేసెడిదికాదు. ఆ విధముగానే అతని భవనము, లేక కోటకూడ ఉత్పత్తికి ఉపయోగింపబడలేదు. బాధ్యతా రహితముగాను, వ్యర్థముగా నుండెడి ధనము చాలవరకు ధనికులవద్దనే యుండెడిది. ఈ రోజులలో ప్రపంచములో ఆర్థిక విషయములో హిందు దేశపు రాజులు, అరేబియా దేశపు చక్రవర్తులు, షేకులు వారి చుట్టూవున్న ప్రజలు దుర్గంధ పూరితమైన తావులలో వ్యాధిగ్రస్తులై వుంటూ వుండగా వారు వారి పాతకాలపు దర్జాలలో వెలుగుచుందురు.

తేడా చూచినచో అమెరికా దేశపు పెట్టుబడిదారు పౌర బాధ్యతలను గుర్తించిన లోకోపకారి కానిమ్ము, లేక కఠిన హృదయుడై అహంభావము కలవాడు కానిమ్ము, అతడు ఆర్జించిన లాభములలోని చాలమొత్తము దేశముయొక్క ఆర్థికాభివృద్ధికి వినియోగించును. దేశము అతని ధన సహాయ

ముతో కార్యసాధన చేసి వృద్ధిపొందును. మా పెట్టుబడిదార్లకు ఈ అలవాటు అదృష్టవశమున కలిగినది కాదు. అవి పవిత్ర క్రైస్తవ మత సిద్ధాంతమునుండి పుట్టినట్లు కనబడుచున్నవి. ఆ సిద్ధాంతము ప్రకారము ఎవ్వరైనను ధనము కూడబెట్టిన ధనములోని కొంత భాగమును తన స్వంత కర్చులకు కాకుండ మరియొక విధముగా వినియోగించ వలెను. అసలైన పెట్టుబడి దారీ విధానములో ఒక విధమైన స్వార్థ రహితము గలదు. పెట్టుబడిదారు యించు మించుగా తన ఆదాయమునంతను తన ప్రస్తుతావసరములను మానుకొని తన వర్తక మభివృద్ధి చెందునని తలచి తిరిగి తన వ్యాపారమునకే వినియోగించును.

బహుశా నీకు యిందులో మంచి ఏమియు కనబడక పోవచ్చును. "ఆ పెట్టుబడిదారు త్వరగా లబ్ధిని పొంద గోరుచున్నాడు. అంతే కాదా?" నీ వనుకొనెడిది సత్యమే. పెట్టుబడిదారు ఎల్లప్పుడు నష్టమును అనుభవించుటకు సిద్ధ ముగా నుండుననెడి విషయము ఇప్పటికి ఎవ్వరున్నూ చెప్పక పోయినప్పటికిన్నీ, అతడు పెద్ద నష్టములనుకూడ పొందును. ఏ విధముగానైనను పెట్టుబడినుండి ధనము తీసివేయుటకు బదులు, పెట్టుబడి పెట్టుచు, యింకను తిరిగి ఎక్కువగా పెట్టుబడి పెట్టుచూ వుండుట "బాధ్యతతోకూడిన ధనము"యొక్క మరియొక లక్షణము.

పెట్టుబడిదారు ఉత్పత్తి పెరుగునట్లును, వాటి ధరలు తగ్గునట్లును చూడవలసిన విధి ఆతని బాధ్యతలలో యిమిడి యున్నది. ఈ బాధ్యత కార్మికులపైనను, దేశము అంతటి

పైనను ఉన్నది. తన సరుకులను వాడెడివారిని సంతృప్తి పరచుటకు గట్టిగా కృషిచేయుని వ్యాపార సంస్థ త్వరలో ఎత్తివేయవలసి వచ్చును. వ్యాపారములో పోటీ పెట్టుబడి దారుని ఆతని కాలి బొటన వ్రేళ్ళపై నిలుపును. ఐరోపాలో కంటె యిది అమెరికాలో ఎక్కువ పటుతరముగా నున్నది. మా వర్తకులు, యింజనీర్లు అవాట్లను తక్కువగా పట్టింపు చేసుకొనే వారేకాక క్రొత్త మార్గముల నన్వేషించువారు. మా వస్తు వినియోగదారులు తక్కువ ఖరీదులకు ఎక్కువ మంచి వస్తువులు దొరకవలెననెడి వారు కారు. మా కార్మికులు అధికోత్పత్తి, ఉత్పత్తి ఖర్చులను తగ్గించెడి యంత్ర సామగ్రి నుపయోగించుటకు సహకరింతురు.

ఎక్కువ ముఖ్యమైన విషయము, వేరు వేరు మానవులను వేరు వేరు విధములుగా చూచెడి జాతిప్రధానమైన సమాజము. అగ్రజాతిలోని మానవునకు అటువంటి కృత్రిమమైన అసమానత్వం అనగా ఆతడు తన అంతరాత్మను చంపుకొన వలెను. ఆతని హృదయము ఆ బాధతో కాయకాచి పోవును. అటువంటి సమాజము సహజంగా బీదవారి నందరిని ముష్టి వారుగా నున్నట్లు కనుగొనును. అందలి ధనాఢ్యులు వారికి ముష్టివేయుటవలన తమ సహజమందలి బాధ్యతను నెర వేర్చినట్లు తలతురు. కాని అటువంటి నటనాప్రాయమైన పనులు ఆ ఆపదయొక్క మూలకారణమైన జాతి విచక్షణా విధాన మును, దానియొక్క ప్రభావముచే కల్గెడి పశుప్రాయమైన నీతిబాహ్యమైనటువంటి పనియైన ప్రజలలోని అగౌరవము

చూపుట తద్వారా స్వాభావికంగా వచ్చెడి ఉత్పత్తిలోని తగ్గుదలను సరిదిద్దుటకు బదులు అట్టి ఆపదయె పైకగుపడెడి లక్షణములను ఉపశాంతి పరచుటకే మాత్రమే పనికివచ్చును.

తనయొక్క జాతివాడు దారిద్ర్యములో నుండుటచూచి బాధపడెడు పెద్ద భూస్వామి తనరైతులు ఆకలితో మాడు చున్నను, చినిగిన పిరిగుడ్డలతో అల్లాడుచున్నను ఏమియు బాధ పడెడివాడు గాడు. ఆతని దృష్టిలో నిమ్నజాతులు దారిద్ర్య ములో బాధపడవలసినదే. కూలివారు, వారిపై పెత్తనము చేసెడి యజమానులు ఉండవలసినదే. ఈ రెండు అధికార ములు యింకను ముందుకు వెళ్ళినవి. అగ్రజాతులవారి దృష్టిలో నిమ్నజాతులువారు నేరస్థులనియు వారిని శిక్షించు హక్కు వారి కున్నదనియు తలచెడివారు. సామాన్య మానవుడు కలహములో ఇంకొకనిని చంపినచో వురితీయబడెడివాడు. కాని, ఒక అగ్రజాతివాడు ఒక వనితను చేబట్టుటకు ఆమెనే ప్రేమించిన మరియొకనిని చంపినను ఆతనికేమియు శిక్షలేదు సరిగదా సంఘంలో గొప్ప గౌరవంకూడ కలుగును. ఒక భూస్వామి తనరైతు భార్యను చెరచినచో అది వ్యభి చారమనిపించుకొనదు. కాని, ఆ రైతు ఆ భూస్వామి భార్యను చెరచినచో అది వ్యభిచారమని పిలువబడును. జర్మనీలోని బందిపోటు ప్రవీణులను చూడుము. వారికి చుట్టుపట్లవున్న పట్టణములనుండి ప్రయాణముచేసెడి వారిని త్రోవ తప్పించి వేయుట యొక క్రీడ. బహుశా స్త్రీ పురుషు లను బానిసలుగా వారి యజమానులు వారి యిష్టమువచ్చిన

వారికి ఒప్పగింత పెట్టుటకూడ ఒక క్రీడ అనుకొనెదను. అగ్ర జాతివారిలో నీవు చెప్పినట్లు ఒక లోపమున్నది. "నీవు ఎవ్వరిని చంపకూడదు. ఎవ్వరిసొత్తున్నూ అపహరించ కూడదు" అనెడి కట్టుబాటు కొద్ది మినహాయింపులతో నున్నది.

ప్రాచీనకాలపు అగ్రజాతివారి గొప్పతనము, యితరుల యొక్క స్వాభావికముగా వచ్చిన న్యూనత అనెడి అబద్ధము యితర నీచతలపులకు, నేరములకు కారణమైనవి. జాతులను, మతములనుబట్టి బాధించుట, పరస్పర కలహముల వలన వచ్చిన యుద్ధములు మొదలైనవి, సమాజములో వచ్చెడి దౌర్జన్య కాండలు, జాతి ఆధిక్యత అనెడి అహంభావమువలన వచ్చినవే. ఈ శతాబ్దములోనే ఈ విభేదము చాలవరకు పెరిగి, బానిసత్వము పెరిగిపోయినది. ఇట్టి పరిస్థితులు చూచిన మానవులెల్లప్పుడు మానవులు కారనియు, నైతిక చట్టము ఎల్లప్పుడు పనికిరాదనియు తేలుచున్నది.

అమెరికాలోకూడ కొద్దిమంది క్రూరు లున్నారు. కాని, మేము జాతివిచక్షణకు వ్యతిరేకులము. న్యాయస్మృతిలోను, నైతిక ధర్మశాస్త్రములోను తత్సంబంధమైన ఏలోపములేకుండ చేయవలెనని ఒట్టుపెట్టుకొన్నాము. అందుచేతనే నీగ్రోసమస్య పరిష్కరింపబడనిదే మేము విశ్రమించము. అబ్రహాంలింకన్ "నేను బానిసగా వుండదలచలేదు; నేను యజమానిగా నుండదలచలేదు." అని వర్ణ విచక్షతవలన కలిగ సమాజ పతనము గూర్చి చెప్పెను. ఆ నైతిక దురలవాటును ఎదుర్కొనుటవలన, తార్కికముగా చూచినయెడల, వెంటనే మనము

మానవసమాజముయొక్క అభివృద్ధికి మార్గమేర్పరచుటయే గాక, ఆర్థికాభివృద్ధికి దోహదముచేయుట యగును. 'టెనెస్సీవాలి' అథారిటీకి అధ్యక్షుడుగానుండి, తరువాత అణు శక్తి సంఘాధ్యక్షుడుగానుండి అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన డేవిడ్ లిలియంథాల్ ఈ విధముగా చెప్పియున్నాడు: (ఈవిష యమును నేను నమ్ముచున్నాను): "మా ఆర్థిక విజయము... మాయొక్క ధార్మిక, నైతిక ఔన్నత్యము వలనను, ప్రజా స్వామికపు హక్కులయందుంచెడి నమ్మకమువలనను సాధిం చబడినది." ఆర్థికాభివృద్ధి సాధనకంటె నైతికోన్నతి సాధన చాల ఎక్కువైనది. ప్రాచీనకాలపు వ్యక్తి స్వాతంత్ర్య మంగీకరించెడి స్వతంత్రులు ఆర్థిక సమస్యను సక్రమముగా నడపగలిగినచో నైతిక సమస్యలు సర్దుకొని పోగలవని నమ్మెడివారు. అమెరికా దేశములోనివారు యిందుకు పూర్తిగా విరుద్ధముగా చేసినారు. వారు నైతికసమస్య అయిన వర్ణవిభేదమును ప్రధానసమస్యగా తీసికొని తరువాత దేశమంతటికి అభివృద్ధి తీసికొని వచ్చిన ఉత్పత్తి సమస్యను పరిష్కరించిరి.

జాతి మత విచక్షణ సమస్యల నెదుర్కొనుచున్నప్పుడు అమెరికా దేశస్థులు వారి పాత పద్ధతులను విడచిపుచ్చుటకు అంగీకరించలేదు. అట్లు వారు 'మార్క్సు', 'లెనిన్'ల సిద్ధాంతములనుకూడ విసర్జించిరి. వారు వర్గవిచక్షణతా పోరాట సమస్యలోనే నీతి బాహ్యమైన బీజము లున్నవని తలంతురు. నీవు, నేను కూడ ఆ జాతి విచక్షత, బానిసత్వములకు ఒప్పు

కొనము. అదికూడ ఒక విధమైన ద్వివిధ ప్రమాణముల నేర్పరచి నైతిక ధర్మబలమును అదుపులో నుంచును. ఆ పార్టీ హక్కు, సరియైన రక్షణ లేకుండా చట్టము మేర నతిక్రమించి వెళ్ళిననెడి వేరభిప్రాయము గలవా రుండవచ్చును. వాస్తవముగా అట్లే కావచ్చును. అభిప్రాయ భేదములు, తగవులు, అసహనము, అసూయత అభివృద్ధి చెందిన కొలదిన్నీ నైతికకట్టడులనుండి తప్పింపమని జాతి విచక్షణా పోరాటంలో పోరాడెడి యోధులు కోరుచుందురు. ఈ విషయములో అటువంటి భేదమేమియు లేదు. ఇప్పుడు నిమ్నజాతులవారు అగ్రజాతులవారితో పోరాడుచున్నారు. ఈ పోరాట మెంత ఎక్కువగా నున్న అంత ఎక్కువగా నైతిక ఆందోళన యుండును.

నైతిక ధర్మములయొక్క, మతముయొక్క ప్రాబల్యమును తగ్గించెడి ఏ విధానమైనను నమసిపోవలసినదే. ప్రతి మానవుడు తానే బలవంతుడ ననియు, తానే అతి తెలివైన వాడననియు అనుకొని రాజకీయములలోనేకాకుండ, మతములోను, అన్ని శాస్త్రముల్లోను మంచి, చెడ్డలను ఇతరులకు చెప్పును. సామాన్యముగా తెలివైనవాడు జీవితంగురించి దేశం, అందలి ఉత్పత్తి, ఉత్పత్తి వినియోగము, పంపకము, ఆ దేశపు రాజ్యతంత్రం, పని, విశ్రాంతి మొదలైన విషయములపై ఆలోచించుచుండును. అతని ఆలోచనలు సరియైనవి, దృఢమైనవి కానప్పుడు అవి విధిగా నాశనమగును.

అమెరికాలో వర్గ విచక్షణారహితమైన సమాజమే తమ లక్ష్యమని మతము, నైతిక ధర్మముల ప్రాధాన్యతను

గుర్తించుచు స్వాతంత్ర్య ప్రకటనలో ఈ విధముగా చెప్ప బడినది :—"మానవులందరు సమానముగానే సృష్టింప బడినారు. భగవంతునిచే అందరికి కొన్ని హక్కులు, జీవితము, స్వాతంత్ర్యము, సుఖేచ్ఛ ప్రసాదించబడినవి. అనాత్మవాదము, దుర్నీతి అనెడి ఈ రెండు శక్తులును, ఈ మాటలు రెండింటిని సజీవముగా సాగించవలెనని గట్టిగా ప్రయత్నం చేసెడి దేశా లన్నింటిని ఎదుర్కొనునా? ఈ విషయంలో గట్టిగా ప్రయత్నించి అడ్డగించెడి అమెరికాలో అవి ఏమైన చేయగలవా?

# సామ్రాజ్యవాద యుద్ధోన్మాదము

ప్రియమైన హెన్రీ !

నీవు "అమెరికాయొక్క సామ్రాజ్యవాదము, మరియు యుద్ధోన్మాదము" అనే ప్రశ్నను యిప్పటివరకు వాయిదా వేయు అంగీకరించినందులకు నేను సంతోషించుచున్నాను. అమెరికాలోని ఆర్థిక సామాజిక అభివృద్ధి విధానముయొక్క స్వభావముగురించి వర్ణించ ప్రయత్నించుటకు ముందు నేను దానికి సమాధాన మివ్వ లేకపోయియుండెడి వాడను.

సరే; యిప్పుడు తొందరగా చేయబడిన ఆరోపణను మనము పరీక్షింతము. "యుద్ధోన్మాదమా!" మొట్టమొదటనే అది తెలివితక్కువ అభిప్రాయమని చెప్పగోరు చున్నాను. ఈ రోజున ఎవ్వడున్నూ యుద్ధోన్మాదుడు కాడు. స్టాలిన్‌కూడ యుద్ధోన్మాదుడు కాడు. దాని పరిణామము చాల నష్టదాయకమైనది. ఆ విషయములో ఆరోపణలు, మరియు ప్రత్యారోపణలుకూడ యున్నవి. ఐనప్పటికి ప్రపంచములోని ఏ బాధ్యత కలిగియున్న రాజకీయ వేత్తకూడ తన ప్రజలను యుద్ధమునకు పురికొల్పడు. రష్యాకూడ మిగతా ప్రపంచముతోపాటు క్రిందటి మహాసంగ్రామములో తిన్న దెబ్బలను స్మరణచేసుకొంటూ, అంతిమ విరోధముకొరకు ఆతురతగా ఉంటూ ఈ లోపున తన సామంతులను యుద్ధమునకు సన్నద్ధము చేయుచుండవచ్చును.

కాని, ఈ చర్చలో మనము అమెరికా ఆత్మరక్షణే ప్రధానముగా తీసికొన్న దనుకొందము. నీవు ఒక దేశము

యొక్కగాని, ఆదేశ నాయకులయొక్కగాని గుణగణములను విచక్షణచేయునప్పుడు ఒక వ్యక్తియొక్క గుణగణములను పరీక్షించినట్లు చేయుదువు. నీవు ఆతని నడవడి, ఆతని పరిస్థితులు, యిదివరలో ఆతని నడవడిగురించి విచారింతువు. అమెరికా నీ దృక్పథములో పరిశీలించినచో ఈదేశమున కటువంటి పరరాజ్యములపై దండెత్తవలెననెడి తలంపు లేదని తేలును.

జాతి విభేదనా పద్ధతిపై జరిగెడి పరిపాలననుండి బయటపడి ప్రజాస్వామ్యము ననుభవించుచు వృద్ధిపొందుచున్న అమెరికా దేశమే శాంతి కాముకత్వమునకు తార్కాణము. విద్య, వృత్తులనుబట్టి అమెరికా పౌరులు పూర్తిగా యుద్ధమునకు విముఖులు. క్రిందటి సంగ్రామములో అమెరికా సైనికులు ప్రపంచములోనికెల్ల యింటిపైననే భ్రాంతిపెట్టుకొని విచారముగానున్న వారని పేరుపొందిరి. అమెరికా దేశస్థులు యుద్ధమువలన హెచ్చుగా నష్టపడెదరు. వారి కావిషయము తెలియును. ఏ యుద్ధకాముకుడును అందుకు వ్యతిరేకముగా వారిని త్రిప్పలేడు.

'నీతో అమెరికా యుద్ధమునకు దిగవలెనా అక్కరలేదా? అనెడి విషయము అమెరికా విదేశాంగ శాఖవారు చెప్పలేరు' అని ఎవడైనను చెప్పినచో ఆతనికి వాస్తవిక విషయములు తెలియవని మాత్రమే చెప్పవలయును. కాంగ్రెసు, శాసన సభ్యులు, అధ్యక్షునితో సహా అందరూ ఎన్నికల సమయములోనే కాకుండ ఎల్లప్పుడు ఈ విషయమును గురించి చెవి

యొగ్గి వినుచుందురు. మరియు ఏదేని ఒక సమస్యపై చాల మంది సభ్యులు వ్యతిరేకతచూపినచో వారు చాల జాగరూకులై యుందురు. అమెరికా దేశస్థులు శాంతిని కాంక్షించుచుందురు. అందుచేతనే వారెన్నడును యితరులపై దాడి చేయవలెనని తలంపరు. (కాని వారిపై ఎవ్వరైన దాడిసల్పినచో ఎదురుదెబ్బ కొట్టుదురు.)

ఇందుకు భిన్నమైన నియంతృత్వమును గురించి ఆలోచింపుము. కేవలము ఒక రాజ్యాధిపతి అధికమైన హక్కులు కల్గిన ఒక వర్గమువారి మద్దతుతో అధికమైన అధికారము చేకొని రాజ్యమును పరిపాలించుచుండును. ఇంగ్లండు దేశపు ప్రఖ్యాతిగాంచిన తిరుగుబాటు గురించి వివరించిన గొప్ప తత్వజ్ఞుడు, అమెరికా దేశపు తిరుగుబాటుకు మూలాధారమైన వాడు అయిన జాన్ లాక్ ఎక్కువ క్రూరత్వమే "ఒక విధమైన యుద్ధ"మని చెప్పెను. స్వదేశములో విజయవంతముగా నెరవబడిన అట్టి క్రూర ప్రభుత్వ పద్ధతులే విదేశములో కూడ ఉపయోగించి చూడవలెనని కోరిక కల్గించును. అట్టి దేశము దేశములను దోచుకొనవలెననెడి తలంపుతో యుద్ధము చేయక పోయినట్లైతే, రాజ్యాధికారము నెలకొల్పుట కొరకు యుద్ధము చేయును. అటుల కానియెడల తన దేశములోని అసంతృప్తులను యితర దేశములపై దాడిచేయ పురికొల్పును.

అటువంటి ప్రభుత్వము స్థాపింపబడి నప్పటినుండియు దండయాత్రచేయ నాలోచింపకపోయిననూ యుద్ధ విషబీజ

ములను కలిగించుచును. ఒక వైపునుండి జరిగెడి అక్రమములు, హింస వేరొక వైపునుండి వచ్చెడివాటి పరిణామములు కొంచెము దగ్గరగనో దూరముగనో, అంతఃకలహములకు దారి తీయును. ఈ అంతఃకలహము తమ దేశములోనే కాక, దాని సరిహద్దునుకూడ దాటి వ్యాపించవచ్చును. తరచుగా అంతఃకలహము ఒక మతముకొరకో, జాతికొరకో, ఒక విధానము కొరకో, లేక వీనిని వ్యతిరేకించుట కొరకో జరిగెడి యుద్ధముగా పరిణమించును. ఆంతరంగికముగా దేశములోని హింసకు కారణములను, అతివాద పద్ధతిని నిర్మూలించుటవలన స్థిరమైన ప్రజాస్వామిక మేర్పడి ప్రపంచమునకు శాంతి నిచ్చును.

కాని, సామ్రాజ్యవాద యుద్ధోన్మాదము అనెడి నిందారోపణ అర్థము లేని దని నిరూపించుటకు అమెరికా దేశపు విధానము లున్నవి. అమెరికాలో యిదివరలో మానవులు మానవుల నుపయోగించుకొని పొందిన అభివృద్ధికి బదులుగా యిప్పుడు మానవుడు ప్రకృతి నుపయోగించుకొని అభివృద్ధి పొందుచున్నాడన్న విషయం నీవు కాదనలేవు. ఈ మార్పువలన ధనికుల, కార్మికుల సామాజిక పరిస్థితులలో గొప్ప మార్పు కల్గినన్న విషయమునుకూడ నీవు కాదనలేవు. విదేశములలో నెరపెడి సంబంధములలో మేము మానవుల నుపయోగించుకొన దలచలేదు అని స్పష్టముకాదా? విదేశములను కొల్లగొట్ట దలచలేదని ఋజువగుటలేదా?

అమెరికన్లు తమ ధన, మాన, ప్రాణములకు నష్టము కలుగ చేసుకొనరు. ఏ తలంపుచేత ధనాభివృద్ధికై అమెరికా తన్న కంటె బీదస్థితిలోనున్న దేశములను దోచుకొనవలెను?

అమెరికా దేశస్థు లందరూ యుద్ధమును తప్పక త్రుణీకరింతురు. వాదన కొరకు అమెరికాలోని కొంతమంది పెట్టుబడిదారులు మా దేశ ప్రజలను ఉపాయములవల్ల నూసగించి యుద్ధములోనికి దింపిరను కొందము. వారి తలంపులు అర్థశాస్త్రానుబంధమైనవిగా నుండవలెను. అప్పుడు ఉత్పన్నమయ్యెడి ప్రశ్న ఏమంటే : "అమెరికాలోని పెట్టుబడిదారీ విధానము అటువంటి తలంపులను పుట్టించునా? అటువంటి తలంపులే వారికి కలిగినట్లైతే అవి వారిని అథోగతికి పాల్జేసి నామరూపములు లేకుండ చేసివేయునా?

యుద్ధమునకు దిగునప్పుడు మా పెట్టుబడిదారులకు కలిగెడి ఆర్థిక సంబంధమైన తలంపులను గురించి మనము కొంచెము పునః ఆలోచింతము. అందులో మొట్ట మొదటిది ఎక్కువగా చాటించి చెప్పబడెడి "యుద్ధపు సామానులను ఉత్పత్తిచేసి అధిక లాభములను సంపాదించుట" అనెడిది. సరే మంచిది, తరువాత అటువంటి లాభములు యింకొక తరములో వచ్చెడివి. ఇప్పుడు వాటినిగురించి తలంచుట గతమును గురించి స్మరించుటవంటిది. క్రిందటి సారి యుద్ధములో అమెరికా మొట్టమొదటి మారుగా యుద్ధపు సంబంధమైన కంట్రాక్టులలో ఒక విధమైన సమాధాన పద్ధతి నసులులో పెట్టినది. దానివల్ల ప్రభుత్వమునకు కావలసిన ఏ సరకులకై

షను స్వల్ప లాభములు మాత్రమే మిగులు చుండెడివి. చాల రకముల వస్తువులు మొట్టమొదటి సారిగా హెచ్చు సంఖ్యలో ఉత్పత్తి చేయవలసి వచ్చుట చేతను, అవి క్రొత్త పద్ధతిలో ఉత్పత్తి చేయవలసి వచ్చుట చేతను చాలవరకు బేరములు గురించి ఊహాగానము చేయవలసి యుండుట చేతను ఈ పద్ధతి అవసర మాయెను. క్రొత్త సమాధాన పద్ధతి ప్రకారము 10,4361,37,000 డాలర్లలోను చాలా భాగము క్రితమే వస్తూత్పత్తి దార్లు లేక కంట్రాక్టర్ల కాతాలకు జమ కట్టబడిన లేక వారికిచ్చి వేయబడిన బాపతుసొమ్ము ప్రభుత్వ మువారిచే వసూలు చేయబడినది. ప్రస్తుతపు హెచ్చుస్థాయిని ఉత్పత్తి చేయబడెడి యుద్ధ సామగ్రి, అది అట్లు చేయబడెడి విధానము విషయములో సోవియట్ విదేశాంగ శాఖను అభినందించగలవు. ఏలనన, ఆదేశములో పైన చెప్పబడిన క్రొత్త సమాధానపద్ధతి విషయ మొచ్చి నందులకు చెప్పుచున్నాను. అనాలోచితముగా ప్రవేశ పెట్టబడినది.

పై విధముగా తగ్గింపు లన్నియు చేయబడిన తర్వాత మిగిలెడి లాభములపై హెచ్చుగా పన్ను వేయబడెడిది. దామాషాయైన శాంతి సమయములో ఒక వ్యాపార సంస్థకు వచ్చెడి లాభముకంటె యుద్ధ కాలములో వచ్చెడి హెచ్చు లాభములపై కొద్దిపాటి మినహాయింపులతో నూటికి 95 వంతున పన్ను విధించబడెడిది. ఇంతేకాక, పెట్టుబడి దారులు వ్యక్తులుగా హెచ్చు ఆదాయపు పన్ను కట్టవలసి యుండెడిది. వారికి కొద్దిపాటి లాభములే మిగులు చుండె

డివి. కాని, యుద్ధానంతరము కూడ శాశ్వతముగా హెచ్చు చేయబడుచుండెడి పన్నుల భారమే వారి కన్నిటికంటె ఎక్కువ బాధ కలిగించినది. ఆ విధముగా 1939లో పెండ్లి చేసుకొని యిద్దరు పిల్లలు కలిగియుండి 20,000 డాలర్ల ఆదాయము వచ్చెడు వ్యక్తి 1,469 డాలర్లు కేంద్ర ప్రభుత్వమునకు ఆదాయపు పన్ను కట్టవలసి వచ్చెను. యుద్ధం ఆఖరులో అనగా 1944–1945 సంవత్సరములలో అదే రాబడిపై రాబడి పన్ను 6.200 డాలర్లు వరకు కట్టవలసి వచ్చెను. యుద్ధానంతరం అనగా 1946–1947 సంవత్సరములలో ఆ పన్ను 5,890 డాలర్లకు తగ్గించబడినది. 1948–1949 లో తిరిగి 3,888 డాలర్లకు తగ్గించబడినది. కాని, మరల 1951 లో ఆ పన్ను 4,464 డాలర్లకు హెచ్చింప బడినది. (అది యింకను హెచ్చు అయివుండ వచ్చును.)

అనగా ఒక మనుష్యునకు ఆతడు, ఆతనిభార్య, యిద్దరు పిల్లలు ఉండి 1,00000 డాలర్ల ఆదాయము వచ్చిన వానికి పై లెక్క ప్రకారము రాబడిపన్ను పైన చెప్పిన సంవత్సరములకు ఈ విధముగా నుండును: 31,997 డాలర్లు; 65,580 డాలర్లు; 62,301 డాలర్లు; 45,642 డాలర్లు; 1951 వ సం॥ లో 51,912 డాలర్లు. (యిది యింకను ఎక్కువగానుండి యుండవచ్చును.)

అతి తక్కువగా నున్న యుద్ధానంతర పన్ను వరబడులు యుద్ధము క్రితము వాటికంటె చాలహెచ్చుగా నున్నవి. కనుచూపు మేరలో యివి తగ్గు సూచనలుకూడా లేవు.

ఈ విషయమును నీవు గమనించియే యుందువు. ఇదంతయు కాక ప్రతి వ్యక్తి రాష్ట్రప్రభుత్వమునకు సంబంధించిన, స్థానిక సంస్థలకు సంబంధించిన కొన్ని పన్నులను కట్ట వలయును. రెండవ ప్రపంచ సంగ్రామం వచ్చి శాంతి సమయంలో నుండెడి పన్నుల వరుబడిని యింతగా పెంచి యుండగా యింకొక ప్రపంచ సంగ్రామం వచ్చినచో మా పెట్టుబడిదారుల సంగతి ఏమి కావలసినది? బ్రహ్మాండమైన లాభముకాదు. కాని, వాస్తవముగా వారు గొప్ప నష్టము పొందవలెను. వారి వారి స్వలాభము కొరకు కోరవలసినదేమన "శాంతి". అంతే వారు ఆశించెడిదికూడా.

ముడిపదార్థములకొరకు, స్వల్ప వేతనములకు వచ్చు కూలీలకొరకు చేసెడి అన్వేషణ ఏమిటని నీ వడుగవచ్చును. బాగానే ఉన్నది. కాని, అమెరికా కావలసినంత, లేక అంతకంటె ఎక్కువగా ప్రతీ ముడిపదార్థమును ఉత్పత్తిచేయును. యుద్ధకాలంలో యించుమించుగా బాగా దొరకనటువంటి తగరము, రబ్బరు అనెడి రెండు పదార్థముల విషయము నేను ఎరుగుదును. మేము దక్షిణ అమెరికానుండి కొంత తగరమును దిగుమతి చేసుకొంటిమి. చాలవరకు దానికి బదులు యితర ముడిసరకుల నుపయోగించుకొంటిమి. రబ్బరు విషయములో మేము కొంతకాలము యిబ్బందిపడవలసి వచ్చినది. కాని, తరువాత వేగముగా రబ్బరు ఉత్పత్తి నధికముచేసికొంటిమి. సంయోగ రూపమున నుండెడి రబ్బరును ఎక్కువ పరిమాణములలో తక్కువ ధరలకు కిట్టునట్లు ఉత్పత్తి చేసి

కొంటిమి. అందుచేత, ఇకముందెన్నడును మా కటుపరిశ్రమ రబ్బరు కొరత ఉండదు.

స్వల్ప వేతనములకు వచ్చెడి కూలీల విషయంలో మా పెట్టుబడిదారులలోనున్న ప్రతికూల శక్తులు కొన్ని విదేశముల నుండి కూలీలను వలస రప్పించుట కిష్టపడలేదు. వాస్తవముగ వారే నిరుద్యోగులను పనిలో చేర్చుకొను విషయమునకు సంబంధించిన చట్టములను అమలు పరచుట కడ్డునచ్చిరి. అదే సమయమున రష్యావారు చైనాదేశపు కూలీలతో సైబీరియాలో పనిచేయు నిమిత్తము ఒప్పందము చేసికొనిరి. మరియు నిర్దయగా వేలకొలది జర్మనీదేశపు నిపుణులను, ప్రవీణులైన కార్మికులను సోవియట్ సరిహద్దు వద్దకు ఓడల మీాద ఎగుమతి చేసిరి. ఆశ్చర్యముతో చెప్పుచున్నాను అనుకొనుము. అమెరికా దేశస్థులు విదేశములలో పనివాండ్రను పనిలో నియోగించినప్పుడు తరచుగా స్థానిక కార్మిక వేతనముల ప్రమాణమును తారుమారుచేయు నుద్దేశ్యముతో వారికి బహు స్వల్ప వేతన మివ్వవలసినప్పుడు చాల ఎక్కువగా యిచ్చుచుండిరని విమర్శించుచుండెడివారు.

మా అధికోత్పత్తిని విక్రయించు నిమిత్తము, క్రొత్త మార్కెట్టులను ఆకర్షించు నిమిత్తము మా పెట్టుబడిదార్లు గట్టి ప్రయత్నము చేయుచున్నారని, అది యితర దేశములపై దండయాత్ర చేయు తలంపుచే చేయబడుచున్నదని

మరియొక ఆరోపణ. అమెరికా దేశపు పెట్టుబడిదారులు వారి కార్మికులకు చాలినంత ఆహారము, బట్ట, వసతి వగైరాలు యివ్వ నిచ్ఛగించకపోవుటచే వారు తీవ్రముగా క్రొత్త మార్కెట్లును కనిపెట్టెడి పనిలో వినియోగింపబడవలెను. మార్క్సు సిద్ధాంతములయందు నమ్మిక లేక పోయినను చాలమంది ఐరోపా దేశస్థులు యీ నమ్మకముతో నుందురు. విదేశపు మార్కెట్లకొరకు పెనుగులాట వారి దేశములలో అలవాటై యున్నది. "ఎగుమతి చేయుము, లేక చచ్చి పొమ్ము,"—ఐరోపా దేశములలోని ఈ పాట అమెరికాకు కూడ వర్తించునని నమ్మబడుచున్నది. కాని, అది అట్లు వర్తించదు. మా ఉత్పత్తిదారులకు విదేశీ ద్రవ్య మారకము నభివృద్ధి చేయవలసిన బలవంతమేమియు లేదు. వారు దేశీయ మార్కెట్టు లోటును భర్తీచేయుటకు విదేశీయ మార్కెట్లను వెతకవలసిన అవసరముకూడ లేదు.

ఐరోపా దేశములలోని, ముఖ్యముగా యింగ్లండు, జర్మనీ దేశములలోని ఉత్పత్తిదార్లను అమెరికా దేశములోని ఉత్పత్తి దార్లతో పోల్చి చూచినయెడల అమెరికా వారికి ఎగుమతి చేయుటయం దంత యిష్టము లేదనెడి వాస్తవిక విషయము అందరూ ఒప్పుకొనెదరు. విదేశీయుల కోర్కెల వివరములను, షరతులను వారు పాటించరని తరచుగా విమర్శించ బడుచుందురు. ఐనప్పటికిన్నీ ఆ ఉత్పత్తిదార్లే తమ దేశ ప్రజల అవసరములకొరకు ఎక్కువ ఆసక్తితో ఎదురు

చూచుచుందురు. ఎగుమతి వ్యాపారములో వారి కిష్టము లేక పోవుట అనెడిది అర్థము లేనిది కాదు. అమెరికా పెట్టుబడి దార్లు తమ దేశములో సరకును హెచ్చుగా అమ్మి, కొంచెము మాత్రమే ఎగుమతిచేయుట కర్థము. ఎగుమతి వ్యాపారము అసలు వ్యాపారమును కొంచెము మాత్రమే అభివృద్ధి పరచవలెననెడి వాస్తవిక విషయమును వారికి తెలుపు చున్నది. సాంకేతికమైన, వ్యాపార సంబంధమైన వ్యవస్త ప్రమాణము చాలవరకు హెచ్చింపబడినది. ఆ ప్రమాణము నుండి వాటిని ఏ మాత్రము తగ్గించి ఎగుమతి చేసినను ఎక్కువ నష్టము వాటిల్లును. ఈ యుద్ధానంతర ప్రపంచములో ఎచ్చట చూచినను ప్రభుత్వములచే ఏర్పరుపబడిన ఆటంకములు, విదేశ వ్యాపార విషయములో ద్రవ్య చలామణీలోని కఠిన నిబంధనలు మొదలగువాటివలన యిప్పుడు అమెరికా దేశస్థులకు ఎగుమతి వ్యాపారమందు అంత యిష్టత లేదు.

, మా దేశపు ఎగుమతి వ్యాపారము ఐరోపా దేశస్థులకు ఎక్కువగా కనబడునని నే నెరుగుదును. కాని, వాటి వెల నిశ్చయించునప్పుడు. మొత్తము దేశములోని ఉత్పత్తినంతటిని దృష్టిలో నుంచుకొని చేయవలెననెడి విషయమునకు నీవు అంగీకరించెదవని తలచెదను. ఇప్పుడు అసలు విషయము మొత్తము ఉత్పత్తిలో నూటికి ఇన్ని వంతులని లెక్కచూచిన మా ఎగుమతులు క్రమముగా తగ్గిపోయినట్లు తెలియును. 1914 లో మా మొత్తపు ఉత్పత్తియొక్క విలువలో ఎగుమతి చేయబడిన సరకు విలువ 10%. 1948 నాటికి ఆవిలువ 8.6% కు

తగ్గినది. ఎల్లప్పుడు మా మొత్తపు ఉత్పత్తిలోను, మా ఎగుమతుల మొత్తములోనుకూడ నాల్గవ వంతు వ్యవసాయ సంబంధమైన సరకులు. మా సరకులను ఉపయోగించెడి ఎక్కువమంది వాడుకదార్లు ఇచ్చటనే—అనగా—అమెరికాలోనే యున్నారని విశదమగుచున్నది.

ఉత్పత్తి, ఎగుమతి ఈ రెండు విషయాలలోను ఎక్కువ విలువైన మా మోటారు ఉత్పత్తి పరిశ్రమను పరిశీలింపుము. 1949 లో 14,80,00,000 జనాభాయున్న మా దేశములో 3,60,00,000 వ్యక్తులకు చెందిన మోటారు కార్లున్నూ, 84,00,000 బస్సులు, ట్రక్కులున్నూ ఉండెడివి. 1948 లో మా మోటారు ఉత్పత్తి పరిశ్రమ మోటారుకార్లు, మోటారు బస్సులు, ట్రక్కులు కలిపి మొత్తం 52,85,000 కార్లు అమ్మినవి. ఆ మొత్తములో కార్లు, ట్రక్కులు కలిపి మొత్తం 4,55,000 కార్లు, లేక 8% ఎగుమతి చేయబడెను. 1940 లో మోటారు కార్ల ఉత్పత్తి 62,53,600 కున్నూ, 1950 లో 80.16,000 కున్నూ పెరిగినవి. కాని, ఆ సంవత్సరములలో ఎగుమతులు వరుసగా 2,74.000 మరియు 2,80,000 కు అనగా 4.4% మరియు 3.5% కు తగ్గిపోయినవి. 1949 లో ఇంగ్లండు దేశములో ఉత్పత్తి చేయబడిన మోటారుకార్ల సంఖ్య 6,30,000. ఆ సంవత్సరములోనే ఫ్రాన్సు దేశంలో 2,85,000 కార్లు ఉత్పత్తి చేయబడెను. 1940 లో ఈ రెండు దేశముల మోటారుకార్ల ఉత్పత్తిలో మా దేశపు మోటారుకార్ల ఎగుమతిని పోల్చి చూచినయెడల మా ఎగుమతులు చాల

హెచ్చుగా కాన్పించినవి. కాని, అమెరికా దేశము మోటారు కార్ల నెంతమాత్రము ఎగుమతి చేయక పోయినను, దాని వ్యాపారము చాలబాగుండెడిది. ఆ విషయము నీవు అంగీక రించెద వని నమ్ముచున్నాను.

ఇప్పుడు చాలమంది ఐరోపా దేశస్థుల దృష్టిలో నున్న ప్రకారము "యుద్ధోన్మాదు"లైన ఉక్కు సామాన్లు ఉత్పత్తి చేయువారున్నారు. 1930 లో 4,55,00,000 టన్నులు, 1940 లో 6,70,00,000టన్నులు ఉండెడి ఉక్కు పరిశ్రమల యొక్క ఉత్పత్తి 1950 లో 10,00,00,000 టన్నులకు పెరిగి నప్పటికిన్నీ యుద్ధానంతర సంవత్సరములలో ఉక్కుసామాన్లు చీకటిబజారు వెలలకు కొనుక్కోవలసిన పరిస్థితి ఏర్పడినది. దీనినిబట్టి ఉక్కు ఎంత కష్టముగా లభ్యమగుచున్నదో తెలియును. 1950 లో మేము హాలండు, ఇతర దేశములనుండి ఉక్కు దిగుమతికూడ చేసుకొనవలసి వచ్చినది. యుద్ధములో పూర్తిగా దెబ్బతిని, నిరాశాహతమై యున్న ఐరోపాకు సరకు అందించుటకొరకు కాకపోయిన, మేము ఉక్కునెంతమాత్రం ఎగుమతి చేసెడి వారము కాము. మా దేశపు పెట్టుబడిదార్లు ఇప్పుడు స్థిరముగా ఆధారపడియుండ వీలులేనట్టియు, యుద్ధ ప్రమాదమున్నటువంటియు, ద్రవ్య చలామణి నిర్బంధములతో నిండియున్నటువంటి విదేశ వ్యాపారముపై ఆధారపడి యుండుటకంటె అమెరికా దేశపు కార్మికులయొక్క జీవన ప్రమాణమును పెంచి దేశీయ వ్యాపారము నభివృద్ధి చేయు

నిచ్చగింతురని చెప్పుట కింకను నేను ఆధార సహితముగా వాదన చేయవలెనా ?

'ఇంటర్ నేషనల్ హార్ వెస్టర్' (అంతర్జాతీయ వ్యవసాయ సంస్థ), 'జనరల్ మోటార్స్,' సింగరు స్యూయింగ్ మిషన్సు' మొదలైన కంపెనీలు విదేశములలో పెట్టుబడిపెట్టి మమ్ములను యుద్ధమునకు దింప వచ్చునని బహుశా నీ వను కొనవచ్చును. ప్రపంచమంతటా విదేశములలో చెదరుచెదరుగా స్థాపింపబడియున్న వారి యంత్రగారములు అచ్చటి ప్రజలకు చాల ముఖ్యమై కాన్పించవలసియున్నది. ఐనప్పటికిన్ని యుద్ధ కాలములో జర్మనీలోను, జర్మనీ ఆదిపత్యము క్రింద నున్న దేశములలో నున్న ఈ సంస్థలయొక్క యంత్రాగారము పూర్తిగా నాశనము చేయబడకుండ ఎత్తివేయబడిన వనెడి విషయము యథార్థము. 1950 ప్రారంభములో విదేశములలో మా అమెరికా దేశపు వ్యాపార సంస్థలయొక్క స్వంత పెట్టుబడులు నూనె పరిశ్రమతో సహా 16 బిలియన్ల డాలర్లు. దీనిని మా దేశముయొక్క ఆస్తులుతోడను, ఎగుమతుల తోడను, లేక అమ్మకములతోడను పోల్చి చూచిన యెడల వాటన్నింటికంటెను కూడ తక్కువయి ఉన్నది. భవిష్యత్తులో వచ్చెడి ప్రమాదకరమైన యుద్ధము గురించి ఆలోచించెడి పారిశ్రామికునకు విదేశములలో అతనికి వచ్చెడి లాభములు, లేక నష్టములకంటె స్వదేశములో తనకుండెడి ఆస్తులకు కగ్గెడి నష్టము విశేషముగా నుండవలె నన్నమాట.

ఇప్పుడు ఆ "ఉపద్రవకరమైన మనుష్యులు" మనకు హెచ్చుగా ధన సహాయము చేసెడివారు. ఆ నీచుల గురించి కొంచెము ఆలోచింతము. ఈ మనుష్యులు 'జేమ్సు బ్రైసు' చెప్పినట్లు ఎల్లప్పుడు రాజకీయములలో ఆసక్తి కలిగియుండి ద్రవ్య మార్కెట్టును మార్పు చెందించెడి, వ్యాపారమును మందము చేసెడి, ముఖ్యముగా విదేశములతో చిక్కులు తెచ్చునటువంటి హఠాత్తుగా జరిగెడి మార్పులను ఆటంక పరచుచుందురు. అందుచేత, అమెరికా వారు పూర్తిగా శాంతి వ్యవస్థకు చెందినవారు. కొంతమంది చిక్కులలోపడి కొంత లాభము పొందగోరినను అధిక సంఖ్యాకులు హెచ్చుగా నష్టమును పొందెదరు.

ఈ విషయములన్నియు 19 వ శతాబ్దము ఆఖరులో గమనించబడినవని నేను ఒప్పుకొంటున్నాను. అప్పటినుంచి పరిస్థితులు పూర్తిగా మారినవని నీవు అనుకొన వచ్చును. ఈ విషయమును బాగా పరిశీలించియే లెనిన్ "పెట్టుబడి దారీ విధానము యొక్క ఆఖరుమెట్టు సామ్రాజ్యవాద" మనెడి తన సిద్ధాంతమును ప్రకటించెను.

లెనిన్ ప్రస్తుతకాలపు సామ్రాజ్యవాదము ఈ విధముగా నుండునని వ్రాసియున్నాడు: "ధనరూపమైన పెట్టుబడి కొన్ని పెద్ద బ్యాంకుల చేతులలో కేంద్రీకరింపబడి యుండి, యిదివరలోనే కొద్దిమంది చేతులలో గుత్తగా యుంచబడిన దేశములోని పరిశ్రమలపై అధికారమును చలాయించును. అప్పుడు ఈ ధనాఢ్యులు లెనిన్ సిద్ధాంతము ప్రకారము

(ఇంగ్లండు, ఫ్రాన్సు, జర్మనీ, మరియు అమెరికాలలోని ధనాఢ్యులు) అన్నిటికంటె ఎక్కువ లాభదాయకమైన వ్యాపారమగుటచే పెట్టుబడిని విదేశముల కెగుమతి చేయుదురు. ”

ఆతని దృష్టిలో పెద్ద రాజ్యములయొక్క విదేశములలోని రాయబారి కార్యాలయములు ఈ పైన చెప్పబడిన బ్యాంకుల చేతులలో కీలుబొమ్మలు. అందుచేత, అన్నిటికంటె అతి ముఖ్యమైన పెట్టుబడి ఎగుమతికొరకు క్రొత్త వలస దేశములకై అన్వేషించవలెను, లేదా వారి వివిధములైన పలుకుబడుల నుపయోగించవలెను. 1900 సం॥రం వచ్చుసరికి ప్రపంచమంతా పెద్ద పెట్టుబడిదారీ దేశముల మధ్య పంపకము చేయబడెను. మరియు వారిలో చిన్న రాజ్యమైన జర్మనీ భూగోళము నంతను తిరిగి పంపకము చేయవలెనని కోరెను. ప్రథమ ప్రపంచ సంగ్రామము జరుగుచుండగా లెనిన్ వ్రాసిన ఈ కథ తప్పని విధిగా జరుగవలసి వచ్చెను.

మొదట ఐరోపా గురించి పరిశీలింతము. లెనిన్ తన వాదమును బలపరచుకొనుటకు చెప్పిన విషయములన్నియు అక్కడ వర్తించును. వాటి ప్రాధాన్యత మాత్రము అతిశయోక్తిగా చెప్పబడినది. ఆ పెట్టుబడి ఎగుమతి లెనిన్ అనుకొనంత ఎక్కువగా లాభదాయకమైనది కాదు. అట్లు పెట్టుబడి ఎగుమతిచేయుట చాలవరకు ప్రతి విషయములోను ఎగుమతిచేయు వ్యాపారస్థలములను సృష్టించుటకో, రాజకీయ సంబంధమైన పలుకుబడి నభివృద్ధి చేయుటకో,

సైనిక విజయము కొరకో చేయబడినది. అన్నింటికంటె ఈ విషయముపై ఎక్కువ గట్టిగా చెప్పదలచుకొంటిని. ఎక్కడైనను ఐరోపా ఖండములోని పెట్టుబడిదారీ దేశములు సామ్రాజ్య ఆధిపత్యము కొరకు యితర దేశములపై దండయాత్ర చేసినచో అసలు నేరము ఆధునిక పెట్టుబడిదారీ విధానంగాదు. అసలు నేరము దౌర్జన్యవిధాన మవలంబించి దేశములయొక్క ఆర్థిక, సామాజిక, రాజకీయ వ్యవస్థ లన్నింటిని పాడుచేసి వర్ణవిచక్షణా విధానము, మానవ అసమానత్వమందలి మూఢ విశ్వాసము లందున్నది. దీని ప్రాబల్యము సామ్రాజ్య దేశములైన జర్మనీ, రష్యా, జపాన్‌లలో ఎక్కువగా ఉండెను. బ్రిటను వీటి సరిహద్దులకు దాదాపు దగ్గరలో నున్నది. నా ఉద్దేశము దాని అభివృద్ధికి కేవలము ఆర్థిక సంబంధమైనదేగాని, సైనిక పోరాటముచే కలిగినది కాదు.

కాని, అమెరికాను చూడుము. వాస్తవికతనుబట్టి లెనిన్ యొక్క వర్ణనకు ఈ దేశమునకు ఎట్టి సారూప్యమూ లేదు. "అధికముగా నున్న పెట్టుబడి ధనము", "ప్రజల జీవన ప్రమాణమును పెంచుటలో ఉపయోగింపబడదు...అట్లు చేసినచో పెట్టుబడి దార్ల యొక్క లాభములు తగ్గును. అందుచేత; అధిక లాభములు సంపాదించుటకై దానిని విదేశముల కెగుమతి చేయుదురు," అని అతడు వ్రాసెను. ఏకాలమును గురించి లెనిన్ చెప్పెనో ఆ కాలములో అమెరికా దేశపు పెట్టుబడి దార్లచే సంపాదింపబడిన అధిక లాభములు

వారి దేశంలోని ప్రజలయొక్క జీవన ప్రమాణమును అధికము చేయుటవలనను, స్వదేశ వ్యాపారమువలనను సంపాదింప బడినది. కొంత పెట్టుబడి విదేశములకుకూడ ఎగుమతి చేయ బడెను కాని, వ్యాపారములో వచ్చిన లాభము అమెరికా దేశములోని వ్యాపారముకంటె చాల తక్కువ.

ఇంకను సంయుక్త రాష్ట్రములలోనున్న ద్రవ్య వ్యాపార సంస్థల (బ్యాంకులు)కున్నూ, యూరపు దేశములలో నున్న ద్రవ్య వ్యాపార సంస్థలకున్నూ పరిస్థితులలో పోలిక ఎచ్చటనూ లేదు. మరియు గత యిరువది సంవత్సరములలోనూ అమెరికాలోని పరిశ్రమలపై వాటి యొక్క ప్రాబల్యము తగ్గిపోయినది. మాదేశ ప్రజలు ఏదేని ఉద్యమమును నడపవలెననెడి ఆసక్తి కలవారగుటచేతను, సాహసించి అధిక లాభాలకై వ్యాపారముచేయ నుత్స హించువారగుటచేతను మాదేశములోని వ్యాపార సంస్థలు సాధారణముగా వ్యాపారములోని పేర్సు వ్యాపారము నడపుటకు ధనము సంపాదింతురు. మేము ఆ సంస్థయొక్క లాభములలో కొంతభాగమును తిరిగి అదే వ్యాపారములో నుంచెదము. ఈ విధముగా ఆ వ్యాపారము నభివృద్ధి చేయుదుము. అమెరికాలోని సామాన్య మానవుడు తన రాబడిలోని చాల భాగము అప్పు పత్రములు కొనుట, అందులో ముఖ్యముగా విదేశ ప్రభుత్వము లిచ్చు అప్పు పత్రములను (బొండ్లు) కొనుటకంటె ఎక్కువగా సాహసించి చేయు వ్యాపారములో భాగములను కొనుటయందో, కలే

క్రొత్త వ్యాపారమునందో వినియోగించును. "అమెరికా దేశస్థులు చెల్లు రశీదులను చించి యిచ్చి యితరుల ద్రవ్యముపై జీవించెడివారు" ("Coupon clipping parasites") అని లెనిన్ చెప్పిన మాటకు అర్థము లేదు. కాని, ఆ మాటయే కాదు. ఆ "యిజారాదారుడు"గా వుండవలెననెడి ఉద్దేశ్యమే అమెరికా దేశస్థులకు క్రొత్తది.

ఆ విధముగా ఎవ్వరైనను లెనిన్ యొక్క సామ్రాజ్య వాద సిద్ధాంతమును అమెరికాకు వర్తింపచేయ దలచినచో ఛాయామాత్రముకూడ అర్థములేకుండ పోవును. అమెరికా దేశస్థులకు యితర దేశస్థులపై దండయాత్ర చేసిగాని, యితర దేశములపై ఆర్థిక దిగ్బంధము విధించిగాని వారిపై యిష్టము లేకపోయినను అధికారము చేయుట అనాహూయము వంటిది. అట్లు అధికారముచేయుట, యిప్పుడు తయారైన కారు కలిగియున్నవాడు కప్పదాట్లు వేసెడి పెంకె గుర్రముపై స్వారిచేయ గోరినట్టి రీతిగా ఆతడు భావించును. నిజమునకు మాపెట్టుబడి దార్లలో సామాజము నభివృద్ధిపరచు కార్యక్రమమును, వర్గ విచక్షణా నిర్మూలన కార్య క్రమమును వ్యతిరేకించెడి వారు కొంతమంది ఉన్నారు. అయినప్పటికిన్నీ వారు ఈ విషయములో చాల నిష్కపటముగా మాట్లాడెదరు. యుద్ధమునకు వెళ్ళుటకు బదులు, లేక యుద్ధమునకు సిద్ధమగుటకు బదులు వారు, నత్తలు నత్తగుల్లలలోనికిదూరి ఆత్మరక్షణ చేసుకొనునట్లు మమ్ములను విశ్రాంతిగా నుండనిచ్చి మిగతా ప్రపంచమునంతను ఎవరిపనులు వారిని చూచుకొన నిచ్చె

దరు. వారు చాల పట్టుదలగల యితరులతో కలసి యుండ నిచ్ఛగించనివారు. ఆ విధముగా పరిపూర్ణమైన పెట్టుబడిదారీ విధానము అందులో ముఖ్యముగా అమెరికా దేశపు పెట్టుబడి దారీ విధానము. దానియొక్క అద్భుతమైన భావి భాగ్యోన్నతి తోడను, అందరియొక్క సామాజిక పరిస్థితిని అభివృద్ధి పరచెడి కార్యక్రమముతోడను సామ్రాజ్య వాదమును రూపుమాపును.

మా దేశ చరిత్రలో ఈ వివాధ ముండి ఉన్నది. క్యూబాలో స్పెయిను దేశపు పరిపాలన నంతరింపజేసి, దానికి స్వాతంత్ర్యమిచ్చితిమి. 1934 లోనే ఫిలిప్పైన్ దీవులకు సంపూర్ణ స్వాతంత్ర్య మిచ్చుటకు కావలసిన చర్యలన్నియు తీసికొంటిమి. 1946 లో ఆ పని పూర్తయినది. అమితమైన ఖనిజ సంపదతోను, నూనె గనులతోను నిండియున్న మెక్సికో రాష్ట్రము సంస్కార ప్రభుత్వము (Radical leadership) హయాములోవారు అమెరికాదేశపు పెట్టుబడిచే నెలకొల్పబడిన నూనె పరిశ్రమలను జప్తు చేసినప్పుడు మేము ఆ దేశముపై యుద్ధమునకుగాని, నిర్బంధించుటకు గాని ప్రయత్నము చేయలేదు. ఈ విషయములో ముడి పదార్థములు, స్వల్ప వేతనములకు లభించెడి కూలీలు అనెడి రెండున్నూ ముఖ్యముగా కావలసినటువంటివన్నీ, సరిహద్దు రాజ్యమగుటచే సైనిక ఆక్రమణకు చాల సులభమైనటు వంటివన్నీ ఆ దేశము నాక్రమించుకొనుటకు మేము ప్రయత్నించ లేదు. అవి మమ్ములను ప్రలోభపరచలేక పోయినవి.

ఈ వాస్తవిక విషయములన్నింటితోకూడ నేను పూర్వాచార పరాయణులగు సోవియట్ రష్యా దేశపు మార్క్సిస్టు సిద్ధాంతానుసారులను ఎన్నటికీన్నీ ఒప్పించలేననేదే విచారకర విషయము. అతడు పెట్టుబడిదారీ విధానమందలి ఏదో ఒక లోపమును పట్టుకొని వ్రేలాడుచుండును. ఆతడు మా దేశీయ పరిస్థితుల నెంతగా అపార్థము చేసుకొనినాడో మా యొక్క వైదేశిక విధానమును కూడ అంతగా అపార్థము చేసికొనినాడు. ఆతడు ఎల్లప్పుడు మేము యితర దేశముల నాక్రమించుకొనుట ఉద్దేశ్యము కలవారమనుకొనును. దానికి ఆతని యొక్క ఉద్దేశ్యం ప్రకారము ఎల్లప్పుడు ఒక మనుష్యుని, లేక ఒక దేశము యొక్క అభివృద్ధికి యింకొక మనుష్యుని ఘాదుచేసి, లేక యింకొక దేశమును నష్టపరచి మాత్రమే పొందబడగలదు.

నా వ్యక్తిగత అభిప్రాయమును సోవియట్ నాయకులు వారి ప్రజలకు ఏమి చెప్పుచున్నారో దానియందు వారికి నమ్మకమున్నట్లు నాకు తోచుట లేదు. వారు మా మీద రుద్దెడి ఆరోపణలు చూచినయెడల అసహ్యమైన అనుమాన మొకటి నాకు కల్గుచున్నది. ఇదివరలో నే నెప్పుడు అటువంటి నిందారోపణలు వింటిని? అది హిట్లర్ చెకోస్లవేకియా, పోలండు, రష్యా మరియు యితర దేశములపై యుద్ధము చేయ సిద్ధమైనప్పుడు కాదుగదా? అప్పుడు స్వతంత్రులుగా వున్న వారందరు కలసి జర్మనీ దురాక్రమణను అరికట్టవలెనని చెప్పిన వారందరిని వారు "యుద్ధోన్మాదు"లని పిలిచిరి. జర్మను లెప్పుడు

ఏ దేశము నాక్రమించుకొనినను వారా దేశమును తమపై దండయాత్ర చేయబోయిన దేశమని అధిక్షేపించెడివారు. ఈ పద్ధతి నేటి ఉత్తరములో మరల చెప్పవలసివచ్చినది.

వాస్తవముగా అమెరికా దేశమును యుద్ధము కొరకు ప్రయత్నము చేయకుండ నుంచెడి పరిస్థితులు సోవియట్ రష్యా దేశములో లేవు. ఆ దేశ ప్రజల అధినేతలు వారి రాబడు పన్నుల ద్వారా తగ్గిపోకుండనుండునట్లు చూడరు. ఆ దేశపు ప్రజలకు విదేశములనుండియు, పశ్చిమ ఐరోపాలోని సామాన్య కార్మికుల యిండ్లనుండియు కూడా దోచుకొనుట చాల ఆకర్షణీయమైనది. క్రిందటి యుద్ధములో రష్యా దేశపు సైనికులు అత్యుత్సాహముతో ప్రజలను, దేశములను కొల్లగొట్టిరి. ఆ దేశపు ప్రభుత్వము శత్రు దేశములనుండి మాత్రమే గాక మిత్రరాజ్యములలో నొకటైన మంచూరియా నుండికూడ చాల యంత్రాలయములను పడగొట్టి కదల్చి తీసుకొనపోబడగల్గిన సామగ్రి యావత్తున్నూ తీసుకొని పోయినది.

ఇంతేకాక, గత కొలది సంవత్సరములలో యీ విధానము విరివిగా భారీయెత్తున అమలు జరుపబడినది. ఐరోపాలోనికెల్ల పెద్ద జోళ్ళ కర్మాగారమున్న జెకోస్లవేకియాలోని ప్రజలు ఉత్పత్తి అయ్యెడి జోళ్ళలోని అధికభాగము రష్యాకు ఎగుమతి చేయబడుట చేత, క్రొత్తవి కొనుటకు దొరకక బాధపడుచున్నారు. ఇచ్చట శాంతి సమయములోనే ఈ దోపిడీ విధానము అమలు జరుపబడుట నీవు చూడ.

వచ్చును. దేశములోని ప్రజల ముఖ్యావసరములకు వలసినంత సరకును ఉత్పత్తిచేసి వారి కందించలేనటువంటి ప్రభుత్వము యొక్క ఆర్థిక వ్యవస్థ సులభముగా దెబ్బతినును.

మేము మార్షల్ ప్రణాళిక ప్రకారము మా దేశములోని ప్రజలయొక్క జీవన ప్రమాణమునకు నష్టము వాటిల్లకుండ విదేశములలోని ప్రజలయొక్క జీవన ప్రమాణము నభివృద్ధి చేయగల్గియుండగా, రష్యా తన దేశ ప్రజలయొక్క పరిస్థితి నభివృద్ధిచేయుట కొరకు తానాక్రమించెడి దేశములలోని ప్రజలయొక్క జీవన ప్రమాణమును తగ్గించి పాడుచేయవలెను.

అమెరికాలో నున్న మేము సోవియట్ అధినేతల నిర్ణీత కార్యక్రమముతో దురాక్రమణ చేయగోరుచున్నారని అనుమానించుటకు కారణము గలదు. వారు మా దేశము కంటె ఎక్కువ సైనిక, వైమానిక బలములను అధిక సంఖ్యాకముగా నుంచుకొనుటయేకాకుండ, వారి దురాక్రమణ విధానమునకు ఎక్కువగా తోడ్పడుటకు జాతివైషమ్యతను రెచ్చగొట్టుట.

లెనిన్ మరియు స్టాలిన్‌లు చెప్పిన ప్రకారము జాతి వైషమ్య సమస్య ప్రపంచములో పెట్టుబడిదారుడు నిర్మూలింపబడువరకు వుండవలసినదే. మరియు "ప్రజాస్వామిక దేశములన్నియు" మాస్కోనుండి ఉత్తరువులు తెప్పించుకొన వలసియుండుటచే రష్యాచే యిప్పించబడెడి "స్వాతంత్ర్య యుద్ధము"నకు దారితీయును. ఈ ఉద్దేశ్యము యుద్ధము లేకుండ సాధించబడినచో చాలమంచిదే. కాని, ఆ యుద్ధము

చేయు ఉద్దేశ్యము మాత్రము అచ్చట ఉన్నది. రష్యాలోని సోవియట్ బ్యూరోలోని ప్రముఖ సభ్యుడైన 'మాలెన్ కోవ్' 1947 సెప్టెంబరు నెలలో కోమిన్ ఫారమ్ (Comin form)ను ఏర్పాటు చేసిన సభలో మాట్లాడుచు "వర్ణ విచక్షణ సమస్య అంతర్జాతీయ రాజకీయరంగము లోనికి ప్రాకినది" అని చెప్పెను. "విదేశములతో యుద్ధము వారి స్వదేశములోని వర్ణ విచక్షణకు సంబంధించిన యుద్ధము యొక్క విస్తరింపు" అని మాత్రమే సోవియట్ అధినేతల అభిప్రాయము. వారు చెప్పినట్లు వివిధ జాతులమధ్య యుద్ధమే కనుక తప్పని సరియైనచో ఆ రెండు వర్గములు కల్గియున్న దేశప్రభుత్వములమధ్య అనగా మా దేశములో నున్న ధనికవర్గమునకు వారిదేశములోని కార్మిక వర్గమునకు మధ్య యుద్ధము తప్పదన్న మాట.

అదృష్టవశమున ఈ విషయమంతయు మాస్కోలోని వాచక పుస్తకములందు మాత్రమే యున్నది. మాకు ఆఖరుకు ఒక వర్గ ప్రభుత్వముకూడ లేదు. మేము వర్గ విభేదముపై యుద్ధము తప్పని సరికాదని చెప్పెడి విషయము తప్పని ఋజువు చేసియుంటిమి. వాస్తవముగా మేము స్వంతముగా ఉదాహరణ రూపమున ధనికులు మరియు కార్మికుల మధ్య సహకారము వలన యిరువురకు కూడ లాభదాయకమని అమలు జరిపి చూపినాము. . పెట్టుబడి దార్లుగాని, అమెరికా దేశము మొత్తము మీదగాని ఎవ్వరున్నూ యితరులవద్ద నుండి ఏమియున్నూ బలవంతముగా లాగుకొనరు. ఆ అవుస

రము కూడ లేదు. అందుకు బదులుగా మేము ఫలవంతమైన సహకారోద్యమమును ప్రపంచమంతటను ప్రవేశపెట్టుచున్నాము. మేము రష్యాను, దాని ఆశ్రిత దేశములను కూడ మార్షల్ ప్రణాళిక నమలుపరచు విషయములో పాల్గొనవలసినదని ఆహ్వానించాము.

ఇప్పుడు నేను "అనివార్యమైన వర్గపోరాటము" అను కల్పన గురించి ఎంత ఎక్కువగా ఆందోళన చెందుచుంటినో నీవు తెలుసుకొని ఉందువు. అది ఒక దేశము యొక్క సమాజములోని ఒండొరుల సంబంధములను త్రెంచి, విషపూరిత మొనర్చును. ఆర్థికాభివృద్ధి నాటంకపరచును. అది వివిధ దేశములమధ్య అంతులేని అనుమానములను, ప్రమాదకరమైన పరిస్థితులను తెచ్చును.

# అంతిమ లక్ష్యము

ప్రియమైన హెన్రీ!

నీవు కొద్దివారములు శెలవు తీసికొని నీ కుటుంబ సహితముగా సముద్రపుటొడ్డుకు వెళ్ళెదవని విని నేను సంతోషించుచున్నాను. కొన్నాళ్ళవరకు రాజకీయ సంబంధమైనటు వంటి ఆఖరు ఉత్తరము ఇదే కాగలదు. ఎవ్వరైనను స్వంత వ్యవహారముల విషయములను చూచుకొనుట కొంత కాలము వ్యవధి కోరెదరు. అట్లే నేనున్నూ. నీవు అట్లు కోరవా?

మన ఇద్దరి స్నేహసంబంధములోను నేను చాల మనః పూర్వకముగా నుంటినని నీ వెరుగుదువు. నిన్ను వదలిపెట్ట వలసి వచ్చునని భయపడితిని. అంతేకాక, నిజముగా స్వతంత్ర ముగానున్న ప్రపంచమంతయు నిన్ను విడచిపెట్టవలసి వచ్చు నేమో యని నేను చాల బాధపడితిని. నా ప్రియ మిత్రమా! జీవన్మరణ సమస్యలో మునుగుటకు ముందుగా ప్రతి విషయ మునుగురించియు చాల తీవ్రముగా ఆలోచించెదనని నీవు చేసిన వాగ్దానము నా హృదయమును కరగించి వైచినది.

అమెరికాలో మానవ సమాజమును గురించి నేను చెప్పినటువంటి విషయములు ఇంకను ఉన్నవి. కొలదిగా మాత్రమే చెప్పి వదలివేసిన విషయము లెన్నియో ఉన్నవి. కాని, నేను మా ప్రజలలోనుండెడి భావములను గురించి చక్కగా నీకు చెప్పితి ననుకొంటున్నాను. మా ప్రజల నట్లు సుఖముగా నుంచిన దేదియో కూడ నేని చెప్పియున్నాను' మేము నెమ్మదిగా గాలి పీల్చుకొంటూ హాయిగానుంటున్నా

మని ఇతర దేశస్థులు అనుకొనుట తప్పు. మా దేశములో నున్న ప్రతివ్యక్తియు భవిష్యత్తుగురించి ఆలోచించుకొనుచు, ఎల్లప్పుడు కష్టపడి పనిచేయుచుండును. ఈ పనులన్నియు చేయుచున్నను మాకు ప్రకృతి సౌందర్యములనుచూచి ఆనందించుటకు, సంగీతము, సాహిత్యము మొదలైన వాటితో కాలక్షేపము చేయుట మొదలగు మంచి పనులన్నింటికి తగిన వ్యవధి ఉండును. ఐరోపాలోని అసంఖ్యాకములైన ప్రజా సమూహములతో పోల్చి చూచినయెడల మా దేశములో కొలదిమంది మాత్రమే జీవిత సౌఖ్యములను పూర్తిగ అనుభవించలేకుండా ఉన్నారు.

అమెరికాలోని జీవితములుగురించి నే చెప్పిన విషయాలను నేను చూచినవాటినిగా మాత్రమే తీసికొని వాటిని గురించి తీవ్రముగా నాలోచించవలెనని నీవు చెప్పెదవు. కాని, ఎందుచేత ? మానవులందరు సౌఖ్యమనుభవించుట ఒకే ఒక రాజబాటయుండవలెనా ? వివిధజాతుల మధ్యనున్న అసమానత్వములు వేరు వేరు విధములచే తొలగింపబడకూడదా ? మరియు ముఖ్యముగా మార్క్సు, లెనిన్‌లచే చెప్పబడిన మార్గములద్వారా అవి నిర్మూలింప బడకూడదా ?

మంచిది, నీవు చాల మంచి ప్రశ్నయే అడిగినావు. నీవు అనుకొనునంతగా యింకే మంచిమార్గమును గురించియు ఆలోచించనంతగా అమెరికా విధానము నా మనస్సునకు పట్టియుండలేదని నేను ఒప్పుకొంటున్నాను. ఇతర దేశములు అందులో ఉదాహరణమునకు స్వీడను ఉత్పత్తిలోను,

సామాజక అభివృద్ధిలోను కూడ అమెరికాతో సమానము గానో, లేక ఎక్కువగనో కూడ ఉండవచ్చును. ఒక ప్రత్యేక "విధానము"ను నేను ఇతర దేశములకు అంటగట్ట దలచుట లేదు. ప్రతి దేశమునకు కొన్ని ప్రత్యేక పరిస్థితులున్నూ, కొన్ని ప్రత్యేక సమస్యలున్నూ ఉన్నవనియు, అవి ఇప్పుడు గత యుద్ధముచే పొందబడిన నష్టము చేతనో, లేక క్రొత్త యుద్ధ ప్రమాదము చేతనో ప్రకోపింపబడినవనియు నే నెరుగుదును.

నేను యింకొక అడుగు ముందుకుకూడ వేయుచున్నాను. నేను పెట్టుబడి దారీ విధానమును ఎవ్వరికిన్నీ బలవంతముగా ఎంత మాత్రము కట్టబెట్టదచలేదు. ఆ పదము మార్క్సుచే మా కోటుజేబుల కతికించబడిన చిహ్నామువంటి మాట మాత్రమే. అది కేవలము ఒక పదము లేక, నీకు నచ్చినట్లైతే అది ఒక పార్టీచే ఉపయోగింపబడెడి మామూలు పాట, లేక నీవుద్దేశ్య ప్రకారము ఒక చెడ్డమాట అని చెప్పుచున్నాను. నేను మార్క్సుయొక్క కొన్ని అభిప్రాయముల విషయములో ఆతనిని గౌరవించినప్పటికిన్నీ ఆతనిచే వాడబడిన పెట్టుబడి దారీ విధానము. "పెట్టుబడి దారులు" అనెడి పదము విని ప్రపంచ మాతనియెడ ఏవిధమైన కృతజ్ఞతయు చూపించ నవసములేదు. "సర్వమానవ సమానత్వ విధానము" (సోషలిజమ్) అనెడి మాటవలె అవి కొంత మంది గొప్ప ఆలోచనా పరుల మనస్సులను కలచి వైచినవి. కాని, చాలమందికి కంగారును కలుగచేసి వ్యర్థమైన పోరాట

మునకు కారణ భూతమైనవి. అవి అతి ప్రధానమైన సమస్య. జాతి విచక్షణా విధాన నిర్మూలనా పోరాటము, స్వతంత్రము అనేడి సమస్యలనుండి మానవుని దృష్టిని మరల్చి నవి. అయ్యో! నేడు గారడీవాని ఉపాయముచేత చవుకగాను, త్వరితముగాను అన్నియు సాధించినటుల ఆర్థిక, సామాజిక సమస్య లన్నింటిని ఆ సిద్ధాంతముచే పరిష్కరింపబడునసేడి వాగ్దానముచే ప్రలోభ పెట్టబడినవారు మిలియన్ల కొలది ఉన్నారు. అన్నింటికంటె హేయమైనది ఆ సిద్ధాంత మందలి ఆ మాటలవలన ప్రజలలో పరస్పర నమ్మిక, సహాయము, స్నేహభావములకు మారుగా ప్రజల మధ్య పరస్పర అనుమానము, అసహిష్ణుత ఏర్పడి నిర్మాణాత్మకమైన సహకార మార్గమునుండి ప్రజలు వినాశాత్మకమైన పరస్పర విరోధ మార్గములోనికి వచ్చి నష్టపడుచున్నారు.

పెట్టుబడి దారీ విధాన మనేడి పదము నుపయోగించి నప్పటికిన్నీ నిజమునకు నావుత్తరములలో వాడకుండా యుండ గోరితిని. దానికి చాల అర్థము లున్నవి. అందులో కొన్ని అర్థములు నా వెంత మాత్రమును కావు. నేను నిజముగా "సర్వమానవ సమానత్వ విధానము" (సోషలిజమ్) అన్న అర్థములో ప్రయోగించితినని నీవు తెలిసికొని నందులకు నేను సంతసింప వచ్చునా? కాని, అదెంత మాత్రమున్నూ నిజముగాదు. ఈ పై రెండు పదములున్నూ ఎక్కువ అర్థముతో అనవసరముగా ప్రయోగింపబడినవి. ఏలనన, పెట్టుబడి దారీ విధానమున్నూ, సర్వమానవ సమత్వ విధానము

(సోషలిజమ్) ఎన్నడూ కలసి ఏకత్వమును పొందలేవిగా చెప్ప బడినవి. బాగా పెట్టుబడిదారీ విధాన మమలునందున్న దేశములలోని ప్రభుత్వములు కూడ 'సర్వమానవ సమానత్వ విధానము' అని ఎదుర్కొనబడినటువంటి విధానములను అమలులో పెట్టినవి. యిందుకు విరుద్ధముగా సోవియట్ రష్యాలోను, లేక కార్మిక బ్రిటనులోని ఒక కర్మా గార యజమాని ప్రభుత్వ నౌకరుగానుండవలసి యున్నప్పటి కిన్నీ పెట్టుబడి దారుడుగా తనను తాను భావించుకొని వ్యవహరించవలెను. ప్రతిచోటున యజమానులు మరియు కార్మికులయొక్క పరస్పర సుఖ, సౌఖ్యములు ఒక దాని నుండి మరియొకటి విడతీయబడలేనంత గట్టిగా పెనవేసికొని పోయి ఉన్నవి. సరియైన ఆర్థిక విధానము యొక్క అభివృద్ధి ప్రత్యేకముగా పెట్టుబడి దారుల చేతగాని, కార్మికుల చేతగాని మరియొకరి సహాయము లేకుండ సాధించ బడలేదు. మరియు ప్రత్యేకముగా పెట్టుబడి దారులచే నిర్మింప బడి ఆర్థిక విధానము కార్మికుల అభికృద్ధికి సహాయపడ లేదు. అట్లే ప్రత్యేకము కార్మికులచే నిర్మింపబడిన ఆర్థిక వ్యవస్థ పెట్టుబడిదారుల అభివృద్ధికి తోడ్పడలేదు. ఆ విధము గానే ప్రభుత్వముయొక్క, వ్యక్తులయొక్క పెట్టుబడులు రెంటినీ కలపి పని చేయించినగాని ఆర్థికాభివృద్ధి సాధ్యము గాదు. వర్ణవిభేద రహితమైన అమెరికావంటి దేశములో వివిధ జాతులయొక్క జీవన ప్రమాణమునకు, మానసికోద్దేశ్యములకు మధ్యనున్న తేడా త్వరత్వరగా అంతరించిపోవుచున్నది.

ఐనప్పటికి సంవత్సరముల వెంబడి సంవత్సరములు, దశాబ్దముల వెంబడి దశాబ్దములుగా పెట్టుబడి దారీ విధాన మును సమర్థించెడి ఒక వర్గమునకు, మార్క్సు యొక్క సర్వ సమానవ సమానత్వము (Marxist Socialism) ను సమర్థించెడి మరియొక వర్గమునకు మధ్య నడచుచున్న శుష్క వాదోప వాదములను చూచుచునే యున్నాము. మహమ్మదు యొక్క అనుచరులవలె వారు మాటనవల్ల కాని పనిని యుద్ధముచేసి సాధించ నిశ్చయించినారు.

కనుక ఆ శుష్కవాదమును వదలివేసి నీకున్నూ, నాకున్నూ ఏకాభిప్రాయములుగా వున్న కొన్ని విషయముల గురించి ఇప్పుడు చెప్పెదను. నీవు మాస్కో (అనగా రష్యా) విధానమును అనుసరించి మార్పు తీసుకొనిరా గోరెదవు. నేను అమెరికా విధానమును అనుసరించి మార్పు తీసుకొనరా గోరెడివాడను. మనలను వేరుచేసెడి సిద్ధాం తములకంటె మన యిద్దరకుగల వేరు వేరు అభిప్రాయములు చాల ముఖ్యమైనవి.

నీవు, నేను నిజంగా దేనిని కోరుచున్నామో, దేని కొరకై ఇద్దరము కలిసి పోరాడ దలచితిమో, దేనికొరకై మనము ప్రాణమర్పణకూడ చేయ సంసిద్ధులమగుచున్నామో అది ధనముకొరకు లేక ఒక వర్గముపై ఆధిపత్యముకొరకు కాదు. వేతనములు ఎంత ఎక్కువగా లేక ఎంత తక్కువగా నుండవలెను ? లేక రైల్వేలు, విద్యుచ్ఛక్తి కర్మాగారములు కొన్ని వ్యాపార సంస్థలు జాతీయము చేయబడవలెనా ? లేక

వ్యక్తుల పరముగా నుండవలెనా? అనెడి ఆర్థిక సమస్యలు గురించి, మనకంత ప్రత్యేక పట్టింపు అవసరము లేదు. మనము కోరెడి రాజ్యాంగంలో ప్రతి మానవునకు గౌరవము సంపూర్ణ స్వాతంత్ర్యము లుండవలెను. ఏదేని ఒక విషయమునుగురించి ఆలోచించుకొనుటకు, మాట్లాడుటకు ప్రతివానికి హక్కుండ వలెను. ప్రతివాడు తనయొక్క అభిప్రాయముల గురించి వ్రాయుటకు, తన ఆలోచనలు, తన ఉద్దేశ్యములు, తన ఆదర్శ ములు ఇతరులవాటికన్న మిన్నయని వాదించుటకు హక్కు కలిగియుండవలెను. ఆతడు స్వతంత్రుడుగానుండి ఎటువంటి ఉద్దేశ్యమునైనను అనగా అవిధేయమైనటువంటియు లేక తిరుగుబాటు చేసెడి ఉద్దేశ్యముతో కూడినటువంటియు ఆలోచనలనైనను పోలీసువారుగాని అన్నిటికంటె బలమైన ఒక వర్గమునకు చెందినవారుగాని ఆతనిని పట్టుకొందురనిగాని, పట్టుకొని కాల్చివేయుదురనిగాని, లేక చంపివేయుదురనిగాని లేశమయినను భయముండకూడదని మనం కోరుచున్నాము.

అది కాదు. మనమిద్దరమే సమస్యల నెదుర్కొనవలెనో వాటి విషయమై భిన్నాభిప్రాయులం కాము. మానవుల జీవిత ములో వేరు వేరు ప్రమాణములున్నవనియు అందులో ఒకడు ఒక ప్రమాణములోనున్నప్పుడు తనకంటె తక్కువ ప్రమాణం లోనున్న మనుష్యు లెప్పుడున్ను ఏదో ఒక విధమైన తప్పిదమును చేయుచుందు రనెడి విషయమున్నదని మన మిద్దరము అంగీకరించుచున్నాము.

ఈ పైన చెప్పబడిన విషయములన్నింటిలోను మనము ఏకాభిప్రాయులమై యున్నప్పుడు అందులోని ప్రధాన సమస్యలను ఇద్దరమున్నూ అంగీకరింతుము. నీకున్నూ అమెరికా దేశపు ప్రజలకున్నూ మధ్య చెప్పుకోనదగిన అభిప్రాయభేద మేమీా లేదు. అమెరికా దేశపు ప్రజలు చాలాకాలము క్రితమునుండియు మిగతా నిజమైన ప్రజాస్వామిక సర్వమానవ సమానత్వ విధానం ప్రకారము నడచెడి (Democratic Socialists) వారందరివలె మంచి ఉద్యమమైనటువంటి జాతివిచక్షణా నిర్మూలన పోరాటంలో నిమగ్నులై ఉండిరని నీకు నిరూపించి ఉన్నాను. ఇది నీ హృదయమును కదలించి ఉండును. మా వలెనే విదేశములలోకూడ చాల మంది ప్రజలు, ఉద్యమములు, నీవంటి వ్యక్తులుకూడ ఈ సందర్భమున పోరాడుచున్నారని అమెరికా దేశీయులము గ్రహించియే యున్నాము. హృదయ పూర్వకంగా ప్రజాస్వామిక అభిప్రాయాలు కల్గియున్న స్కాండినేవియా దేశం వారు, ఇంగ్లండు, స్విట్జర్లండు, హాలండు, ఫ్రాన్సు, బెల్జియం దేశాల ప్రజలు మరియు ఐరోపాలోని ఇతర దేశాలవారు కూడ మావలెనే జాతి విచక్షణారహితమైన సమాజమును సాధించిరి. ఆస్ట్రేలియాలోని, న్యూజిలాండులోనివారు ఆఖరుకు మా పొరుగు దేశమైన కెనడాలోనివారుకూడ అటువంటి సమాజమును సాధించిరి. బ్రిటనుకూడ కార్మిక ప్రభుత్వంతో ఈ విషయమును సాధించినది! నేను వారినికూడ ఈ జాబితాలో చేర్చినాను. సర్వమానవ సమానత్వ విధానము

ననుసరించని ఇంగ్లండు దేశపు ప్రజలలో చాలమంది 1945 లో కార్మికులకు వోట్లనిచ్చుటకు కారణం ప్రాచీన సంప్రదాయమైన జాతివిచక్షణను తొలగించుటకేనని నేను నమ్ముచున్నాను.

నిరంకుశత్వం, జాతివిచక్షణా విధానాల నిర్మూలనకై విదేశాలలోని ప్రజలు ఎచ్చట పోరాడుచుండినను అమెరికా దేశస్థులు వారి యెడల సానుభూతి కలిగియుండి వారితో మైత్రి చేసికొనిరి. వారు ఎన్నడును ఒక ప్రత్యేక విధానాన్ని గాని, లేక ఉపాయాన్ని గాని వారికి సూచించ ప్రయత్నించ లేదు. ఫ్రాన్సులోని తిరుగుబాటునకు వారు సహాయమిచ్చి ప్రోత్సహించిరి. 19 వ శతాబ్దంలో పోలెండు దేశ ప్రజలకు, హంగరీ దేశమువారికి మరియు గ్రీసు దేశము వారికికూడా ఇట్లే సహాయము చేసిరి. వారు సహాయములు చేయుటవలన అందుకు బదులుగా కార్యముల ననుభవించి అన్ని దేశమునుండియు వెడలగొట్టబడిరి. ప్రజలు స్వాతంత్ర్యం కొరకు ఎచ్చట పోరాడినను 'జెఫర్‌సన్' మరియు లింకన్‌లను తమ నాయకులుగా నెంచుకొని వాషింగ్టన్ వైపుకు ఎదురు చూచెడివారు.

ఆఖరుకు అమెరికా రెండు ప్రపంచ సంగ్రామములలోను జయమును నిర్ణయించుటకు సహాయపడినది. లేనిచో ప్రపంచ మంతయు రష్యాతో సహితముగా యిప్పటికి రెండు పెద్ద నిరంకుశసామ్రాజ్యములుగా విడిపోయి ఉండవలసినది.

ఈ దేశపు ప్రజలు యింకకొంచెము విశాల దృక్పథము తోనుండి జాతి విభేదములు మార్క్సు మరియు లెనిన్‌ల యొక్క నియముల వల్ల కూడ నిర్మూలింప బడగలవని అంగీక రించ కూడదా? యని నీవు అడిగెడి ప్రశ్నకు నేను అట్లు అంగీకరించను. ఏలనన సోవియట్ రష్యావారు చెప్పెడి 'కమ్యూనిజము' (కార్మికవాదము) అనెడి విధానము ఏమనగా, ప్రపంచములో గత శతాబ్దములలో హిట్లరు పరిపాల నలో తప్ప అనుభవించ సంతటి నిరంకుశత్వము తోడను, మరియు జాతి విచక్షణా విధానము పైనాధారపడి యుండెడి ప్రభుత్వమును పునః ప్రతిష్టాపన చేయుట యన్నమాట. ఇప్పుడు నీవు కూడ నావలెనే ఈ విషయములను నమ్మినచో మనకింక అభిప్రాయ భేదముండదు. కనుక ఒక క్షణ కాలము నాయొక్క అభిప్రాయము తప్పని అనుకొందము. సోవియట్ రష్యా దేశస్థులు జాతి విచక్షణ లేకుండ నుండెడి సమాజ మేర్పరచు మార్గమున నున్నా రనుకొందము.

అయితే "రష్యా మరియు అమెరికా రెండున్నూ ఒకే రకపు జాతివిభేదములేని సమాజమును తీసికొనివచ్చునా?" ఏలనన మనము జాతి విచక్షణలేని సమాజమును సాధించుటే మన అంతిమ లక్ష్యము కాదని మనము జ్ఞాపకముంచు కొనవలెను. అది సర్వమానవులకు స్వాతంత్ర్యమును, గౌర వమును కలుగుజేయుటకును, మరియు సమాజమును సౌఖ్య వంతముగా చేయుటకును ఒక మార్గము మాత్రమే. ఈ రెండు దేశములు కూడ ఈ ఉన్నతమైన ఆశయమును నెర వేర్చెద

ముని వాగ్దానము చేయునా ? అట్లు చేయునని నే ననుకొనుచున్నాను.

ఒక సమాజములో నున్న ఉన్నత జాతి, మరియు నిమ్న జాతి అను రెండు చిన్న వర్గములను సమానము చేయుట, లేక ఒక దానిలో మరియొకటి ఐక్యముచేయుట రెండు విధములుగా చేయవచ్చును. అందు మొదటి మార్గము ద్వారా అనగా నిమ్న జాతి వారి పరిస్థితుల నభివృద్ధి పరచి వారిలో నున్న పేదరికమును, దాస్యమును, మరియు వారియెడ కనపరచబడెడి నీచత్వమును పారద్రోలియు, రెండవ మార్గము ద్వారా అనగా ఆవిరిచే నడుపబడెడి కంకర బాటను సమానముగా చదును చేసెడి యంత్రము మోస్తరుగా ఉన్నత జాతి నంతను క్రిందకు తీసికొని వచ్చియు, వారిని పేద వారిని చేసియు, వారి కుండెడి స్వాతంత్ర్యము మరియు గౌరవమును తీసివేసి సమాజములోని భిన్న వర్గములను సమానము చేయచ్చును. నీవు మానవులనందరిని స్వంతంత్రులు గాను, మరియు నీవు వారినందరిని సమానముగా దుఃఖ భాజనులుగా చేయ ప్రయత్నింపవచ్చును.

వాస్తవిక విషయములను చూచిన మేము చాలమంది మిలియన్లతరబడి రష్యాలోని ప్రజలు బానిసశిబిరములలో చాలవరకు క్షామ పరిస్థితులలోను మరియు దాస్యబంధము, దుఃఖములలోను ఉంచబడిరి. వీరికి జతగా యింకను రష్యా యొక్క అధీనము క్రిందనుండెడి దేశములలోని ప్రజలు అసంఖ్యాకములుగా చేర్చ బడిరి. వాదనకొరకు వీరందరు

యిట్లుండుట దురదృష్టవశముచేతనే యని అనుకొనినను, రష్యాలోని ప్రజలయొక్కయు అందులో ముఖ్యముగా రష్యాలోని కార్మికుని యొక్క సాధారణమని చెప్పబడెడి జీవన ప్రమాణము అమెరికాలోని వారి జీవన ప్రమాణము కంటె చాల తక్కువ. 33 సంవత్సరములుగా సోవియట్ కమ్యూనిసులు రాజ్యము చేసిన తరువాత లెనిన్ అటువంటి పరిపాలనవలన ఉత్పత్తి, పర్వత శిఖరమంత భారీ ఎత్తుగా అధికము చేయబడుననియు, జీవన ప్రమాణములు అభివృద్ధి చేయబడుననియు చెప్పియుండగా ప్రజలయొక్క జీవన ప్రమాణములు యిప్పటికి కూడ సోవియట్ రష్యా ప్రభుత్వము కొద్దిమంది విశ్వాస పాత్రులగు విదేశములలోని ఎక్కువగా సిఫార్సుపొందిన వారి కమ్యూనిస్టులను తప్ప ఎవ్వరినిన్ని వారి దేశమునందలి భూతల స్వర్గమును చూచుటకు రానివ్వనంతటి, చాల నమ్మకమైనటువంటి వారి పార్టీలోని కొద్దిమంది సభ్యులను తప్ప తక్కినవారిని విదేశములకు వెళ్ళనివ్వ నంతటి నిరాశాజనకముగా నున్నవి. ఏ మాత్రమైనను పరిస్థితులలో సమానత్వమున్నచో అది చాల తక్కువ ప్రమాణములో మాత్రమే ఉన్నది.

ఈ విషయము ఆశ్చర్యకరముగాలేదా ? మేము క్రొత్త భావములను ప్రోత్సహించు విదేశములలోని నిపుణులను, తత్వజ్ఞులను ఆహ్వానించుచుండగా సోవియట్ రష్యావారు ఒకే విధానమునకు తొత్తులై యుండుటకు గట్టిగా ప్రయత్నించెదరు. ఆలోచన మరియు నాగరికత సంబంధమైన అన్ని విష

యములలోను వారు వర్ణ విచక్షణలేని సమాజము కావలెనని గట్టిగా చెప్పెదరు. మరియూ ఈ ఆశయములను నెరవేర్చుటలో నవ్యమార్గములలో వచ్చెడి అభిప్రాయములను లేక క్రొత్తమార్పులను అట్లు రాకుండ ఆటంక పరచెదరు.

మానవులమధ్య నుండెడి సంబాధములను కొంచెము చూడుము. అమెరికాలోని వాతావరణము సోదర భావముతోడను, పరస్పర నమ్మకములతోడను కూడియుండగా సోవియట్ రష్యా వారు అసహిష్ణుతను, అపనమ్మకమును పెంచెదరు. నీవు యిక్కడ ఒక వుద్యోగము చేయ గోరినచో యిచ్చుట అంతా తెలిసికొన గోరెడ దేమిటంటే: నీవు ఆ పనిని సరిగా నిర్వహించ గలవా? అట్లు నిర్వహించలేవా? యని మాత్రమే. వాస్తవముగా కొంత కాలంక్రితం వరకు ప్రజలు వారు ఏరాజ్యమునకు సంబంధించినవారైనను ప్రభుత్వంయొక్క, అంతరంగిక శాఖలయొక్క ప్రధానోద్యోగులలో నియుక్తులయ్యెడివారు. ఇందుకు మారుగా రష్యాలో సర్వ వ్యతిరేకముగా నున్నది. అక్కడ ప్రతిచోటున అసహిష్ణుత మరియు అనుమానము వ్యాపించి యున్నవి. ఎవ్వరైనను మార్క్సు, లెనిన్ లేక స్టాలిన్ లయొక్క విధాన ములవలన కలిగెడి లాభములను గురించి తన సందేహమును వెలిబుచ్చుట, లేక ప్రస్తుత ప్రభుత్వ విధానమును గురించి తన సందేహమును వెలిబుచ్చుట అనెడి నేరములను చేసినచో ప్రభుత్వ న్యాయ రక్షణ చట్టం ఇచ్చెడి రక్షణను కోల్పోయినవాడు (Outlaw) గా పరిగణింపబడును. అతనియెడల

దయచూపించినవాడు ఆతని దుష్కృత్యములో సహాయ మొనర్చిన వాడగును. ఇటువంటి ఉద్దేశ్యముతో పిల్లలను కూడ కఠినముగా శిక్షింతురు. అమెరికాలోని ప్రజలు ఒండొరులయొక్క హోదాలతో నిమిత్తం లేకుండా గౌరవించుకొనుచుండగా సోవియట్ రష్యాలో ఉన్నత స్థాయిలో నున్నవారు వారికంటె తక్కు స్థాయిలో నున్న వారిని అందులో ముఖ్యముగా వారి నౌకరులను, ఆరితేరని కూలీలను మొదలైన వారిని గర్వంతో, అసహ్యంగా పిలచెదరు.

అమెరికాలో స్వాతంత్ర్యమనెడి తిరుగుబాటు ఉద్దేశ్యము ఎల్లప్పుడు పెంచబడుచుండగా రష్యాలో అది పూర్తిగా అణచివేయబనది. ఆ దేశములోని ప్రజలు ఏ ప్రశ్నను అడుగలేనంతటి పిరికిపందలుగా చేయబడినారు. ఉదాహరణకు, ఎప్పుడు ఎన్నడున్నూ పొరపాటుపడని ఆదర్శ పురుషులని చెప్పబడిన ట్రోట్‌స్కీ, లేక బుఖరిన్‌లు హఠాత్తుగా ఒక్కమారుగా రాజద్రోహులని నిందించబడినను, లేక ఎల్లప్పుడున్నూ శత్రువులుగా పరిగణింపబడెడి జర్మనీ దేశస్థులను ఒక్కమారుగా మిత్రులని చెప్పి వారికి సహాయము చేయవలెనని చెప్పినను ఎవ్వరున్నూ ఎట్టి విధముగాను ప్రశ్నించలేనంత పిరికిపందలయినారు. సత్యము, స్వాతంత్ర్యము మాయగా మారినవి.

నీతికి కూడ అదే గతి పట్టినది. వర్ణవిచక్షణపై నాధారపడియుండెడి విధానముయొక్క ధర్మస్మృతిలో

నుండెడి లోపములను గురించి నేను నీకు వ్రాసిన ఉత్తరము జ్ఞాపకముండియే యుండును. అందులో నా ప్రధాన ఉద్దేశ్యమేమనగా జాతి విచక్షణలేని సమాజము అందరికిన్నీ ఒకే రకపు న్యాయమును కలుగజేయును. కాని, మనము యింకను చాల మంచి సమాజమును నిర్మించుట కొరకు పాటు పడుచుండగా, మన లోపములను సవరించుకొనవలెననుకొనుచుండగా సోవియట్ రష్యావారు ఆ లోపములను యింకను పెద్దవిగా చేయుచున్నారు. వారు మతము, నీతి, ధర్మములు కేవలము నిరంకుశ నియమము లనియు, అవి సామాన్య ప్రజలను పీడించుటకునూ అధఃపతనమొనరించుటకునూ మాత్రమే కొంతమందిచే కనిపెట్టబడినవని నిశ్చయించుకొనినారు. అయినను ఆంతరంగికముగా వారు సామాన్యనైతిక ధర్మములను గుర్తించవచ్చును. కాని, సోవియట్ రష్యాలో ప్రతి విషయమునకున్నూ, రాజకీయములకున్నూ ముడిపెట్టబడి యుండుటచే రాజకీయములను ఆ నైతిక ధర్మములు ఏ మాత్రము సూచించినను అవి కేవలము పెట్టుబడిదారీ విధాన నటన మాత్రమేయని చెప్పెదరు. ఆ విధముగా నైతిక పథములో కూడ రష్యావారు సమానత్వమును అతి నీచముగా నుంచినారు.

ఆఖరుకు మానవమర్యాద పూర్తిగా తుడిచిపెట్టి వేయబడుటను గూర్చి మనము ఆలోచింతము. ఆ దేశములో ఉన్నతోద్యోగులు, యింజనీర్లు, శాస్త్రజ్ఞులు మొదలుగాగల అందరు ఎన్నటికి విడిపోయినటువంటి పొగమంచువంటి

భయము, అరక్షణములతో ఆవరింపబడి యున్నారు. ఎవ్వరున్నూ రహస్య పోలీసులు చేసెడి ఘాతుక కృత్యముల నెదుర్కొనజాలరు. మరియు ప్రతివాడున్నూ రహస్యముగా ఎచ్చటనైనను ఒక వుద్యోగి ఆడిన అబద్ధము, లేక దౌర్జన్యము విషయమైగాని తన అనంగీకారమును వెలిబుచ్చినను లేక యింకొక డెవడైనను ప్రతీకారము తీసుకొనగోరినను, లేక అతడు యింకెవరి విషయములోనైన సాక్ష్యమిచ్చుటకున్నూ రాత్రికి రాత్రే తీసుకొని పోబడుదునో లేక భయపెట్టబడుదునో లేక హింసింపబడుదునోయనెడి భయముతో ఎల్లప్పుడును ఉండును. ప్రతివాడున్నూ తన భార్య, పిల్ల సోదరుడు లేక తల్లియో తండ్రియో తీసికొని పోబడి ఖైదులో నుంచబడుదురో, హింసించబడుదురో లేక చంపబడుదురో యనెడి భయముతో నుండవలెను. ఎప్పుడు ఎవ్వరికేమి ప్రమాదము సంభవించునో ఎవ్వరికిన్నీ తెలియదు. ఈ విషయములో అందరూ సమానులే.

"నేను సమానత్వమును సామాజములో స్థాపించుటకు రెండే పద్ధతులనెరుగుదును. అందు ఒక విధముచే అందరు మానవులకు సమాన హక్కులు ఇవ్వబడవలెను. రెండవ మార్గం ప్రకారం ఎవ్వరికిన్నీ ఏ విధమైన హక్కులున్నూ ఉండకూడదు." అని టాక్‌విల్లీ చెప్పిన జ్యోతిష్యము అమలులోనికి వచ్చినది. ఇగ్లండు, అమెరికా దేశాల పద్ధతిలో సమాజము నేర్పాటు చేసికొనిన దేశములకు, అందరు మానవులకు ప్రభుత్వాధికారముండవలెనా లేక అధికారమంతయు

కేవలము ఒక వ్యక్తియందే ఉంచబడవలెనా యనెడి రెండు మార్గములకు మధ్యే మార్గము కనిపించదు.

వాస్తవమునకు మానవునిలో నుండెడి సహజమైన, న్యాయమైన కోరిక యగు సమానత్వం ఆతనికి శక్తిని, గౌరవమును ఇచ్చును. ఈ కోరిక తక్కువస్థాయిలోనున్న మానవుని అత్యున్నత స్థాయికి పంపును. కాని, మానవ హృదయములో సమానత్వం యెడల ఒక దుర్మార్గమైన వాంఛ కూడియున్నది. అది అలసత్వములోనున్న వారిని, బలీయులైన వారిని అధోగతికి తేవలెననెడి అభిప్రాయమును కలుగజేసి మానవుడు స్వాతంత్ర్యంతోబాటుగా ఉన్న అసమానత్వము కంటె దాస్యములో నున్న సమానత్వమును కోరుకొనునట్లు చేయును. (ఈ పైని చెప్పబడు మాటలు నా స్వంత మాటలు. అవగా గ్రంథకర్తవి.)

మన ప్రస్తుతకాలపు చరిత్రలో సమానత్వము, జాతి విచక్షణా నిర్మూలనముల కొరకు ప్రజలయొక్క వాంఛితం ఒక గొప్ప సంచలనగా పరిణమించినది. దానిని అమెరికా స్వాతంత్ర్యంతోడను, రష్యా స్వాతంత్ర్యంతోడను సాధించనున్నవి.

అది ఇంకొక విధముగా సాధించ బడలేదు. మానవుని ఉన్నత స్థాయికి తెచ్చుటకు ప్రయత్నము చేసెడి దేశము ఆతనికి స్వతంత్రముగా ఆలోచించుటకు ప్రోత్సహించును. మానవులను అత్యున్నత స్థాయియున్నా, అధిక లాభము పొందనివ్వకుండా చేయుటయే ప్రధాన లక్ష్యముగా పెట్టుకున్న

చోట అట్లు చేయుటకు మార్గములు ప్రజల ఆలోచనములను పరిమితము చేయుట, వారిని సిర్బంధము చేయుట మాత్రమే. ఇవి రెండురకములు:"జాతి విచక్షణ లేనటువంటి" విధానములు. హెన్రీ! నీవు వీనిలో దేనిని కోరుకొందువు?

కాని. ప్రపంచమం దన్ని దేశములలోనున్న అవమానకర విధానములన్నింటితోడను పోల్చి చూచినచో సోవియట్ రష్యాలోని సమాజమెంత జాతివిచక్షణా రహితముగానున్నది? వారు యిదివరలో నున్న అగ్రజాతివారందరిని రూపుమాపుట నిజమే. కాని, వారట్లు చేయుటవలన యింకో క్రొత్త అగ్ర జాతిని ఏర్పాటుచేయుట లేదా? ఆరంభములో యించు మించుగా ఒక దశాబ్దము కాలముపాటు ఎక్కువగా వర్గ రహితమైన సమానత్వము కనబడినది. కాని, యిటీవలి ప్రకటనల వలన ఉన్నత, మధ్య తరగతి, క్రింద తరగతి ఉద్యో గస్తులమధ్యను, మరియు పై శ్రేణికి చెందిన కార్మికులు కాయకష్టపడి పనిచేసెడి క్రింది శ్రేణికి చెందిన కార్మికులకు మధ్యను వైషమ్యములు పెరిగినవని ఋజువగుచున్నవి.

సోవియట్ అధినేతలయొక్క జీవన ప్రమాణమును గమనించినచో వారు తమను ఒక ప్రత్యేక వర్గమునకు చెందిన వారిగా భావించుకొనుచున్నట్లు కనబడుచున్నవి. యింకను రాజ్యాధికార్ల యొక్కయు, యింజనీర్ల, సైనికోద్యోగుల కుమారులను విద్యాలయములలోను, కళాశాలలోను ఉన్నత విద్య కొరకు చేర్చుకొనుటలో ప్రత్యేక సదుపాయము లివ్వబడుచున్నవి. తదుపరి వారు ప్రభుత్వ శాఖలలోను

పరిశ్రమలలోను, సైన్యములోను వారికిష్టమైన పదవుల నలంక రించుచున్నారు. ఆ రాజ్యాధికార్లు, పరిశ్రమల యజమానులు, యింజనీర్లు, సైనికోద్యోగులున్నూ కలసి ఒక క్రొత్త, వంశ పారంపర్యముగా వచ్చు జాతివిభాగమువలె ఒక వర్గముగా ఏర్పడినారు. ఇదివరలోనున్న జాతులవారివలె వీరు వీరియొక్క ప్రత్యేక సదుపాయములను నిలుపుకొనుటకై తొందరగా ప్రయత్నముచేయుచున్నారు. స్టాలిన్ యొక్క కుమారుడు పిన్నవయస్కుడైనను ఒక పెద్ద సైనికోద్యోగి అయినాడని వినుటతోడనే నాకు బాధాకరముగా ఆ 'రోమ నోవ్స్' (Romanovs) మరియు ఆ "హేప్స్ బర్గ్స్" (Hapsbargs) జ్ఞప్తికి వచ్చుచున్నారు.

ఇదంతయు చూచిన యెడల జాతి విచక్షణా విధాన ముతో జరిగెడి పరిపాలనవలె ఉన్నది. తప్పకుండా నీవు అది క్రూరత్వమని ఒప్పుకొనవలెను. ప్రతి క్రూరుడున్నూ కూడ ఒక విధముగా హెచ్చు తగ్గులను సమముచేసినవాడై యున్నాడని నీకు జ్ఞాపకము చేయుచున్నాను. 'డైయోనైసిస్' 'ప్లేటో'ను తన బానిసగా చేసుకొనెను. నెపోలియన్, హిట్లరు, మరియు యింకా యితర నియంతలు వారికొరకున్నూ, వారి సేవకుల కొరకున్నూ యింకను ఎక్కువ అధికారమును సంపాదించుట కొరకై ధనికులను, ఉన్నత స్థాయి లోని వారిని హీనపరచి ఖ్యాతిపొందిరి. ఐనప్పటికిన్నీ వారు వర్ణ విచక్షలేని సమాజమును స్థాపించలేక పోయిరి.

దానిని ఒక వర్ణ విధానముపై నాధారపడియున్న సమాజము, లేక నిరంకుశత్వము, లేక సామాన్య ప్రజలతో కూడుకొన్న స్వర్గము, లేక మరి యేదైన పేరుతో పిలువుము. ఆ సోవియట్ విధానము మాత్రము నీవు, నేను దేనినైతే కోరుచున్నామో, దేనికొరకైతే పాటుపడితిమో అటువంటి మానవునిలోని మంచికి పూర్తిగా వ్యతిరేకము. బహుశా నీవు అమెరికా ప్రజాస్వామ్య విధానముయొక్క మంచిని గురించి పూర్తిగా ఒప్పుకొనక పోవచ్చును. నాకున్నూ, నా వంటి యితరులకున్నూ అమెరికా యిచ్చిన సాటిలేని తలంపునకు నీవు అసలు ప్రత్యుత్తర మివ్వక పోవచ్చును. ఆవిధానములో నుండెడి లాభములను గూర్చి వరుసగా నేను వ్రాసిన కొన్ని ఉత్తరములలో తెలియజేసితినని ఎట్లు అనుకొనగలను? ఐనప్పటికిన్నీ స్వేచ్ఛా పురుషులు నడువగలైడి మార్గమునకు నిన్ను త్రిప్పగల్గితి ననుకొనుచున్నాను. దాస్యమునకున్నూ, మృత్యువునకున్నూ కసితీరెడి మార్గము నెంచుకొనకుము. వస్తుతః ప్రపంచమునంతను విడదీయుచున్నటువంటి సమస్యలయిన స్వాతంత్రము, మరియు దాస్యముల మధ్య పోరాటములో మాతో కలసి పనిచేయుము. లేచి నిలబడి నీ కన్నుమూసెదనని బెదిరించెడి మోసము నెదుర్కొనుము.

నా ప్రియమైన స్నేహితుడవైన హెన్రీ! నీవున్నూ, నేనున్నూ ఒక పని చేయవలసియున్నది. నిజముగా అది ఒకే పని. దానిని యిద్దరమున్నూ కలసి చేయుదము.